సరస్వతీ గ్రంథ మండలి:

# రెండు నాటికలు

## (ఆత్మాభిమానం, దేశభక్తులు)

అనువాదం:

మొహమ్మద్ ఖాసింఖాన్

ఎం. ఎ.





# రెండు నాటికలు

(ఆత్మాభిమానం — దేశభక్తుడు)

అనువాదం

మొహమ్మద్ ఖాసింఖాన్, ఎం. ఏ.



సర్వస్వామ్యము: అక్కిపల్లి వారిది

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# TWO PLAYLETS

## The Hasty Heart

BY

JOHN PATRIC



&

## The Patriots

BY

SIDNEY KINGSLEY



Translated by

**Md. QASIM KHAN, M.A.**

First Edition 5000 Copies - February 1959 - **Price Rs. 2-00**





Publishers: ADDEPALLY & CO.

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A.P.)

# ఆత్మాభిమానం

## మొదటి అంకం

### రంగం:

[ఆస్సాం బర్మా యుద్ధరంగం వెనక ఎక్కడో వొకచోట తాత్కాలిక బ్రిటిష్ జనరల్ ఆసుపత్రిలో జబ్బునుంచి కోలుకుంటున్న రోగుల వార్డు లోపలిభాగం. వెదురుతాటలతో, వెదురుతడకలతో, గడ్డితో, మట్టితో కట్టిన పూరిల్లది. వెదురుతడకలతో చేసిన వార్డు తలుపు రంగానికి ఎదురుచేతివైపున ఉంటుంది. మధ్యనున్న ఒక చిన్నతలుపు సిస్టరు ఆఫీసుది. కుడివైపు మరో చిన్నతలుపు. అది స్నానాల గదిది. కుడిచేతివైపు ఒక కిటికీ ఉంది. అది స్నానాలగదిలోనికి తెరుచుకుంటుంది. వెనకగోడకి సిస్టరు ఆఫీసుకు రెండువైపులా రెండు పెద్దకిటికీలున్నాయి. అన్నికిటికీలకూ బైటనుంచి వేలాడుతూ పెద్ద వెదురుమూతలున్నాయి. తెరిచినప్పుడల్లా వెదురుగడ బోటు పెట్టి నిలుపుతారు.

గుబురుగా పెరిగిన వెదురుపొదల్లూ, నేలకోసం వెతుకులాడుతూ ఉన్న పెద్ద ఊడలుకలిగిన మర్రిచెట్లూ మూలాన ఒక పచ్చటి తెరగా ఏర్పడి ఆకాశపు అంచుల్ని కప్పేస్తున్నాయి.

వార్డులో ఆరుమంచాలున్నాయి. వాటితలలు వెనకగోడవైపు సిస్టరు తలుపుకు రెండువైపులా మూడేసిచొప్పున అమర్చిఉన్నాయి. ప్రతిమంచంపక్కనా ఒక చిన్నబల్ల ఉంటుంది. లోపల వస్తువులు అంతే ఎక్కువగా లేకపోయినా వార్డు రంగురంగువస్తువులతో ప్రకాశవంతంగానూ. ఉత్సాహకరంగానూ ఉంది. పక్కలమీద మంచి ఎర్రటిదుప్పట్లు కప్పిఉన్నాయి. వార్డులో మనుషులు తెల్లటి పైజామాలు తొడుక్కొని ఉన్నారు. మంచంమీద పడిఉండ

-క్కి లేనట్లోగాలు కిటికీలు, పక్కాలూ తొలుగాల్ని ఉన్నారు.

తెరచేటప్పటికి తెలతెలవారుతూ ఉంది. వార్డులో ఒకే కాంతి పైన ఉంది. మీద ఒక లాంతరు వేలాడుతూ ఉంటుంది. ప్రతిమంచానికీ ఒక తెల్లటి దోమతెర వేసి ఉంటుంది. కుడిచేతివైపు నుంచి మూడోమంచం ఖాళీగా ఉంటుంది.

మొహకనైన ఒక బ్రిటిష్ సిపాయి బూట్లు టకటకలాడించుకుంటూ ఎడమపక్కనుంచి ప్రవేశిస్తాడు. కుడిచేతివైపు కిటికీ తెరవాలని చూస్తూ ఆగిపోయి పాటు ప్రతిమంచం మీదా లైటువేస్తాడు. కిటికీ ప్రక్కనుంచి అటువారి పాదాలకు ఎండ వస్తుంది. అవతలి పక్షుల కలకలారావం వినిపిస్తుంది.]

సిపాయి - (కిటికీ తెరవడానికి మొదటిమంచానికీ రెండో మంచానికీ మధ్య నడుస్తూ) లేవండి, లేవండి! (ఎవ్వరూ కదలరు. కిటికీ ఎదురుతో పక్క వారిచే కైటిగోడ కానించి డోలుగా పెడతాడు. మరింత బిగ్గరగా అరుస్తాడు.) లేవండి! (ఊపిరి ఎవ్వరూ కదలరు. రెండు మంచాల మధ్యా వచ్చి పరుపులకింద మడిచివున్న దోమతెరఅంచులు పైకి లాగుతాడు. దోమ తెరల్లో ఏమీ చలనం లేదు. అక్కడినుంచి లాంతరు దగ్గిరికి వెళతాడు. దాన్ని కిందికి దించి ఆర్పేస్తాడు.) లేవండి! ఉల్లాసంగా లేవండి! (నాలుగో మంచం దగ్గిర ఆగి దాన్ని గట్టిగా పట్టి ఊపుతాడు) యాంక్! లేవవయ్యా! (పదిసార్లు లేపి, కేకలువేస్తే తప్ప లేవరని ప్రతిరోజూ అనుభవంవల్ల సిపాయికి తెలుసు. మరొకసారి మంచం ఊపుతాడు. దోమతెర అంచులు పరుపుకింద నుంచి లాగుతాడు.) వేగం, వేగం! లెండి.

(దోమతెరలోంచి చిందరవందరగా ఉన్న జుత్తుగల తెల్లటితల బయటికిపెట్టి యాంక్ నిద్రమత్తులోనే తన పెదవులను భాగంగా చేతు లతో రుద్దుకుంటాడు. అతడు పొట్టిగా బాటైన మనిషి - అందం కంటే ఎక్కువ అంగసౌష్టవం కలవాడు. అతడి తీరు సోమరితనాన్ని కాక తీరికను సూచిస్తుంది. కొద్దిగా నత్తుతూ మాట్లాడతాడు. నిట్టూర్పులా చిటికెలు విరవడమో, అరిచేతిమీద గుద్దుకోవడమో చేస్తాడు. అతడులేచి మంచంమీద కూచున్నాడు. దోమతెర అతడి వెనక వేలాడుతూ ఉంటుంది.)

యాంక్ - ఎ ఎ ఎ ఎ (మెటికలు విరుస్తాడు) ఎందుకు (మంచంమీద చరుస్తూ) నువ్వు చచ్చిపోవు ?

సిపాయి - (నిర్లక్ష్యంగా) త్వరగా స్నానం అది చేసి, నీతువ్వాలు తవాలీ కట్టుకో. రోగులనందరినీ ఇక్కడినుంచి ఖాళీ చేయిస్తున్నాము.

యాంక్ - ఓరి పిడుగా! ఇంత చప్పగా ఉందేమి ఈవేళ నిహరాచికం ? (స్లిప్పరు తొడుక్కుంటాడు. లేచి నిలబడి, దోమతెర చుట్టి మంచం మీద కడతాడు.)

సిపాయి - అలా అంటేనే మీచవటలందరూ తొందరగా లేస్తారు. (ఐమా, అమూ మంచాల దగ్గిరికి వెళతాడు. కిటికీ తెరవడానికి మంచాలమధ్యకి వెళుతూ, వాటి దోమతెరలు లాగేస్తాడు.)

యాంక్ - రేపటికి మరొకటి ఏదైనా అ—అ—ఆలోచించు. ఖాళీ చేయిస్తున్నారా? అహ్హాహ్హా! (తృప్తిగా అవులిస్తాడు.) అహ్హాహ్హా!

సిపాయి - (అయిమా, అమూ మంచాలు ఊపుతూ) రండి, రండి! ఆసుపత్రిని నిప్పంటుకుంది. వర్షం ఆరంభమైంది! విమానాల దాడి జరుగుతుంది. భూకంపం వస్తుంది. (వాష్టు దాటి, కుడిచేతివైపు ఉన్న స్నానాలగదికి వెళతాడు.) మీపుణ్యముంటుంది లేవండయ్యా! అప్పుడే నాకు అరగంట ఆలస్యమైంది. (బైటికి వెళ్ళిపోతాడు)

(ఆరో మంచంమీద ఉన్న డిగ్గరు లేచికూచుంటాడు. దోమతెర తొలగించి మెల్లగా బైటికి వస్తాడు. యాంకువైపు ఉత్తమాప్రులు చూస్తాడు. డిగ్గరు ఆస్ట్రేలియావాడు. సుమారు ముప్ఫై యేళ్ళుంటాయి. నల్లగా ఉంటాడు. మనిషిలో ఒకవిధమైన ఆతురత కనిపిస్తూ ఉంటుంది. వైఖరిలో నాశవికమైన విశ్వాసం కొంత ఉంటుంది. అరవై సంవత్సరాలు వచ్చినా ఒంటిపిల్లకొన్ని యవ్వనలక్షణాలు నిలిచి ఉంటాయి. కండరాలు తేరి మంచిబలంగా ఉంటాడు. తన రెజిమెంటులో తాను బాక్సింగ్ ఛాంపియన్.)

డిగ్గరు - ఆహా! ఒక ముద్దుతోనూ, ఒక తియ్యటి మాటతోనూ లేపితే ఎంత బాగుండేది!

యాంక్ - అధమం ఒక కప్పు కాఫీతోనైనా!

డిగ్గరు - అబ్బా, నాకింకా నిద్ర వదలలేదు. వెంటనే లేచి నిలబడేటంత తొందరగా నాజీవితంలో నన్ను ఎవ్వరూ లేపలేదు. (డిగ్గరు మంచంమీద పడి

యాంక్ - ఛ ఛ ఛ ఛ (మెటికలు విరుస్తాడు) ఎంతకీ (మంచంమీద పడుతూ) నిద్ర వచ్చిపోదు?

సిపాయి - (నిర్లక్ష్యంగా) త్వరగా స్నానం అది చేసి, నీతమ్మా తవాలి కట్టురో. రోగుల్నందరినీ ఆక్కడినుంచి ఖాళీ చేయిస్తున్నారు.

యాంక్ - ఏది ఏమైనా! ఇంత పొద్దుగా ఉంచేమి ఈవేళ నిద్రరాదేం? (స్లిప్పరు తొడుక్కుంటాడు. లేచి నిలబడి, దోమతెర చుట్టి మంచం మీద పడతాడు.)

సిపాయి - అలా అంటేనే మీదవబలంవహా తొందరగా లేస్తారు. (ఐమా, అమా మంచాల దగ్గిరికి వెళతాడు. కిటికీ తెరవడానికి మంచాలమధ్యకి వెళుతూ, వాటి దోమతెరలు లాగేస్తాడు.)

యాంక్ - రేపటికి మరొకటి పెద్దైతా అ–అ–ఆలోచించు. ఖాళీ చేయిస్తున్నారా? అహ్హహ్హా! (తృప్తిగా ఆవులిస్తాడు.) అహ్హహ్హా!

సిపాయి - (అయిమా, అమా మంచాలు చూపుతూ) రండి, రండి! ఆసుపత్రికి నిప్పంటుకుంది. వర్షం ఆరంభమైంది! విమానాల దాడి జరుగుతుంది. మాకంత పోతుంది. (వాష్ దాటి, కుడిచేతివైపు ఉన్న స్నానాలగదికి వెళతాడు.) మీపుణ్యముంటుంది లేవండయ్యా! అప్పుడే నాకు అరగంట ఆలస్య మైంది. (బైటికి వెళ్ళిపోతాడు.)

( ఆరోమంచంమీద ఉన్న డిగ్గరు లేచికూచుంటాడు. దోమతెర లాగించి మెల్లగా బైటికి వస్తాడు. యాంకువైపు చిత్రమైనాపులు చూస్తాడు. డిగ్గరు ఆస్ట్రేలియావాడు. సుమారు ముప్పై యేళ్ళుంటాయి. సన్నగా ఉంటాడు. మనిషిలో ఒకవిధమైన ఆతురత కనిపిస్తూ ఉంటుంది. వైఖరిలో నాశవికమైన విలాసం కొంత ఉంటుంది. ఆరవై సంవత్సరాలు వచ్చినా పిటీవాళ్లకొన్ని యవ్వనలక్షణాలు నిలిచి ఉంటాయి. కండరాలుతేరి మంచిబలంగా ఉంటాడు. తన రెజిమెంటులో తాను బాక్సింగ్ ఛాంపియన్.)

డిగ్గరు - ఆహా! ఒక ముద్దుతోనూ, ఒక తియ్యటి మాటతోనూ లేపితే ఎంత బాగుండేది!

యాంక్ - అధమం ఒక కప్పు కాఫీతోనైనా!

డిగ్గరు - అబ్బా, నాకింకా నిద్ర వదలలేదు. వెంటనే లేచి నిలబడేటంత తొందరగా నాజీవితంలో నన్ను ఎవ్వరూ లేపలేదు. (డిగ్గరు మంచంమీద పడి

పక్కాసె తెనిరోగులు నీలి ట్రౌజర్లూ, చొక్కాలూ తొడుక్కొని ఉన్నారు.

తెరచేటప్పటికి తెల తెలవారుతూ ఉంది. వార్డులో ఇంకా చీకటే ఉంది. మీద ఒక నీలిలాంతరు వేలాడుతూ ఉంటుంది. ప్రతిమంచానికీ ఒక తెల్లటిదోమ తెర వేసి ఉంటుంది. కుడిచేతివైపు నుంచి మూడోమంచం ఖాళీగా ఉంటుంది.

యువకుడైన ఒక బ్రిటిష్ సిపాయి టార్చిలైటు పట్టుకొని రంగం ఎడమపక్కనుంచి ప్రవేశిస్తాడు. కుడిచేతివైపు కిటికీ తెరవాలని వెళ్తూ అతడు దారిలో ప్రతిమంచంమీదా లైటు వేస్తాడు. కిటికీ విప్పేసరికి ఆ చీకటి వార్డులోపలికి ఎండ పొదలా వస్తుంది. ఆవరణలో పక్షుల కలకలారావం వినిపిస్తుంది.]

సిపాయి - (కిటికీ తెరవడానికి మొదటిమంచానికీ రెండో మంచానికీ మధ్య నడుస్తూ) లేవండి, లేవండి! (ఎవ్వరూ కదలరు. కిటికీ వెదురుతో ఎత్తి దానినే బైటిగోడ కానించి దోటుగా పెడతాడు. మరింత బిగ్గరగా అరుస్తాడు.) లేవండీ! (ఈసారీ ఎవ్వరూ కదలరు. రెండు మంచాల మధ్యా వచ్చి పరుపులకింద మడిచివున్న దోమతెరఅంచులు బైటికి లాగుతాడు. దోమ తెరల్లో ఏమీ చలనం లేదు. అక్కడినుంచి లాంతరు దగ్గిరికి వెళతాడు. దాన్ని కిందికి దించి ఆర్పేస్తాడు.) లేవండి! ఉల్లాసంగా లేవండి! (నాలుగో మంచం దగ్గిర ఆగి దాన్ని గట్టిగా పట్టి ఊపుతాడు) యాంక్! లేవయ్యా! (పదిసార్లు లేపి, కేకలువేస్తే తప్ప లేవరని ప్రతిరోజు అనుభవంవల్ల సిపాయికి తెలుసు. మరొకసారి మంచం ఊపుతాడు. దోమతెర అంచులు పరుపుకింద నుంచి లాగుతాడు.) వేగం, వేగం! లెండి.

(దోమతెరలోంచి చిందరవందరగా ఉన్న జుత్తుగల తెల్లటితల బయటికిపెట్టి యాంకు నిద్రమత్తులోనే తన మెడవెనక భాగం చేతులతో రుద్దుకుంటాడు. అతడు పాతికేళ్ళుదాటిన మనిషి - మామూలు కంటె ఎక్కువ అంగసౌష్ఠవం కలవాడు. అతడితీరు సోమరితనాన్ని కాక తీరికను సూచిస్తుంది. కొద్దిగా నట్టుతూ మాట్లాడతాడు. నట్టినప్పుడల్లా చిటికెలు విరవడమో, అరిచేతిమీద గుద్దుకోవడమో చేస్తాడు. అతడులేచి మంచంమీద కూచున్నాడు. దోమతెర అతడి వెనక వేలాడుతూ ఉంటుంది.)

యాంక్ - ఎ ఎ ఎ ఎ (మెటికలు విరుస్తాడు) ఎందుకు (మంచంమీద చరుస్తూ) నువ్వు చచ్చిపోవు ?

సిపాయి - (నిర్లక్ష్యంగా) త్వరగా స్నానం అదీ చేసి, నీతువ్వా తవాలీ కట్టుకో. రోగులందరినీ ఇక్కడినుంచి ఖాళీ చేయిస్తున్నారు.

యాంక్ - ఓరి పిడుగా! ఇంత చప్పగా ఉందేమి ఈవేళ నీపరాచికం ? (స్లిప్పరు తొడుక్కుంటాడు. లేచి నిలబడి, దోమతెర చుట్టి మంచం మీద కడతాడు.)

సిపాయి - అలా అంటేనే మీచపటలందరూ తొందరగా లేస్తారు. (ఐదూ, ఆరూ మంచాల దగ్గిరికి వెళతాడు. కిటికీ తెరవడానికి మంచాలమధ్యకి వెళుతూ, వాటి దోమతెరలు లాగేస్తాడు.)

యాంక్ - రేపటికి మరొకటి ఏదైనా అ—అ—ఆలోచించు. ఖాళీ చేయిస్తున్నారా? అహ్హాహ్హా! (తృప్తిగా ఆవులిస్తాడు.) అహ్హాహ్హా!

సిపాయి - (అయిదూ, ఆరూ మంచాలు ఊపుతూ) రండి, రండి! ఆసుపత్రికి నిప్పంటుకుంది. వర్షం ఆరంభమైంది! విమానాల దాడి జరుగుతుంది. భూకంపం మొతుంది. (వాస్తు దాటి, కుడిచేతివైపు ఉన్న స్నానాలగదికి వెళతాడు.) మీపుణ్యముంటుంటె లేవండయ్యా! అప్పుడే నాకు అరగంట ఆలస్యమైంది. (బైటికి వెళ్ళిపోతాడు)

(ఆరో మంచంమీద ఉన్న డిగ్గరు లేచికూచుంటాడు. దోమ తెర తొలగించి మెల్లగా బైటకి వస్తాడు. యాంకువైపు ఆశ్చర్యంగా చూస్తాడు. డిగ్గరు ఆస్ట్రేలియావాడు. సుమారు ముప్ఫై యేళ్ళుంటాయి. నల్లగా ఉంటాడు. మనిషిలో ఒక విధమైన ఆతురత కనిపిస్తూ ఉంటుంది. వైఖరిలో నాగరికమైన విశ్వాసం కొంత ఉంటుంది. అరవై సంవత్సరాలు వచ్చినా ఆటగాళ్లకున్న యవ్వనలక్షణాలు నిలిచి ఉంటాయి. కండరాలు తేరి మంచిబలంగా ఉంటాడు. తన రెజిమెంటులో తాను బాక్సింగ్ ఛాంపియన్.)

డిగ్గరు - ఆహా! ఒక ముద్దుతోనూ, ఒక తియ్యటి మాటతోనూ లేపితే ఎంత బాగుండేది!

యాంక్ - అధమం ఒక కప్పు కాఫీతోనైనా!

డిగ్గరు - అబ్బా, నాకింకా నిద్ర వదలలేదు. వెంటనే లేచి నిలబడేటంత తొందరగా నాజీవితంలో నన్ను ఎవ్వరూ లేపలేదు. (డిగ్గరు మంచంమీద పడి

పుంతపటలనిస కోగ. అందుకోసం యాంక్ ఆసుపత్రిమంచం దగ్గరికి వెళ్ళి దోమ
తెర చుడతాడు.)

యాంక్ - నేను ఉదయం చూ-చూ-చూడలేను. ఇంట్లో ఉన్నప్పుడు నేనప్పుడూ
స్నానం గదిలోకి పోయి సిగరెట్టుముక్క పారేస్తాను. మేజోళ్ళు తడుపు
కుంటాను. అవిఘంగా వె-వె-వె-వెధవ మేజోళ్ళు పోతాయి. (తరవాతి
మంచం వైపు చూసి) డామియాం ఏం గుర్రుపెడుతున్నాడు మన్నా!

డిగ్గవు - వీడికి Adenoids ఉన్నాయి.

యాంక్ - సరిగ్గా నిదానం. హహహాటముప పెంచని పిలిపిస్తుందు విడుగుర్రు.

(సిపాయి రెండుచేతులతో వేసి పట్టుకుంటాడు. ...నుల
నోటిద దగ్గర మంచంపక్క స్తాండుమీద పెడతాడు. ...యితే
చుట్టేపని యాంక్ ప్రార్థిచేస్తాడు.)

సిపాయి : (వార్డంతా కలయచూసి) ఏమయ్యా! మిగతా అందరూ స్నానాల
గదికి పోండి. అందరూ బైటకి వంది. పదినిమిషాల్లో నాష్టాటీ పూర్తవు
తుంది. ఎండెక్కకముందే నేను పడుకోదలుచుకున్నాను. (తరవాత మంచం
పక్క రెండోపళ్ళెం పెడతాడు.) యాంక్! కివ్విని లేపవయ్యా!

యాంక్ : (రెండో మంచం దగ్గరికి వెళ్ళి) సై-సై-సై-సైనిక ఆసుపత్రిలో
బ-బ-బాగుపడతం గొ-గొ-గొ-గొప్ప తప్పు. (సిపాయి స్నానాలగదికి
వెళ్ళుతూ ఉంటాడు) కివీ! లేవవోయి! ప-ప-ప-పక్షులు లేచి గింటల
తరబడి పురుగులు తింటున్నాయి. (దోమతెర లాగి, వెనకవేసి, కివీని కూచో
వానికి సహాయపడతాడు. కివీ న్యూజిలాండువాడు. మంచి పొడగరి. అరడు
గులు పైన ఉంటాడు. ఎర్రటిజుత్తు ఎంతల్లో కొంచెం తెల్లపడింది. శరీరానికి
మామూలుగా వచ్చింది. అతని ఎడమచెయ్యి ప్లాస్టరుకట్టుతో ఉంది. ఒక తీగె
ఆధారంగా అది ఎత్తి ఉంది. అతనికి సుమారు పాతికేళ్ళుంటాయి. యాంక్
అతని మంచంమీది దోమతెర చుడుతుంటాడు.)

కివి : టామీ గుర్రుకోసం ఎవరైనా ఏమైనా చేస్తే బాగుండేది. (కాళ్ళు చాపు
తాడు. పాదవాచి తనకాళ్ళు బ్లాంకెట్ కిందనించి పరుపు చివరివరకు
సాగుతాయి.)

యాంక్ — ఇ—ఇ—ఇ—ఇప్పుడు చూడవోయి, నీమంచం మీద ఇంకెవరో
ఉన్నట్టున్నారు.

కివి — (తనపాదాలవైపు చూస్తూ) శరీమంచమైనా క్రమంగా పొట్టిదైపోతూ ఉండాలి, లేక నాకాళ్ళయినా పొడుగ్గా సాగుతూ ఉండాలి.

యాంక్ — నీకాళ్ళు లాండ్రీకి పంపించు. వాళ్ళు దేన్నయినా సరే, తగ్గించేస్తారు.

(డిగ్గరు పళ్ళతో కొరుకుతుంటాడు. సిపాయి ముంగైకె వేన్నీళ్ళసీళ్ళం తెచ్చి కివి కాచంపక్కన ఒళ్లిమీద పెడతాడు. గిన్నెన వెనక్కి తిరిగి, మొదటిమంచం సమీపుకింద దోమతెర అంచులు లాగుతాడు.)

సిపాయి — లే, లే, నీమంచం మీద ఒక తాచుపాము పడిలి పెడతాను. (మంచం దాటి తలుపువైపు వెడతాడు) క్షణంలో సిస్టరు వస్తుంది. అప్పటికి అందరూ లేచి ఉండాలి. (వెళ్ళిపోతాడు. కివి దోమతెర చుట్టడం పూర్తిచేసి యాంక్ తరవాతి మంచం దగ్గిరికి వెళతాడు.)

యాంక్ — లేచేవేళ అయిందోయి చవటా! (మంచం మీద ఒకగుద్దు గుద్దుతాడు. దోమతెర లేస్తుంది. ఒక నల్లటితల బైటికి వస్తుంది. పొంగిన పెద్దపెదవులూ, తుపాకి బుల్లెట్లాంటి తలకాయా పెట్టుకుని బసుటోబ్లాసమ్ యాంకువైపు చూస్తాడు) లేవవోయి బ్లాసమ్! అర్థమైందా?

బసుటో — (వెర్రిచూపులు చూస్తాడు. చిరునవ్వు నవ్వుతాడు. తనవేలు తనవైపు చూపుకుంటూ) బ్లాసమా!

(బ్లాసమ్ లేస్తాడు. సక్కస్నా నాలగిదిలోకి వెళతాడు. నీలి పైజమా తొడుగుతాడు. టామీ దోమతెరలోంచి బ్రహ్మాండమైన గుర్రు వినిపిస్తుంది. అంతా సూకిలేసి వోకేగొంతుకతో అనుస్తారు.)

డిగ్గరు — వీడి పుట్టి మునగా!
యాంక్ — ఊరుకో!
కివి — వాణ్ణి గుర్రుపెట్టనివ్వండోయి!
} అందరూ కలిసి.

కివి — డిగ్గర్! అతడి కిందనుంచి పరుపులాగీ?

డిగ్గరు — (అతడి పక్కగా పరుపుమీదికి వంగి ఊపుతాడు) లేవవోయిప్రియుడా! (పరుపు గట్టిగా ఊపుతాడు) లేవవోయి మాంసపర్వతం!

(టామీ దోమతెర ఎత్తి బైటికి చూస్తాడు. పొట్టిగా బలంగా ఉంటాడతను. అంటకత్తెరపట్టి ఉంటుంది తల. సంతోషంగానూ, ఎర్రగానూ ఉంటుంది మొహం. చూపులో ఒకవిధమైన ఉల్లాసమూ, తెలివితక్కువ తనమూ కనబడతాయి.)

టామీ — (బాగా లేవకుండానే) ఏమన్నా జరిగిందా?

డిగ్గరు — జరిగింది. నువ్వు వచ్చావు. ఇవాళ దేవుడు తీర్పుచెప్పే రోజు. సెంట్ పీటర్ సేనాధిపతిగా ఉన్నాడు. లెక్కలు చూసుకొని సిద్ధపడు.

టామీ — (ఒక్కక్షణం రెప్పలల్లార్చి) ఇదిగో అక్కడ ఎవరో గుర్రుపెడుతున్నారు.

యాంక్ — (టామీ వైపు తిరిగి చూస్తూ) నిద్రలో ఇంతధ్వని పుట్టిస్తావు కదా, ఆధ్వనికైనా మేలుకోవే?

టామీ — (మంచంమీద కూచుని కళ్ళుతుడుచుకుంటూ) అబ్బబ్బా! ఎంత భయంకరమైన కలోయి! నేను పనిచేస్తున్నానట! చచ్చేటంత పని చేస్తున్నానట! ఎంత అలిసిపోయానంటే ఒక వేలుకూడా ఎత్తలేక పోతున్నానట! (ఒక వేలు ఎత్తుతాడు. దాంతో అలిసిపోయినట్టవుతాడు. తనచుట్టూ చూసి నవ్వుతాడు. ప్రతిమాటకీ కిలాకిలా ఆడపిల్లలా నవ్వుతాడు. డిగ్గరు ఇతనివైపు చూస్తూ ఉంటాడు.)

డిగ్గర్ — ఇతణ్ణి చూడండి. నేను లావాటివాళ్ళని చూశాను, కాని ఇలాంటి మనిషిని ఎక్కడా చూడలేదు. ఈ శరీరం నీకు బరువుగా లేదెటోయి?

టామీ — నువ్వు నాకండరాలు మాత్రమే చూస్తున్నావు. వాటికి ఇప్పుడే విశ్రాంతి ఇచ్చాను.

యాంక్ — మరికొంచెం విశ్రాంతి ఇచ్చావంటే ఉండలాగ దొర్లుతావు.

టామీ — అలా అంటా వేమిటోయి! నాభార్య ఇందులో ప్రతి తులం మాంసాన్నీ ప్రేమిస్తుంది.

(బ్లాసమ్ స్నానాల గదిలోంచి నీలిపైజామా తొడుక్కొని వస్తాడు. అతని ఎదటనుంచి సిపాయి ఒక బాల్చీ, మగ్గులూ పట్టుకొని వస్తాడు.)

సిపాయి — యాంక్! మగ్గులు అందరికీ పంచిపెట్టు.

(యాంక్ మగ్గులు పుచ్చుకొని ప్రతిమంచం దగ్గిరా ఒక్కొక్కటి పెడతాడు)

టామీ — ఓ, నాకు టీ! (ప్రతిమాటా స్వచ్ఛమైన ఇంగ్లీషు ఉచ్చారణతో పలుకుతూ) ఓ నా టీ తీసుకురావోయి. వెయిటరూ! వింటున్నావా?

డిగ్గరు — నువ్వు ఉత్త వెధవ్వి.

సిపాయి — (బసూటోతో) దీన్ని ఏమనుకుంటావు నువ్వు? మంచి ఆరోగ్యాశ్రమ మంటావా? నడవగల ప్రతిరోగీ ఇక్కడ పనిచేస్తాడు. (బసుటో చేతికి

టీ బాల్చీ ఇస్తాడు. (ప్రతి మంచం దగ్గిరికి వెళ్ళి టీ వెయ్యమని సంజ్ఞచేస్తాడు) కానీ కానీ, తొందరగా కానీ. (ఫలహారం తేవడానికి లోపలికి వెళతాడు.)

డిగ్గర్ — దేవుడా ! ఆ సోయాబీను పులుసు తీసుకురాడు కదా !

కివి — నీ ఇష్టం వచ్చిన పందెం వేస్తాను. తప్పక అదే తెస్తాడు.

బసుటో — (కివి మంచం దగ్గిర టీ పోస్తూ) బ్లాసమ్ కూడా అదే పందెం !

టామీ — మన బ్లాసమ్ ఎంత మంచివాడో చూడండి. ఎంత త్వరగా గ్రహించేశాడో ! అయితే ఈ ఒక్కమాటా నేర్చుకోడానికి అతనికి ఒక వారం రోజులు పట్టింది.

(టామీ మగ్గులో బసుటో టీ పోస్తాడు. తరవాత డిగ్గర్ మంచంవైపు తిరిగి అతడిమగ్గులోనూ పోస్తాడు.)

డిగ్గర్ — తెలివితేటలైనవాడు కదూ !

యాంక్ — రెండు మాటలైనా వాడికి ఎందుకు నేర్పలేదోయి ? అప్పుడతను ఆఫీసరయేవాడు. (చిరునవ్వుతో ఆఫ్రికన్ బసుటోవైపు చూస్తాడు.)

బ్లాసమ్ — థాంక్స్ ! ఓయి మానుపాడుడా !

కివి — ఈబసుటోలు మంచి సైనికులు. ఎడారిలో నేను ఒక కంపెనీతో ఉండేవాణ్ణి. నీకు తెలుసా ? ఒక్క దమ్మిడీ జీతం తీసుకోకుండా సంవత్సరమంతా గడిపేస్తారు వీళ్ళు.

యాంక్ — జీతం తీసుకోడం సిగ్గా వీళ్ళకి ?

కివి — అదికాదు. కూడబెట్టి ఉంచుతారు. యుద్ధం అయింతరవాత బసుటోలాండ్‌కి పోయి ఒక పెళ్ళాన్ని, ఒక ఎద్లమందనీ కొనుక్కొంటారు.

టామీ — బహుశా ఒకఎద్దూ, ఒకమందభార్యాలూనూ ఏమో ! (విరగబడి నవ్వుతాడు.)

డిగ్గర్ — (బసుటోపక్షం వహిస్తూ) ఓరి దిబ్బనా్న !

టామీ — నా చలోక్తి నీకు ఇంత కన్నుకుట్టడ మెందుకూ ?

(బ్లాసమ్ తిరిగివచ్చి తనమగ్గులో టీ పోసుకుంటాడు. సిపాయి ఒక ట్రేలో రేకుపళ్ళాలు తెస్తాడు. డిగ్గర్, టామీ, బ్లాసమ్, యాంక్, కివీలకి తలోపళ్ళెం ఇస్తుంటాడు.)

డిగ్గర్ — (సిపాయితో) ఒక పసికుర్రాణ్ణి వేసి ఉడకబెట్టినట్టుంది ఈ టీ రుచి.

సిపాయి — దాని మంచిచెడ్డలు నాతో చెప్పకు. సిస్టర్‌తో చెప్పు. (ప్లేటు యాంక్‌కి ఇవ్వడానికి వెళతాడు.)

యాంక్ — మా కాంగ్రెస్ మేన్‌కి రాస్తాను. అతని పేరు మెచెల్ అనుకుంటాను.

డిగ్గర్ — (తన పళ్ళెం చూసి) దేవుడా! ఇది సోయాబీన్సుతో చేసిందే. వీళ్ళు ప్రతీదీ సోయాబీనుతోనే చేస్తారు. రుచిమాత్రం మామూలు తిండిలా ఉండేట్టే చేస్తారు.

(సిపాయి పళ్ళేలన్నీ ఇవ్వడం పూర్తిచేస్తాడు. అక్కడున్న బాల్చీ, ట్రే ఎత్తుకుంటాడు. టామీ పెన్సిల్‌తో చేస్తూ టీ తాగు తుంటాడు.)

యాంక్ — ఇతడు తింటున్నప్పుడూ గుర్రుపెడతాడు. (కివీవైపు చూస్తాడు. యాంక్ ఒక చేతితో తినడం అతడికి కష్టంగా ఉంటుంది.) కివీ! ఏమైనా సాయం కావాలా!

కివీ — (అక్కరలేదని తల ఊపుతాడు.) వచ్చేవారం నా కట్టు విప్పేస్తానన్నాడు డాక్టర్.

డిగ్గర్ — (పళ్ళికిలిస్తూ) ఓహో! ఒక్క సంవత్సరందాకా ఉంటుందది.

టామీ — నువ్వు ఇక్కడికి వచ్చినప్పుడు గుండుదెబ్బకి నీచెయ్యి ఎగిరి పోయింది. (కిలకిలా నవ్వుతూ) నేను రెండేళ్ళు అంటాను.

కివి — (తింటూ) మనిషి ఎంతదెబ్బకైనా ఆగుతాడు. ఒక జంతువును తుపాకితో కొట్టండి, అది చచ్చిపోతుంది. అలాగే మనిషిని కొట్టండి, దెబ్బతగలనిభాగం ఏమాత్రం మిగిలినా బాగైపోతాడు. ఎన్నిదెబ్బలైనా పడగలడు మనిషి.

టామీ — (అతడితో ఏకీభవిస్తూ గంభీరంగా) నువ్వు సరిగ్గా చెప్పావు. ఎంత రక్తంపోయినా మనిషి సహిస్తాడు.

డిగ్గర్ — నీకు ఇదంతా ఏంతెలుసునోయి! నువ్వు గాయపడ్డది ఒక ఈగవల్లే కదా!

టామీ — నా వీరశౌర్యాలు ఇతనికి మీరు ఎవరైనా చెపుతారా? లేక నన్నే చెప్పుకోమంటారా?

కివి — టామీ! నువ్వు గాయపడ్డప్పుడు ఎక్కడున్నావో చెప్పు?

టామీ — నిద్రలో. (విరగబడి నవ్వుతాడు.)

డిగ్గర్ — ఓహో, ఎంతమహావీరుడవోయి!

టామీ — నేను ప్రశాంతంగా నిద్రపోతున్నాను. ఒక వేడి తుపాకిగుండుముక్క నామెత్తటి మాంసంలో చొచ్చుకుపోయింది.

యాంక్ — ఎక్కడ?

టామీ — నేను బోర్లాపడుకుని ఉన్నాను. (పళ్ళికిలించి నవ్వుతాడు.)

డిగ్గర్ — మెడికల్ ఆఫీసర్ అతడి భుజాలవరకూ తడిపి ఉంటాడు.

టామీ — నాభార్యకి ఏం రాశానో తెలుసా ? యుద్ధంలో ఒక సేనకి నాయకత్వం వహించాననీ, దానిలో ఇలా గాయపడ్డాననీ రాశాను.

యాంక్ — (లేచి బ్లానమ్మమంచంపై తనపళ్ళెం, మగ్గూ పెట్టడానికి వెళుతూ) ఇందులోకి ఎవరువస్తారో?

కివి — బహుశా ఒక కెనేడియన్ రావచ్చు. రాయల్ కెనెడియన్ విమానదళం వాళ్ళు ఇటువచ్చారని సిస్టర్ చెప్పింది.

డిగ్గర్ — ఇంతవరకు ఒక్క యార్క్‌షైర్‌వాడు వచ్చాడుకాడు ఇక్కడికి.

కివి — పందెం ఎవరు వేయదలచుకొన్నారు ? నేను ఐరిష్‌వాడు వస్తా డంటాను. పందెం వేస్తారా ఎవరైనా ?

టామీ — చాలా కాలంనించి స్కాట్ ఎవ్వడూ ఇక్కడికి రాలేదు.

యాంక్ — దేవుడా ! ఇక్కడకు స్కాట్ ఎవడూ రాడని ఆశిస్తాను. (పాజామాల మీదికి నీలిపంట్లాము ఎక్కించడం ప్రారంభిస్తాడు.)

డిగ్గర్ — స్కాట్లంటే నీకు పడదా ?

యాంక్ — ఎంతమాత్రం పడదు. వాళ్ళతోపడినవాళ్ళని ఒక్కళ్ళ నెరగను— మరొకస్కాటుఐతే తప్ప.

కివీ — సిస్టర్ స్కాట్ కదా !

యాంక్ — కాదు, కాదు. ఎంతమాత్రం కాదు.

డిగ్గర్ — ఏదైనాకానీ బహుచక్కగా ఉంటుంది.

టామీ — ఆహా ! ఎంతప్రియమైన దామె !

కివీ — ఆమె వెనక స్కాట్లండులో ఉండేదని నాతో చెప్పింది.

యాంక్ — నాకదంతా తెలుసు. అమె పంతులమ్మగా పనిచేస్తున్నప్పుడు అక్కడుండవలసివచ్చింది. స్కాటుపిల్లలకు చదువుచెప్పడానికి ప్రయత్నించిన ఒక్క సంవత్సరంలోనే అమె నరాలు కూలిపోయాయి.

డిగ్గర్ — స్కాటు లంటే నీకెందుకు పడ దసలు ?

యాంక్ — నేను స్వయంగా స్కాటును. స్కాటు వ—వ—వ—వంశం మాది.

టామీ — వాడు తన్ను తానే ద్వేషించుకుంటాడు (సిగరెట్టు వెలిగిస్తాడు.)

యాంక్ — నేను స్కాటుల నందరినీ ద్వేషిస్తాను. నువ్వు మాతాత యాంగస్‌ను ఎరగవు. ఆయన ఊహలో నిర్దుష్టులైనవాళ్ళు ఇద్దరే. ఒకడు యాంగస్ మాగ్డొనాల్డే. రెండోవాడు దేవుడు. ఒక్కొక్కప్పుడు దేవుడైనా తప్పుచెయ్య వచ్చుగాని, యాంగస్‌తాతయ్య మాత్రం తప్పు చెయ్యడు.

(బ్లాసమ్ లేచి గ్లాసులన్నీ పోసుకొస్తాడు.)

కివీ — (కొద్ది అభినివేశం ప్రకటిస్తూ) అతనితో ఉండవలసివచ్చిందా నీకు ?

యాంక్ — మావాళ్ళు చచ్చాక నన్నాయనే రక్షణకింద తీసుకున్నాడు.

టామీ — చాలా కఠినుడిలా కనిపిస్తాడే !

యాంక్ — నాకు కోపంవచ్చినప్పుడల్లా ఏం పారాయణ చేయవలసివచ్చేదో తెలుసా ?

కివీ — ఎక్కాలుకదూ ! (ఒక ఈగను చంపుతాడు.)

(సరిగ్గా యాంక్ మాట్లాడబోయేటప్పటికి బ్లాసమ్ తలుపువద్దకు దాటి వెళతాడు. అతని మాటలచేత ఆకర్షింపబడి ఒక్క క్షణం ఆగి వింటాడు.)

యాంక్ — నేను బైబిల్‌లో ఉన్న అధ్యాయాలన్నీ చెప్పవలసి వచ్చేది. ఇప్పటికీ చెప్పగలను జెనిసిస్, ఎక్సోడస్, లెవెటికస్, నంబర్స్, డు—డు—డ్యుటరొనామీ, జోషువా, జడ్జెస్, రత్, సామ్యుయెల్, కింగ్స్, క్రానికిల్స్, ఎజ్రా, నె—నె—నెహిమియా, ఎస్థర్, జాబ్, సామ్స్, ప్రొవెర్బ్స్, ఎక్లీజియాస్ట్స్, సొలొమన్, ఈసయా, జె—జెరిమియా, లెమెంటేషన్స్, ఎజెకియాన్, డేనియల్, హోసియా, జోయల్, యామోస్, ఒబాదియా, జోనా, మైకా, .... .... .... అబ్బా ! (యాంక్ టూత్‌బ్రష్, షేవింగ్‌సమగ్గు పట్టుకొని స్నానంగదిలోకి వెళతాడు. బ్లాసమ్ పళ్ళేలు బైటకి తీసుకువెళతాడు.)

టామీ — మీతాతయ్య భయంకరుడై ఉంటాడు.

యాంక్ — (కటువుగా) ఆయనతో వాదించడానికి ప్రయత్నించావా, ఏమిచేసేవాడో తెలుసా ?

డిగ్గర్ — చర్మం ఒలిచేసేవాడా ?

యాంక్ — ఘోరమైన తన బ్యాగ్‌పైపు తీసుకొని ఊదుతూ కూచుండిపోయేవాడు. అబ్బా ! ఆబ్యాగ్‌పైపంటే నాకెంత అసహ్యమైపోయిందంటావు ? బ్యాగ్‌పైపు ఊదుతున్నప్పుడు స్కాటు కదంవేస్తూ నడుస్తాడు. అందులో ఆశ్చర్యం లేదు. వాళ్ళా ధ్వనికి దూరంగా పారిపోతున్నట్టు అనిపిస్తుంది. (అతను స్నానం గదిలోకి పోతాడు. బ్లాసమ్ ప్రవేశిస్తూ తలుపు చేత్తో తీసి పట్టుకొని సావధానుడై నిలబడతాడు. సిస్టర్ మార్గరెట్ ప్రవేశిస్తుంది. ఆమెకు సుమారు ఇరవై ఒక్క సంవత్సరాల వయస్సుంటుంది. తెల్లటి పరిశుభ్రమైన యూనిఫార్మ్ తొడుక్కొని ఉంది. భుజాలపైన రెండేసి పట్టీలున్నాయి. ఆమె

పురుషులతో స్వేచ్ఛగా జంకూ కొంకూ లేకుండా మాట్లాడుతుంటే. ఆమె నల్లటి కళ్ళు మెరుపుగా ఉంటాయి. అవి ఆమె ఉల్లాసాన్ని చూపిస్తాయి.)

మార్గరెట్ — (ఆమె ఆఫీసువైపు దాటుతూ) నీకు ధన్యవాదాలోయి, బ్లాసమ్! (వార్డులో ఉన్నవాళ్ళతో) గుడ్‌మార్నింగ్, గుడ్‌మార్నింగ్, గుడ్‌మార్నింగ్!

అందరూ — గుడ్‌మార్నింగ్, సిస్టర్!

మార్గరెట్ — అందరూ క్షేమమేనా?

డిగ్గర్ — దివ్యంగా.
టామీ — మహబాగా.
కివీ — ఖేషుగ్గా.
} అందరూ ఒక్కసారి అంటారు.

(మార్గరెట్ తన ఆఫీసులోకి వెళ్ళి ఎప్రాన్ తీసేస్తుంది.)

యాంక్ — (స్నానాలగదిలోంచి తన టూత్‌బ్రష్ ఊపుకుంటూ బైటికి వస్తాడు.) నా స్కాటిష్ రక్తమంతా పోగొట్టుకోడం సాధ్యమే అయితే రెడ్‌క్రాసుకు అంతా ద— ద— దానం చేసేస్తాను.

కివీ — ఇంత అజాగ్రత్తగా ఉన్నావంటే బ్లడ్‌ప్రెషర్ హెచ్చుతుందోయి.

(మార్గరెట్ తన ఆఫీసునుంచి బైటికి వస్తుంది. ఆమె చేతిలో థర్మామీటర్లు చాస్టిలు కల ఒక పళ్ళెం ఉంటుంది. ఆమె యాంక్‌కు అభిముఖంగా నిలబడుతుంది.)

మార్గరెట్ — స్కాటులను గురించి ఏమిటా ప్రసంగం?

టామీ — వాళ్ళంటే అతని కిష్టం లేదు.

మార్గరెట్ — అంటే వాళ్ళను నువ్వర్థంచేసుకోలేదన్నమాట. మానవజాతిని చేస్తూ చిట్టచివరకు స్కాటును చేసి దేవుడు అచ్చువిరగ్గొట్టి పారేశాడని అంటారు.

యాంక్ — (మూతిముడిచి) త— త— తప్పకుండా అలా చేసిఉంటాడు—. ఆ అచ్చును స్కాటుతలపై వేసి కొట్టి ఉంటాడు. (స్నానాలగదిలోనికి నిష్క్రమిస్తాడు. మార్గరెట్ పళ్లెం కిందపెట్టి యాంకుపరుపుపైఉన్న దుప్పట్లు తీయ నారంభిస్తుంది. తలగడ టామీపై విసురుతుంది. అతడు దాని గతేబు పేస్తాడు. బ్లాసమ్ సావధానంగా అతని మంచంపక్కనే బిగిసి నిలబడతాడు.)

డిగ్గర్ — ఓహో! సిస్టర్! ఈ ఉదయానికి అందం చేకూర్చావు.

టామీ — మేమిప్పుడే అనుకొంటున్నాము. నువ్వు మాకు చాలా ఇష్టమైన సిస్టరివి. సిస్టర్!

మార్గరెట్ — నేనూ మిమ్మల్ని గూర్చి అలాగే చెప్పగలిగిఉండాలని నాకోరిక.

రోగులుగా మీరు చాలా అసహ్యంగా, అతి అమర్యాదగా ఉంటారు. మీలాంటి వాళ్ళు నాకు దొరకడం నా దురదృష్టం

డిగ్గర్ — నన్ను గాయపరుస్తున్నావు, సిస్టర్ !

కివీ — మేమని కాదుకదా, నీఅర్థం ?

మార్గరెట్ — మీరనే నా అర్థం. మీరందరూ ఇక్కడనించి వెళ్ళిపోతే సంతోషిస్తాను.

టామీ — సిస్టర్ ! నీకు కొంత విశ్రాంతి కావాలి. మేట్రన్ నిన్ను వేపుకు తింటుంది.

మార్గరెట్ — (పళ్ళెంపట్టుకుని బ్లాసమ్‌వద్దకు దాటి వస్తుంది) పాపం ! మేట్రన్ ఏంచేస్తుంది ? చేసేదంతా మీరే. నేను కిండర్‌గార్డెన్ స్కూల్లో కొన్నాళ్ళు పనిచేశాననిగాని, లేకపోతే మీతో వేగగలిగేదాన్నా ? (ఒక గాజుజాడీనించి థెర్మామీటర్ తీసి బసుటోకు అభిముఖ మౌతుంది. యాంక్ ప్రవేశిస్తాడు.) నోరు తెరు. (ఏమంటున్నావని అడుగుతున్నట్టుగా బసుటో ఆమెకేసి చూస్తాడు) నోరు ! (తననోరు తెరచి చూపిస్తుంది.)

యాంక్ — నీ గవదలు ఎంత అందంగా వున్నాయి, సిస్టర్ !

మార్గరెట్ — (అలసభావంతో) పోయి నీమంచంపక్క నిలబడి వుండు. అమెరికన్‌లా ప్రవర్తించడం మానేయి. (బ్లాసమ్‌నోటిలో థర్మామీటర్ పెడుతుంది. నాడి చూస్తుంది.)

యాంక్ — (మహాగౌరవంతో) ర—ర—రైట్, లె—లె—లెఫ్ట్, రైట్ ! (తక్కిన వాళ్ళతో) అమెరికాలో నర్సులుకాక నన్లు సిస్టర్లుగా ఉంటారు.

మార్గరెట్ — (యాంకువైపు చూడకుండా) ఇంగ్లాండులో నర్సు శిశువుల్ని పోషిస్తుంది. (చార్టుమీద గుర్తుపెట్టుకొని కివీవైపు నడుస్తుంది.) కివీ ! ఎలాగున్నావివ్వేళ ? బాగా నిద్రపోయావా ?

కివీ — శిశువులా పడుకున్నాను, సిస్టర్ !

మార్గరెట్ — చెయ్యి ఎలాగుంది ?

కివీ — చాలా బాగుంది.

మార్గరెట్ — భుజం కురుపు ? (మెల్లగా అతని భుజం కదుపుతుంది) నొప్పెట్టుతుందా ? (జవా బివ్వడు) నొప్పెట్టుతుంది కదూ ? ఐనా ఇప్పుడు వెనకటి కంటె చాలా నయంగానే ఉంది. (అతని నోటిలో థర్మామీటర్ పెడుతుంది) బ్లాంకెట్ మడిచి కింద పెట్టుకోలేవు ? (అతని పాదాలను లోపల దూరుస్తుంది.)

మి కెవ్వరికీ మిలిటరీ ట్రెయినింగు ఉన్నదని ఎవ్వరూ అనుమానించనైనా అనుమానించరు.

టామీ — (పిలుస్తూ) ఓ, సిస్టర్!

మార్గరెట్ — మాట్లాడకు. నాడి చూస్తున్నాను. (కివీ నాడిమీద చెయ్యితీసేసి టామీ వైపు ఓరచూపులు చూస్తుంది.) ఏం కావాలి నీకు ?

టామీ — (విచారంతో) నా కిక్కడ సుఖంగా లేదు.

మార్గరెట్ — ఇది బ్రిటిష్ మిలిటరీ హాస్పిటలు. ఇక్కడ సుఖంగా ఉండడం సాధ్యం కాదు.

టామీ — నేను చస్తున్నాను. చచ్చేవాళ్ళకోసం ఏమీ వార్డులులేవా ?

(మార్గరెట్ థర్మామీటర్ తీసి చార్టుమీద గుర్తు పెట్టుకొంటుంది. యాంక్ మంచం దగ్గరకు పోతుంది. యాంక్ తన మంచంవద్ద సావధానంగా నిలబడి ఉంటాడు )

మార్గరెట్ — కర్నల్సు తనిఖీచేసేటట్టు -మేము వార్డులను ఉంచుతామని నీకు బాగా తెలుసుకదా. అందుకోసం మాట్లాడకుండా ఉండు. (యాంక్ టెంప రేచర్ తీసుకుంటుంది.)

డిగ్గర్ — ఈమాటలు వింటే ముసలికాచ్‌మెన్ ఏమనుకుంటాడు ?

మార్గరెట్ — (యాంక్‌నాడి చూస్తుంది) మాకంటె పెద్దఉద్యోగికి నువ్వు ఇంకా ఎక్కువ గౌరవం చూపించాలి. కాచ్‌వెబ్స్ అంటావా ? కర్నలును ముసలి కాచ్‌వెబ్ అంటావా ? (యాంక్ నాడి చూచి చార్టుపై గుర్తుపెట్టుకొంటుంది. థర్మామీటరు ఇంకా అతని నోటిలోనే ఉంది.) పరిశుభ్రమైన పాయిజామాలు ఎవరికి కావాలి ? ఇప్పుడు మీకున్నవి బాగా మాసిపోకపోతే మరో రోజు ఉంచుకొండి. ఈవేళ నాదగ్గిర కావలిసినన్ని పాజామాలు లేవు.

కివీ — సిస్టర్! నాపాజామాపై టీ వొలకపోసుకున్నాను.

డిగ్గర్ — అబ్బా! ఈసంగతి ఆవిడతోచెప్పకోయ్. ఆ టీకోసం పాజామాలను ఉడకబెడుతుంది.

మార్గరెట్ — మీరందరూ చాలా కొంటెవాళ్ళు. (యాంక్ నోటిలోంచి థర్మా మీటరు తీస్తుంది. ఛార్టుమీద గుర్తు పెట్టుకొంటుంది.) యాంక్! ఎట్లా నిద్ర పోయావు ?

యాంక్ — (పళ్ళికిలించి) నిన్ను క—క—కలగంటూ.

మార్గరెట్ — నోరుముయ్యి. ఈవేళ నీనాడి వేగంగా కొట్టుకొంటుంది.

యాంక్ — నువ్వు నా నాడిపై చెయ్యి పెట్టావంటే, దాని చలనం ఎక్కువౌతుంది, సిస్టర్ !

మార్గరెట్ — మెడికల్ ఆఫీసరు రేపు ప్లాస్మాక్విన్ ఇస్తాడు. నీశరీరంలో తిష్టించి వున్న మలేరియా సంతతినీ పిండేద్దామని ఉన్నా దతడికి. (డిగ్గర్‌వైపు జరుగు తుంది) నా అల్మారీలో పాజామా లున్నాయి. అవి తెచ్చి ఎవరికి కావాలో చూస్తావూ ? మూడు జత లున్నాయనుకొంటాను.

యాంక్ — సరేనంది (అల్మారావద్దకువెళ్ళి మూడుజతల పాజామాలు తెస్తాడు.)

మార్గరెట్ — (డిగ్గర్ పక్కగా నిలబడి) నీకు శుభ్రమైన పాజామాలు కావాలా ?

డిగ్గర్ — ఎట్లాగో గడుపుకోగలను. నావి ఇంకా తెల్లగానే ఉన్నాయి.

మార్గరెట్ — (అతని నోటిలో థర్మామీటరు పెట్టి నాడి చూస్తుంది) బాగా నిద్ర పోయావా ? (అతడు తల ఊపుతాడు. ఆమెచేతిపై తనబుగ్గ వాలుస్తాడు.)

యాంక్ — పాజామాలు ఎవరికి కావాలి ?

కివీ — నాకు.

యాంక్ — నీకా ? తీసుకో. (కివీవైపు ఒకజత విసురుతాడు.)

టామీ — (వికసించిన ముఖంతో) నాకు.

యాంక్ — మనకెప్పుడూ పాజామా కొరతే ఉంటుం దంటే ఆశ్చర్యం లేదు. వాటి నన్నిటినీ నువ్వే చింపేస్తావు. (టామీపై ఒకజత విసురుతాడు. మూడవ జత మళ్ళా తీసుకుంటాడు.)

మార్గరెట్ — (డిగ్గర్‌నోట్లోంచి థెర్మామీటరు తీస్తుంది.) నీవీపు ఎట్లాగుంది ? (ఛార్టుపై గుర్తుపెట్టుతూ ఉంటుంది.)

డిగ్గర్ — కొంచెం తోమితే చాలా బాగుంటుంది.

టామీ — నేను తోమించుకొంటానని తానూ తోమించుకొంటా నంటాడు. నే నేమి చేస్తే అది చేస్తాడు, అసూయకొద్దీ.

మార్గరెట్ — ఇదంతా అయినతర్వాత మీఇద్దరినీ మర్దనాచేస్తాను. (టామీ వద్దకు వస్తుంది) కొంచెం వాడిపోయినట్టున్నావు. రాత్రి హెప్ బాధపెట్టిందా ?

టామీ — రాత్రి మహాఇదిగా గడిచింది, సిస్టర్ ! కంటిమీద రెప్పపడితే ఒట్టు.

యాంక్ — (టూత్‌బ్రష్ తీసేసి) నువ్వే కాదు. ఎవ్వరూ నిద్రపోలేదు.

టామీ — నాకు రాత్రి పీడకల వచ్చింది. నేను చచ్చేటంత పని చేస్తున్నానట. అక్కడ గట్టుపై నాభార్య వెకిలినవ్వు నవ్వుతూ కూర్చుని ఉన్నదట. (కిలకిలా నవ్వుతాడు.)

మార్గరెట్ — (అతని నవ్వు ఆపుచేసి, అతని నోటిలో థెర్మామీటర్ పెడుతుంది.) అవంతా నీ అంతరాత్మే నిన్ను బాధిస్తుంది. (అతని నాడిపై చెయ్యిపెడు తుంది) సిల్వీ వీధిలో పనితగలకుండా ఎట్లా తప్పించుకొనేవాడివి ?

టామీ — (థెర్మామీటరు నోటిలోంచి తీసి) నేను వృత్తిలో ఒకవిధమైన వెయిటర్‌ను. నాకు పిల్లనిచ్చిన మామగారికి ఒక హొటల్ ఉంది. ఆయన 'ఊc' అని ఎప్పుడంటాడా అని చూస్తున్నాను. ఈ ఉద్యోగానికి ఒక్క తాపు తన్ని వెళ్ళి పోతాను.

మార్గరెట్ — (కఠినంగా) ఆ థర్మామీటరు అక్కడ పెట్టేయ్.

(టామీ అలాగే చేస్తాడు.)

డిగ్గర్ — వాణ్ణి ముక్కలు చేసేయ్, సిస్టర్ !

మార్గరెట్ — గాయం మానగానే నువ్విక్కడ ఎలాగా పనిచేస్తావు.

డిగ్గర్ — ఇతడికి పెళ్ళికూడా అయింది. అబ్బా, ఇది ఎంత వింత ప్రపంచం ?

కివీ — పిల్లలా ?

టామీ — (థెర్మామీటరు నోట్లోంచి తీసి మార్గరెట్‌కు ఇస్తాడు.) నా కర్థంకా దిది. మా వంశంలో అందరికీ అరవై ఏళ్ళు వచ్చే వరకు పిల్లలు కలుగుతూనే ఉంటారు. నీకు తెలుసా ? నాకు రెండేళ్ళు వయస్సుకల అత్త, నాలుగేళ్ళు వయస్సు కల పినతండ్రీ ఉండేవాళ్లు. (కిలకిల నవ్వుతాడు) నాఅత్త చడ్డీలు మార్చేపని నేను చేస్తూ ఉండేవాణ్ణి.

మార్గరెట్ — ఏదీ చూడనీ, అబ్బా ! బసుటోను మరచిపోయాను. (వెనక్కి తిరిగి బసుటోవైపు వెళ్ళబోయి, అతణ్ణి చూసి పిడుగుపడినట్టు నిర్ఘాంత పోయి నిలబడిపోతుంది) దేవుడా ! వీడు థెర్మామీటరు మింగేశాడు ! ఏం చేసేది ?

(అందరూ భూమని బ్లాసమ్ వైపు చూస్తారు)

బసుటో — (తన నోట్లోంచి పూర్తిథెర్మామీటరు తీసి మార్గరెట్‌కి ఇస్తాడు. పళ్ళికి లించి నవ్వుతాడు) బ్లాస్—సమ్.

మార్గరెట్ — (వేలితో జడిపిస్తూ) మళ్ళా ఎప్పుడూ ఇట్లా చేయకు. థెర్మా మీటర్లు పోగొట్టుకొనే పరిస్థితుల్లో లేము మేము. (థెర్మామీటరు పట్టుకొని, దానిని నిదానించి చూచి, ఛార్టుమీద గుర్తు పెడుతుంది) అబ్బా ! ఈపశువులతో ఎవరైనా మాట్లాడగలిగితే బాగుండేది. (ట్రే యాంక్ చేతికిస్తుంది.) యాంక్ ! ఇది నాఆఫీసులో పెట్టు. పెడతావు కదూ !

యాంక్ — (ట్రేను అందుకొని) తప్పకుండా (మార్గరెట్ ఆఫీసులోకి వెళతాడు).

మార్గరెట్ — (నిట్టూర్పు విడిచి) చూద్దాము. వీడు స్లిట్‌ట్రెంచిలా కాకుండా మరోవిదంగా ఉంటాడేమో చూద్దాము. బ్లానమ్ ! (పక్కలన్నీ ఒక వరసగా పేర్చమని బసూటోకు సంజ్ఞలతో చెపుతుంది. కివీ, యాంకులను సరిచేస్తాడు బసుటో.)

డిగ్గర్ — (చలోక్తిగా) అవునోయి ! పక్కలు సరిగా సర్దు. దానివల్ల రోగిస్థితి ఎంతగా బాగుపడుతుందో నీకు తెలియదు.

మార్గరెట్ — (అతని మాటలు లక్ష్యం చెయ్యకుండా) కర్నలు అభిప్రాయం బాగుచేస్తుంది. అది రోగస్థితికంటె ముఖ్యమైంది.

యాంక్ — (లోపలికి దూసుకువస్తాడు. వగురుస్తూ ఊపిరాడనట్టు మాటాడ బోతాడు) క....క—క....క.... (తలుపుకేసి చూపిస్తాడు.)

మార్గరెట్ — (యాంక్ ఉన్నచోటికి దాటివచ్చి) ఇదంతా ఏమిటి యాంక్ ?

యాంక్ — (తలుపుదగ్గరకు దూసుకుపోయి, తలుపుతీసి, బైటికి తొంగిచూచి. మళ్ళా మార్గరెట్ ఉన్నచోటికి పరుగెత్తుకు వచ్చి) క ...క....క....

డిగ్గర్ — (వినోదంగా) పెద్దపులి వెంటాడుతూ వచ్చింది వీణ్ణి.

యాంక్ — (ఇంకా మాట్లాడ్డానికి ప్రయత్నిస్తూ, తలుపు తీసి చూపిస్తూ, తడ బడుతూ) క....క....క....

మార్గరెట్ — నిదానంగా చెప్పు. మరేమీ తొందర లేదు. (బుగ్గమీద కొడుతుంది.)

యాంక్ — కృతజ్ఞుణ్ణి. (మళ్ళీ తలుపుకేసి చూపించి) బూజులు !

మార్గరెట్ — ఇక చాలించు నీగొడవ. ఇంత పెందరాళే రాడు. (మెల్లగా తలుపు కేసి వెళ్లుతుంది.)

యాంక్ — నేను....నేను కిటికీలోంచి చూశాను. అతడు వస్తుండగా చూశాను.

మార్గరెట్ — నువ్వు పొరపడ్డావు. (తలుపు తీసి బైటకు చూస్తుంది. వెంటనే తలుపు వేసేసి, గిర్రున తిరిగి, తొందరగా) త్వరపడండి ! ప్రతీదీ ఒక క్రమంలో ఉంచుకోండి ! అందరూ కిట్లు దాచుకోండి.

యాంక్ — మరి నేను చె....చె....చెప్పలేదూ ?

మార్గరెట్ — (మాసిన దుప్పట్లన్నీ గబగబా పోగుచేస్తూ) గోడలమీద ఎక్కడన్నా బూజు ఉందేమో చూడండి. (శ్రద్ధతో అన్నిపనులూ చరచరా జరుగుతున్నాయి, మార్గరెట్ దుప్పట్లన్నీ టామీ బ్లాంకెట్‌కింద దోపేస్తుంది.) ఇవిగో ఇవి నీదగ్గి రున్న గలేబుల్లో దాచేయి !

టామీ — (అన్నీ తన కడుపుమీద పేర్చుకొని) నా కడుపు ఉబ్బిందని చెప్పండి.

డిగ్గర్ — (వేలితో చూపిస్తూ) అదిగో అక్కడుంది బూజు.

మార్గరెట్ — (యాంక్ పక్క సరిదిద్దడం ఒక్క సెకెండు అగుతుంది.) యాంక్ ! దాన్ని కిందికి దులిపేయి, త్వరగా !

యాంక్ — (ఒక గడకర్ర పట్టుకొని తొందరగా బూజు దులిపేస్తాడు.) మాన మర్యాదలు కల ఏసాలీడూ మనక్యాంపుకి రాదు.

టామీ — అబ్బా ! కర్నలుకు బూజంటే ఎంత అయిష్టం !

మార్గరెట్ — అదంతా సరేగాని, అందరూ మీమీ మంచాలదగ్గిర నిలబడండి— త్వరగా ! (యాంక్, బసుటో తమ తమ మంచాల వద్దకు తొందరగా వెళ్ళి నిలబడతారు. కివీ, డిగ్గర్, టామీ మంచాలమీద పడుకుంటారు. వార్డంతా ఒక సుడిగుండంలో ఉన్నట్టుండేది. ఇప్పుడు కర్నల్ ప్రవేశించేటప్పటికి చక్కగా అమరి ఉంది. కర్నల్ పొడుగ్గా ఉంటాడు. అలసిపోయిన మనిషిలా ఉండి కొంచెం వంగి ఉంటాడు. పెద్ద భయంకరంగా ఏమీ లేడు. మాటిమాటికి ముక్కు నులుముకొంటూ ఉంటాడు. హ్యాటు లేదు. బుష్‌కోటు తొడుక్కొని ఉంటాడు. స్టెతస్కోపు మెడకు వేలాడుతూ ఉంటుంది. లోపలికి వస్తూ వార్డంతా కలయ జూస్తాడు.) గుడ్‌మార్నింగ్ అండి.

కర్నల్ — గుడ్ మార్నింగ్, సిస్టర్ ! (వార్డులో ఉన్న మనుష్యులకేసి చూచి) కానివ్వండి. మంచాలమీద కూచోండి.

(బ్లాసమ్, యాంక్ తమ మంచాల కాళ్ళవైపు కూచుంటారు. తక్కిన వాళ్ళు లేచి కూచుని కర్నల్‌కు అభిముఖులౌతారు.)

మార్గరెట్ — ఇంత పెందరాళే వస్తారని అనుకోలేదండి.

కర్నల్ — (వార్డు కలయజూచి) నువ్వు వార్డు పరిశుభ్రంగా ఉంచుతావు.

మార్గరెట్ — కృతజ్ఞురాలనండి !

కర్నల్ — నీ రోగులతో కొంచెం మాట్లాడదామని వచ్చాను. (వాళ్ళవైపు చూసి, తిరిగి మార్గరెట్‌వైపు తిరిగి) వీళ్ళందరూ చాలా సరదా వాళ్ళనీ స్నేహశీలురనీ తెలుస్తుంది.

మార్గరెట్ — (సగర్వంగా) వీళ్ళు చాలా పరిశుభ్రమైనవాళ్ళు ; చాలా మర్యాదస్థులు ; సరదాగా ఉంటారు. ఇల్లాంటి వాళ్ళు దొరికే అదృష్టం నాకు మరెప్పుడూ కలగలేదండి.

(ఒకళ్ళ మొఖం ఒకళ్ళు సాభిప్రాయంగా చూసుకొంటారు.)

కర్నల్ — క్షేమ ! ఐతే నీవార్డులో రెండు మంచాలు ఖాళీ ఉన్నాయని మాట్రన్ చెప్పింది.

మార్గరెట్ — (ఖాళీమంచం వేలితో చూపిస్తూ) అవునండి—ఒక్క మంచం ఖాళీగా ఉందండి.

కర్నల్ — నా వార్డులోంచి ఒకరోగిని ఇక్కడికి మారుస్తాను — ఈ ఉదయమే.

మార్గరెట్ — చిత్తం. సర్జికల్ కేసాండి ?

కర్నల్ — అవును. అతణ్ణిగురించి మీకు స్వయంగా చెపుదామని వచ్చాను. పూర్తి వార్డుసహకారం కావలసిన కేసది. (రోగులకేసి చూస్తాడు) ఒక్క నిమిషం అందరూ నాకేసి చూస్తారా ? (చెప్పడానికి సందేహిస్తూ ముక్కు వేళ్ళతో లాగుతూ) మీ అందరి సహాయం కోరడానికి ఇంత ఉదయమే వచ్చాను.

యాంక్ — (ఎవ్వరూ మాట్లాడకపోవడం చూచి) ఎలాంటి సహాయమండి ?

కర్నల్ — (తీక్ష్ణంగా చూచి) నువ్వు అమెరికన్‌వి. అంతేనా ?

యాంక్ — (లేచి కర్నల్‌కి అభిముఖుడై) అవునండి. అమెరికన్‌ను. అమెరికన్ ఫీల్డు సర్వీస్ యాంబులెన్స్ డ్రైవరును. బ్రిటిషు దళంలో పని చేస్తున్నాను.

కర్నల్ — (భయం కనపరుస్తూ) వెనక నిన్నెక్కడో చూసినట్లు జ్ఞాపకం.

యాంక్ — (కంగారుతో) గతవారం తమరు వార్డు చూడ్డానికి వచ్చినప్పుడండి.

కర్నల్ — ఇంకా అంతకు ముందే. ఏదో ఒక చికాకు ఘట్టంలో అని జ్ఞాపకం.

యాంక్ — (కొంచెం సర్దుకొని) తమరు మరచిపోయా రనుకొన్నానండి. ఒక నాడు మీ స్టాపుకారు రోడ్డుకిందికి దిగేటట్లు చేశానేమోనండి.

కర్నల్ — (బిగ్గరగా అరుస్తూ) ఏమోనా ? నువ్వు చేశావని నాకు నిశ్చయంగా తెలుసు. ఏమోయ్ అబ్బాయ్ ! అవేళ నువ్వు నన్ను చంపేసేవాడివి.

యాంక్ — (చిరునవ్వుతో) కాని అలా చేయలేదు కదాండి !

కర్నల్ — (నిరుత్తరుడై) ఊఁ ! కూర్చో. (యాంక్ కూర్చుంటాడు. కర్నల్ వేళ్ళతో మళ్ళా ముక్కు లాక్కుంటాడు.) సరే, నీతప్పు సర్దుకోడానికి నీకొక అవకాశం ఇస్తాను.

యాంక్ — కృతజ్ఞుణ్ణండి.

కర్నల్ — (తక్కినవాళ్ళకేసి తిరిగి మంచాల వరసలమధ్య నడుస్తూ) నారోగి నొకణ్ణి మీతోపాటు ఇక్క డుంచుతున్నాను. ఈ రోగిని ఆపరేషన్ చేసి ఒక

తుపాకి గుండు ముక్క తీశాను. అతని కిడ్నీ కూడా తీసి పారేయవలసి వచ్చింది. అతడు దాదాపు కోలుకొన్నాడు. మీరందరూ అతనికి సహాయం చేయగల రనుకొంటాను.

యాంక్ — ఎలాంటి సహాయమో అడగవచ్చునా అండి ?

కర్నల్ — అతణ్ణి సంతృప్తికరంగా ఉంచి. (మళ్ళా ముక్కులాగుతాడు) అతడు తన రెజిమెంటుకు వెళ్ళిపోవాలని ఆతురత పడుతున్నాడు. కాని హాస్పిటల్ నించి అతణ్ణి విడుదలచెయ్యలేను. అది అసాధ్యం !

మార్గరెట్ — రోగి ఆపరేషనునుంచి బాగుపడి తేరుకొన్నాడని సెలవిచ్చారు కదండి ?

కర్నల్ — నిజం. కొన్నాళ్లలోనే అతడు ఆపరేషనునుంచి పూర్తిగా తేరుకుంటాడు. అతని కిప్పుడు ఒకటే కిడ్నీ ఉండిపోయింది. సామాన్యంగా అది ప్రాణాపాయకరమైంది కాదు. కాని దురదృష్టవశాత్తు ఆ ఉన్న ఒక్క-కిడ్నీ దోషవంతంగా ఉందని తెలిసింది. అది కొన్నాళ్ళవరకూ రెండు కిడ్నీలపని చేస్తుంది—కొన్నాళ్ళవరకు మాత్రమే.

యాంక్ — తరవాత ఏమౌతుందండి ?

కర్నల్ — (ఏమీ ఆవేశం లేకుండా) ఆకిడ్నీ పాలిపోతుంది—అంటే పని చేయడం మానేస్తుంది. అతడి ఒంటి నిండా విషం నిండిపోతుంది—మూత్ర సంబంధమైన విషం. దాంతో అతని అంతం అవుతుంది.

మార్గరెట్ — ఇది ఆరోగికి తెలుసా అండి ?

కర్నల్ — అతడికి చెప్పకూడదని నిశ్చయించాను. అతడికె కుటుంబం లేదు. ఎలాటి బంధాలూలేవు. మథనపడితే అతడి కేమీ లాభం లేదు. బాగా ఉన్నప్పుడు అతణ్ణి ఇక్కడ ఉంచుతాను. ఎందు కంటారా ? ఒక మనిషి చచ్చిపోయేముందు అతడి మిత్రులు చుట్టూ ఉండడం మంచిదని నాఅభిప్రాయం.

కిపీ — (కౌతుకంతో) ఇంకా ఎన్నాళ్ళు బతుకుతాడండి ?

కర్నల్ — ఎక్కువ బతికితే ఆరు మాసాలు.

టామీ — (ముక్తసరిగా) అతడికి మరేమీ సహాయంలేదండి ?

కర్నల్ — ఎవరైనా సహాయంచేస్తే అది ఇప్పుడు మీవల్లే కలగాలి.

యాంక్ — అతడు తాను మంచి ఆరోగ్యవంతుణ్ణనే భావించుకుంటున్నాడండి ?

కర్నల్ — ఒక విధంగా అంతే. అక్కడికి వెళ్ళి కుంగిపోయే భాగ్యానికి అతణ్ణి విడుదల చెయ్యడం ఘోరం. అతణ్ణి తృప్తికరంగానూ, ఉల్లాసంగానూ ఉంచేందుకు మీచేతనైనంత సహాయం చేయండి.

యాంక్ — అలానేనండి.

డిగ్గర్ — మాకుచేతనైనంతా చేస్తామండి.

టామీ — మే మతణ్ణేమీ ఇబ్బంది పెట్టమండి.

కివీ — అతణ్ణి కులాసాగా ఉంచుతామండి.

మార్గరెట్ — (నమ్మకంగా) వీళ్ళు చాలా మంచివాళ్ళు. వీళ్ళను నమ్మవచ్చండి, కర్నల్!

కర్నల్ — కృతజ్ఞుణ్ణి. ఉత్త అభాగ్యుడు! కానివ్వండి. (మార్గరెట్ తలుపు వరకూ అతడివెంట వెళుతుంది.) అత డిప్పుడు C 16 లో ఉన్నాడు. సిద్ధం కాగానే అతణ్ణిక్కడికి తీసుకురమ్మని నీఆర్డర్లీతో చెప్పాను. (తలుపు విప్పి ఆమెవైపు తిరిగి) అతడు కూర్చోవచ్చు. పడుకోనూ వచ్చు—అతడి ఇష్టం వచ్చినట్టు.

మార్గరెట్ — అతడిగురించి బాగా శ్రద్ధతీసుకుంటామండి.

కర్నల్ — (సిపాయిలవైపు తిరిగి) గుడ్ మార్నింగ్! (మార్గరెట్ వైపు తిరిగి) ఇవాళ తనిఖీచేయను. సిస్టర్! థాంక్ యు. గుడ్‌మార్నింగ్! (నిష్క్రమిస్తాడు.)

మార్గరెట్ — (తలుపు వేస్తుంది. వెనక్కి తిరిగి గట్టిగా ఊపిరి తీసుకుని) అమ్మయ్యా! ఇక చాలా పని చెయ్యాలి. యాంక్! టామీని, డిగ్గర్‌నూ చూచుకొంటాను. నువ్వు కొంచెం కివికీ స్నానం చేయిద్దూ.

యాంక్ — (అలసినట్టు) ఎవరికో మంచిభార్య చేసేపని చేయాలంటావు!

(మార్గరెట్ అల్మారీలోంచి కొంచెం రబ్బింగ్ ఆల్కహాల్ తీసుకొని టామీదగ్గిరికి వెళ్తుంది)

కివి — యాంక్! నువ్వు చచ్చిపోతున్నా వనుకో. ఆసంగతి ముందే తెలుసు కోవాలని నీ కుంటుందా?

యాంక్ — నే నెలాగా ఒకనాడు చస్తాను. కాని అనుకోకుండా దేవుడు చాపు కలిగిస్తే సంతోషిస్తాను. (కివీ మంచంచుట్టూ బ్లాసమ్ సహాయంతో ఎర్రని స్క్రీనులు పెడతాడు. కివీకి స్నానం చేయించడంకోసం స్క్రీనువెనక్కి వెళ్ళిపోతాడు.)

డిగ్గర్ — అయితే, కిడ్నీ లేకండా మనిషి ఎందుకు బతకలేడు ? (టామీవైపు చూపించి) మెదడు లేకుండా మనవాడు ఎలా బతుకుతున్నాడో చూడు !

మార్గరెట్ — (టామీతో) పక్కకుజరిగి వీపుతోమించుకో.

టామీ — (తనపైజామా అంచులు ఎత్తుతాడు. డిగ్గర్‌వైపు తిరుగుతాడు. మార్గరెట్ మెల్లగా మర్దనా చేస్తూఉంటుంది. బసుటో చూస్తూ నిలబడతాడు.) సిస్టర్, అత నెవరు ?

మార్గరెట్ — (తోముతూ) ఎవరిని అడుగుతున్నావు ?

టామీ — ఇప్పు డిక్కడికి రాబోతున్న పెద్దమనిషి.

మార్గరెట్ — నేనూ ఎరగను.

టామీ — వాడు బతికే ఆసే లేదంటావా ?

మార్గరెట్ — కర్నల్ చెప్పిందంతా నువ్వు విన్నావు కదా !

టామీ — అతను బెంగపెట్టుకునేటట్లు చెప్పాడు.

మార్గరెట్ — అత నెప్పు డేది చెప్పినా బెంగపెట్టుకునేటట్టే చెపుతాడు.

టామీ — ఇప్పు డతన్ని గురించి తెలిసే పోతుందిగా. అరువారా లన్నాడుకదూ కర్నల్ ? (ఒక్కక్షణం నిశ్శబ్దంగా ఉంటాడు. మార్గరెట్ మరికొంత ఆల్కొహాల్ తెస్తుంది.) సిస్టర్ ! దాని కెప్పుడైనా అలవాటు పడ్డావా ? నువ్వు వాటి కలవాటు పడి ఉండవు, కాదూ ?

మార్గరెట్ — పిల్లవాడిలా మాట్లాడకు.

టామీ — గాయపడ్డవాళ్లు పిల్లలుకాక మరేమిటి ? నువ్వు బాగా ఎదిగినవాడి వీపు ఇలా తోమేదానివా ?

మార్గరెట్ — (వీపు చరుస్తుంది.) ఇక చాలించు నీమాటలు.

(టామీ లేచి కూచుంటాడు. మార్గరెట్ అతని తువ్వాలు కోసం వెళ్ళుతుంది )

డిగ్గర్ — (టామీ వీపు చూస్తు) దేవుడా ! ఎంత కొవ్వు ఉందిరా వీడికి ! ఒక తొట్టెడు ఉంటుంది. ఎద్దు మాంసానికే ఇంత కొవ్వు పడతాడా ఎవడైనా ?

టామీ — (గర్వంతో) నా అద్భుతమైన గ్రంథులు నేను వంటవాణ్ణయిన తర్వాత రెండుసార్లు నాకు మంచిపేరు తెచ్చాయి. రెండు సార్లూ నా కార్డు మీద— నేను చూచాను—' ఒబీస్ ' గా ఉన్నా నంటుంది.

డిగ్గర్ — పిచ్చిపుల్లయ్యా ! ఏమంటుందన్నావు ?

టామీ — ' ఒబీస్. ' దాని అర్థమైతే నాకు తెలియదు. (పళ్ళికిలించి నవ్వుతాడు.)

డిగ్గర్ — (సరదాగా) దేవుడా ! నువ్వుత్త మూర్ఖుడివి. సిస్టర్ ! 'ఒబీస్' అంటే ఏమిటి ?

మార్గరెట్ — లావాటివాడని అర్థం.

డిగ్గర్ — అలాగుండడం నీకిష్టమేనా ? ఉత్త లావెక్కడం అతడికి సరిపోదు. అతడు 'ఒబీస్' గా కూడా ఉండాలి. నువ్వు మామూలు లావైనవాడవి.

టామీ — ఇకముందు దయచేసి నాకు నిజంగా ఉన్న జబ్బు సరియైనపేరుతో వ్యవహరించు.

మార్గరెట్ — (ఒకచివరి తెంపకాయకొట్టి) ఇకచాలించు. ఆ మైలబట్టలన్నీ బైట తియ్యి. ఇప్పుడు నీమంచం ఒక గూడులా ఉంది. (కర్నల్‌వచ్చినప్పుడు తన బ్లాంకెట్‌కింద దాచి ఉంచిన దుప్పట్లు బైటికి తన్నుతాడు. ఆమె డిగ్గరు వైపు తిరుగుతుంది) డిగ్గర్ ! గుండ్రంగా తిరిగి నీచొక్కా ఎత్తు.

టామీ — నాభార్యకు నాఫోటో పంపించాను. "ఇంటికి బైలుదేరేటప్పటికి ఇంకా లావెక్కితే అసలు ఇంటికే రావద్దు" అని రాసింది. రక్తమూ, చెమటా, కన్నీళ్ళూ నాజీవితంలో రూపాయికి పదకొండణాలు ధారపోస్తున్న నన్ను ఇలా అంటుంది. చూడండి (గొణుక్కుంటాడు.)

డిగ్గర్ — (మంచంకాళ్ళవైపు తలగడమీద తలపెట్టి ప్రేక్షకులవైపు మొహంపెట్టి) ఆహా ఇక పడుకో.

(టామీ పడుకుంటాడు. ఒసుటో దుప్పట్లు మార్గరెట్ ఆఫీసులో తీసుకువెళ్తాడు.)

మార్గరెట్ — (డిగ్గర్ వెన్నెముక మెల్లగా మర్దనా చెయ్యటం మొదలెడుతుంది.) ఇప్పుడు బాగుందా ?

డిగ్గర్ — మంత్రకత్తెవి నువ్వు. (సంతృప్తికరంగా నిట్టూరుస్తాడు. ఒకక్షణం ఆగి మళ్ళా మాట్లాడతాడు) వీణ్ణి మనం ఎలా చూద్దాం, సిస్టర్ ?

మార్గరెట్ — ఈ కొత్త రోగినా ? మనిషిని చూసినట్టు.

డిగ్గర్ — ఓహో ! నేను మనుషుల్ని మ్యానేజ్ చేయగలను. నే నసలు ఫాదిరీని కావలసిఉండేది. మా అమ్మ నేను ఫాదిరీని కావాలని కోరుతూ ఉండేది.

మార్గరెట్ — మరి బాక్సింగ్‌కు ఎందుకు వెళ్ళావు ?

డిగ్గర్ — దేవుడికే తెలుసు. మంత్రించిన మధువు తాగవలసినప్పుడు శరీరంలోంచి నిప్పు రాల్చుకొన్నాను.

మార్గరెట్ — నువ్వు పారాట్రూప్సులో ఉన్నావుకదూ, డిగ్గర్ !

డిగ్గర్ — అవును.

మార్గరెట్ — చాలా సార్లు పైనుంచి గెంతావా ?

డిగ్గర్ — పన్నెండుసార్లు. దీనితరవాత జారిపోతా ననుకుంటాను.

టామీ — (లేచికూచుని) నీ ప్యారచూటు విప్పుకోకపోతే, కొత్తది ఇంకోటి దొరుకుతుందా ? (విరగబడి నవ్వుతాడు. మళ్ళా వీపు జేరవేస్తాడు.)

డిగ్గర్ — కొత్త ఛలో క్తిపుస్తకాలు ఎందుకు చదవవు ?

మార్గరెట్ — కాని పారచూటులు ఎప్పుడూ తెరచుకోక పోవడమనేది ఉండ దనుకొంటాను. అంతేకాదూ ?

డిగ్గర్ — ఒక్కొక్కప్పుడు పట్టు చెమ్మగిల్లి అంటుకుపోతుంది. నేనీ విషయంలో అదృష్టవంతుణ్ణే అనాలి. పారచూటులు విడకపోవడం నేను చూశాను.

(మార్గరెట్ అతని తువ్వాలు తెస్తుంది. బ్లాసమ్ లోపలికివచ్చి చూస్తూ నిలబడతాడు.)

మార్గరెట్ — మరోరకం దళంలోకి మార్చుకోలేవా ?

డిగ్గర్ — ఓహో ! పారాట్రూపులకు జీతం ఎక్కువ. నాకు సంసారముంది. భార్య............

మార్గరెట్ — అంటుకుపోయే సిల్కుగురించి ఆమె ఏమంటుంది ?

డిగ్గర్ — 'జాగర్తగ ఉండండి' అంటుంది. కాని నేను ఏపనిలో ఉన్నా అంటుంది ఈమాట.

మార్గరెట్ — ఐతే జాగర్తగా ఉంది. ఇది భయంకరమైన పని. (ఆల్కొహాల్ సీసామీద మూత పెడుతుంది.)

డిగ్గర్ — నాకా కాస్తా జరిగింది.

(యాంటీ స్క్రీన్‌ను మడుస్తాడు. దాన్ని గోడకు ఆనించి నిలబెడతాడు.)

మార్గరెట్ — (బసుటో వైపు చూస్తుంది.) అబ్బా ! ఈ బసుటోకు ఏమిచేయాలో కర్నల్ నిశ్చయిస్తే బాగుండును.

టామీ — (లేచి కూచుంటాడు) అతడు ఇంటికి వెళ్ళాలని తహతహ లాడుతున్నాడు, సిస్టర్ !

మార్గరెట్ — అతడితో ఉన్నలోపం అదొక్కటే. ఇప్పటికి రెండు నెలల నించి ఇతడికి జ్వరంవస్తుంది. వెంటనే అతడి తెగకు పంపించేస్తేతప్ప బహుశా చచ్చిపోతాడు.

బస్టర్ — (తన గురించే ఆమె మాట్లాడుతోందని గ్రహించి, తనని తాను చూపించు కుంటూ) బ్లాసమ్ ?

మార్గరెట్ — (అతని చేతికి సీసా ఇచ్చి అల్మారా చూపిస్తుంది. అందులో పెట్ట మని సంజ్ఞ చేస్తుంది. అతనికి అర్థ మౌతుంది.) బ్లాసమ్! నీ పక్కమీదికి పోయి కూచో. నీమెడమీద లేసు సర్దుకో. (చూపిస్తుంది.) నీకోసం ఏమైనా పూస లున్నాయేమో తెస్తాను. (తన ఆఫీసులోకి వెళ్ళుతుంది.)

(బ్లాసమ్ అల్మారాలో సీసా ఉంచుతాడు. తర్వాత పరుపు టేబుల్ వద్దకు వెళ్ళి ఒక పెట్టెలో అర తీస్తాడు. పూస లుంటాయి. వాటిని గుచ్చుతూ కూచుంటాడు.)

డిగ్గర్ — (కూచుని తన పాయిజమా గుండీలు పెట్టుకుంటూ) ఇల్లంటే బెంగా ? అసలు వీళ్ళు సైన్యంలో ఎందుకు చేర్తారని ? (ఈగలు కొట్టే స్వాటర్ అందుకొంటాడు.)

కివీ — వాళ్ళనాయకుడు చేర్తాడు. అందరూ అతణ్ణి అనుసరిస్తారు. అతని తెగ అంతా చేరింది. ఇప్పు డితడు ఇంటికి వెళ్తా నంటాడు.

డిగ్గర్ — అతనూ నేనూ కూడాను. (స్వాటర్ పరుపుమీద కొడతాడు.) చవ్వు, రాక్షసముండాకొడుకా !

యాంక్ — ఈఈగలు బయటపట్టి ఇక్కడ లోపల విడిచిపెడుతున్నా రను కుంటాను.

డిగ్గర్ — నీఈగలు పరుపుమీదే ఉంచుకో. (ఈగ టామీ పరుపుమీద పారేస్తాడు.)

టామీ — (లేచి కూచుని, ఈగ వెతికిపట్టుకుని పరిశీలిస్తాడు) దీన్ని సులభంగా ఆనవాలు పట్టగలను. ఇది నీ ఈగేను. దీని కళ్ళు పుసిల్లా ఉన్నాయి. (డిగ్గరు పరుపుమీదికి పారేస్తాడు.)

డిగ్గర్ — (దాన్ని తీసి పారేసి) అసహ్యమైన నీ ఈగలు ఇక్కడ పారేయకు. (ముందుకిజరిగి, స్వాటర్‌తో టామీ మోకాలుమీద కొడతాడు.)

టామీ — (కోపంతో డిగ్గరువైపు చూస్తాడు. తన స్వాటర్ పైకి తీస్తాడు. డిగ్గర్ ప్రేక్షకులవైపు ముఖంచేసి కూర్చుండే టప్పటికి అతణ్ణి స్వాటర్‌తో కొడతాడు. ఇది రోజూ జరిగేదే. టామీ తనపని అయిపోయిందని వీపుజేరవేస్తాడు, టామీ మరొక్క చరుపు చరుస్తాడు. డిగ్గర్ వెంటనే తనొక్క చరుపు చరుస్తాడు. టామీ ఒక్కక్షణం ఆగి డిగ్గర్ మొహం మీద స్వాటర్‌తో చరుస్తాడు. డిగ్గర్

వెంటనే టామీ మొహంమీద కొడతాడు.) సిస్టర్ ! సహాయంచెయ్యి, వీడుమళ్ళా నన్నుకొడుతున్నాడు.

(డిగ్గర్ టామీని యాంక్ పరుపుమీదికి గెంటుతూ ఉంటాడు. ఇద్దరూ ఒకళ్ళనొకళ్ళు చరుచుకుంటారు.)

యాంక్ — ఇలా మీరు క్రిములు వ్యాపింపజేస్తున్నారు.

డిగ్గర్ — (వెంటనే జవాబిస్తూ) వాటిని నేను వార్డంతా వ్యాపింపజేస్తాను.

కివీ — ఇప్పుడు సిస్టర్ వచ్చిందంటే మనందరికీ బుద్ధి చెపుతుంది.

(తన ఆఫీసులోంచి మార్గరెట్ వచ్చి నిలబడి అంతా చూస్తుంది. డిగ్గర్, టామీ తమ మంచాలమీదికి వెళ్ళిపోతారు. ఎక్కడి వాళ్ళక్కడ మాట్లాడకుండా కూచుంటారు, ఏమీ జరగనట్టు.)

మార్గరెట్ — (బ్లాసమ్‌కోసం తెచ్చిన పూసలు అతడికిస్తుంది.) మళ్ళా మీరు స్వాటర్లతో కొట్టుకుంటూ ఉండగా పట్టుకున్నానా, స్వాటర్లన్నీ పోగుచేసి తీసుకువెళ్ళిపోతాను. అప్పుడు ఈగలు మిమ్మల్ని తినేస్తాయి. సరేనా ?

టామీ — ఎవరినీ ? నన్నా, సిస్టర్ ?

మార్గరెట్ — మీకుట్టుపని తీసుకొని, ఏదో నిర్మాణాత్మకమైన పనిచేస్తూ ఉండండి. మీకు ఊసుపోతుంది కూడాను. కానివ్వండి అందరూ. (తన ఆఫీసులోకివెళ్ళి వెంటనే బైటికి వస్తుంది. కివీ అల్లకంపనిఫ్రేము అతని కిస్తుంది. ఎర్రగానూ, నీలిగానూ ఉందది. టామీ తన అల్లకంపని తీసుకుంటాడు — నీలి పువ్వులు కల గుండ్రటి లేసుగుడ్డ అది.)

టామీ — (తన కుట్టుపని చేస్తూ) సిస్టర్, పసుప్పచ్చ దారం ఏమీ లేదూ? నేను పసుప్పచ్చగా ఉండే బట్టర్ కప్సు లన్నిటినీ నీలిదారంతో వేశాను.

మార్గరెట్ — (యాంక్ పరుపుమీద ఉతికిన దుప్పటి పరుస్తూ) మనకున్న రంగుల తోనే సర్దుకోవాలి. (టామీ పనితనం చూచి) అది బాగానే ఉంది. (మళ్ళా పరుపు వద్దకు వస్తుంది) నువ్వు స్వంతంగా అల్లిన దీన్ని చూసి నీభార్య ఎంత సంతోషిస్తుందో ఆలోచించు.

టామీ — (కిలకిలా నవ్వుతూ) వాటితో ఏమి చేయాలో ఆమెకు తెలిసి ఉండదు. వాటితో ముక్కు చీదుకుంటుంది.

మార్గరెట్ — లేకపోతే ఆమెకోసం టీకోజీ ఎందుకు చేయవు? దానితో ఆమెముక్కు చీదుకోలేదు కదా ! (శ్రమతో అల్లుతూ ఉన్న డిగ్గర్‌వైపు చూస్తూ) డిగ్గర్ ! నీభార్యకోసమా, అది ?

డిగ్గర్ — నా బిడ్డకోసం. పిల్లో, పిల్లాడో తెలిస్తే దీని రంగు నిర్ణయించేవాణ్ణి.

యాంక్ — నీకేం బిడ్డ పుట్టేటట్టుందా ?

టామీ — ఇది నాకు కొన్ని వారాల కిందటే తెలుసు. మనం డిగ్గరుతో కఠినంగా ఉండకూడదు.

యాంక్ — (డిగ్గర్‌వైపు చూపిస్తూ) కాని .... నువ్వు మూడేళ్ళనుంచి ఇంట్లోలేవు కదా, నీకు బిడ్డ ఎలా పుడుతుంది ?

డిగ్గర్ — (గట్టిగా) ఇంగ్లాండునుంచి వస్తూ దారిలో కేప్‌టౌన్‌లో పెళ్ళిచేసుకున్నాను.

యాంక్ — ఓహో !

టామీ — ఏం ఓహో ఓయి ! యాంక్ ఎందుకూ పనికిరాని వాడు.

కిపీ — (తన అల్లిక ఫ్రేము నేలమీద ఉంచి మోకాళ్ళపై నిలబడి) దీనిమీద పందెం వేద్దామా ? నేను డిగ్గర్‌కు పిల్లాడు పుడతాడని పందెం ఒడ్డుతాను.

డిగ్గర్ — నేను దానిమీద పందెం వేయను.

(మార్గరెట్‌కు సహాయంచేస్తున్న యాంక్ తన పక్కనున్న వగ్గిర టేబుల్ నుంచి తన అల్లిక పని తీసుకుంటాడు.)

కిపీ — సరే, పందెంవేస్తాను, కూతురు పుడుతుందని.

డిగ్గర్ — నీజీతం దాచుకో. నేను నాబిడ్డమీద పందెం వేయదలచుకోలేదు.

కిపీ — (మళ్ళా కూచుని తన అల్లిక పని ప్రారంభిస్తూ) ఇక్కడ చుట్టుపట్ల దేని మీదా నేను పందెం వెయ్యను.

మార్గరెట్ — యాంక్, ఇప్పుడు నువ్వు అల్లుతుందేమైనా డిగ్గర్ శిశువుకోసం మార్చెయ్యరాదూ ?

డిగ్గర్ — నువ్వేమీ శ్రమ తీసుకోకు.

(యాంక్ తన మంచం కాళ్ళవైపు అల్లికపనిచేస్తూకూచుంటాడు.)

టామీ — అతనికి నీడిల్ పాయింట్ డియాపర్ అంటే ఇష్టమనుకొంటాను.

(అతడు సర్దాగాపక్కకిలించి నవ్వుతాడు. ఒక ఆర్డర్లీ ప్రవేశించి తలుపుతీసిపట్టుకొని నిలబడతాడు.)

ఆర్డర్లీ — (మార్గరెట్‌తో) ఈరోగిని ఇక్కడికి తీసుకు వెళ్లమని ఆఫీసర్ కమాండింగ్ ఆజ్ఞాపించారు.

మార్గరెట్ — అవును. కర్నల్ నాతో చెప్పారు. అతని సామానంతా తెచ్చావా ?

ఆర్డర్లీ — (రంగం వెనకాల చూచినట్టు నటించి) అతను స్వయంగా తెచ్చు కొంటున్నాడు. నన్ను ముట్టుకో నిచ్చాడు కాదు.

(కొత్తరోగి ప్రవేశిస్తాడు. భుజంమీద 'కిట్', చేతిలో ఒక అకుపచ్చ సంచి ఉంటాయి. స్నానాలకోసం తొడుక్కొని ఉన్నాడు. నీలిసుస్తు లున్నాయి. ఇరవైయేళ్ళ చిన్నవాడు. సోల్జర్ ఉండవలసినంత భారిగా లేడు మనిషి. జుత్తుదువ్వలేదు. వెంట్రుకలు చిందరవందరగా ఉన్నాయి. అతడి నీలికళ్ళు కత్తుల్లా తీక్ష్ణంగా ఉన్నాయి. దవడ కొంచెం ముందుకి రావడం చేత తన పసుచు దనం అందం కొంత తగ్గింది. తన పరిసరాల్లో ఏమీ కౌతుకం ప్రకటించడు.)

మార్గరెట్ — ఓహో! ఇతని ఈ 'కిట్' ఇక్క డెక్కడుంచుతాడు ?

ఆర్డర్లీ — కర్నల్ పెట్టుకోవచ్చు నన్నా డంటాడు.

మార్గరెట్ — (అయితే సరే. ఖాళీమంచంవద్దకు దాటి వస్తుంది) ఈమంచం నీది.

(తన అకుపచ్చసంచి తలగడవద్ద ఉంచుతాడు. Duffle bag దానికింద ఉంచుతాడు. మోకాళ్ళమీద చేతు లానించి, ముందుకి మొహం చేసి మంచం కాళ్ళవైపు కూచుంటాడు.)

ఆర్డర్లీ — ఇదిగో ఇతని రిపోర్టు. (ఆర్డర్లీ ఆమెకు రిపోర్టిచ్చి వెళ్ళిపోతాడు.)

మార్గరెట్ — థాంక్యు (కొత్తరోగివైపు తిరుగుతుంది) నేను సిస్టర్ మార్గరెట్ను. కర్నల్ నాపేరు నీతో చెప్పా రనుకోను. (ఆమె తనను తాను పరిచయం చేసుకున్నా అతను మాట్లాడడు. అంచేత ఆమె రిపోర్టు చూస్తుంది.) సార్జంట్ లాచ్లెన్ మెక్లా ఛ్లెన్! నువ్వు స్కాటువా ?

లాచీ — (మాట్లాడుతూ ఉంటే స్కాటిష్ ఏస కనిపిస్తూనే ఉంటుంది) నేను స్కాటును కాకపోతే స్కాటుపేరు ఎందు కుంటుంది ?

(యాంక్ జంకుతూ పైకి తలెత్తి చూస్తాడు.)

మార్గరెట్ — నాకు తెలియదు. కొంతమంది తల్లిదండ్రులు తమ పిల్లలకు స్కాటిష్ పేర్లు పెడతారు. వాళ్ళకు ఆపేర్లంటే ఇష్టంగా ఉంటుంది.

లాచీ — కాని దానివల్ల ఎవ్వరూ మోసపోరు. అబద్ధపుపేర్లు పెట్టుకు తిరిగితే ఎవరు మోసపోతారు ? (ఆమెతో సంభాషణ పూర్తిచేసి ముందుకు తిరుగు తాడు.)

మార్గరెట్ — (నవ్వుతుంది) స్కాచ్లమీద కావాలని చేసిన కుట్ర అనుకోను నేను. (అతని కార్డు మరొకసారి చూస్తుంది.) అయితే, మీ ఇష్టప్రకారం కూచో వచ్చు — ఏమీ నిర్బంధం లేదని చెప్పాడు కర్నల్.

లాచీ — కూచుని కొంచెం ఆలోచించవలసి ఉంది.

మార్గరెట్ — ఏమైనా కావలసి వస్తే చెప్పండి.

లాచీ — (ఆమెవైపు తిరిగి) ఒకళ్ళు నాకోసం చేసిపెడితే నాకిష్టం లేదు.

మార్గరెట్ — (ప్రసన్నంగా) మీ కిష్టంలేదా ? నా కోసం ఎవరైనా చేసిపెడితే నాకెంతో ప్రీతి.

లాచీ — మీకిష్టం కావచ్చు, నాకు మాత్రం కాదు. (మొహం తిప్పుకుంటాడు.)

మార్గరెట్ — సరే, మీ ఇష్టంవచ్చినట్లు పాడుకోండి కావలిస్తే. ఆఫీసులోకి పోయి ఒకసారి మీ రిపోర్టు లన్నీ చూస్తాను. (గబగబా తన ఆఫీసులోకి వెళుతుంది. లాచీ నిశ్చలంగా కూర్చుంటాడు. తక్కినవా ళ్ళందరూ కుట్టుపని చేసు కుంటూ ఉంటారు. యాంక్ ఒక్క నిమిషంపాటు సందేహిస్తాడు. తర్వాత ఒక సిగరెట్టుపెట్టె తీసి మంచంమీదుగా వంగి లాచీకి సిగరెట్టు ఇవ్వ బోతాడు.)

యాంక్ — ఒకటి తీసుకుంటారా ?

లాచీ — (ఏమి ఇస్తున్నాడో అని కోరచూపు చూచి ముందుకు తిరుగుతాడు.) నా స్వంతం ఉన్నాయి.

యాంక్ — ఇవి ఇక్కడిచ్చినవి కావు. నేను ఇంటిదగ్గిరనుంచి తెచ్చుకొన్నవి.

లాచీ — అలవాటు లేనివి నా కిష్టం కావు.

యాంక్ — (ప్రోత్సహిస్తూ) ఒకసారి ప్రయత్నిస్తేనేగాని నీకెలా తెలుస్తుంది ?

లాచీ — ఒకళ్ళు ఊరికే ఇచ్చింది నేను తీసుకోను.

యాంక్ — ఎందుకు తీసుకో కూడదు ?

లాచీ — (అతనివైపు తిరిగి గట్టిగా) ఒకళ్ళకి రుణపడి ఉండడం నాకిష్టంలేదు.

యాంక్ — ఒక్కసిగరెట్టు మిమ్మల్ని పెద్ద రుణంలో ముంచెయ్యదు లెండి. (మరొక సిగరెట్టు ఇవ్వబోతాడు )

లాచీ — నాస్వంతంవి తాగుతాను. (జేబులోంచి సిగరెట్టు తీస్తాడు. అందరూ తమ అల్లికపని ఆపుచేసి అతనివైపు పరిశీలనాదృష్టితో చూస్తారు.)

డిగ్గర్ — (చిట్టచివరికి) హే, జాక్ !

(లాచీ వెలిగించిన అగ్గిపుల్ల సిగరెట్టు దగ్గరకు తీసుకుపోయి ఆసుతాడు. తర్వాతి డిగ్గర్ లక్ష్యం చేయడు.)

యాంక్ — (లాచీని సంబోధిస్తూ) అతను నీతో మాట్లాడుతున్నాడు.

లాచీ — (ఆవేశరహితంగా) అతడు నన్ను సంబోధిస్తూ ఉంటే, నాపేరు జాక్ కాదని చెప్పండి. (సిగరెట్టు వెలిగిస్తాడు.)

డిగ్గర్ — (చిరునవ్వుతో) స్కాచ్చు లందరినీ నేను జాక్ అనే పిలుస్తాను.

టామీ — (సమాధానపరుస్తూ) ఆస్ట్రేలియా వాళ్లందరూ డిగ్గర్లయినట్టు, న్యూజీలాండ్లందరూ కివీలూ, నావంటి ఇంగ్లీషు వాళ్లందరూ టామీలైనట్టు. అదిగో, అలాంటి అమెరికన్ లందరూ (కివీ వంక చూస్తూ) యాంక్లైనట్టు తెలిసిందా?

యాంక్ — (టామీతో) నేను వెధవ యాంకును కానోయ్. నాది జార్జియా తెలుసా?

లాచీ — (నిర్లక్ష్యంగా) నన్ను పలకరించవలసివస్తే నా పేరుతో పలకరించండి.

డిగ్గర్ — సిస్టర్ చదవగా ఏదో విన్నాను. కాని ఆ పేరు నాకు పట్టుబడలేదు. ఏమిటది?

యాంక్ — ఏదో లాచ్లైన్ అన్నట్టు జ్ఞాపకం.

డిగ్గర్ — సరే, 'లాచీ' — ఇది బాగుందా ?

లాచీ — (డిగ్గర్ వంక తిరిగి). ఇంతకూ నీకు కావలసిం దేమిటి ?

డిగ్గర్ — మరేమీ లేదు, నువ్వు మాట్లాడాలని.

లాచీ — ఉత్త పనికిమాలిన కబుర్లంటే నాకిష్టం లేదు.

యాంక్ — నువ్వు స్కాచ్చువి, అంతేనా ? (నవ్వుతాడు. గిర్రున కాళ్ళు తిప్పి లాచీ వైపు తిరుగుతాడు. మరోసారి అలాగే గిర్రున తిరుగుతాడు.) లాచీ ను వ్వే రెజిమెంటులో ఉన్నావు ?

లాచీ — (వెంటనే) నీ కెందుకు ?

యాంక్ — ఉత్తనే కుతూహలంకొద్దీ అడిగాను. మీరెజిమెంట్లో నే నెవరినైనా ఎరుగుదునేమో అని.

లాచీ — (అతనివైపు తిరిగి) నువ్వు స్కాచ్చువా ?

యాంక్ — మా త... త.... తాత అవును.

లాచీ — నా రెజిమెంటులో నీతాత ఉండడం అసంభవం అనుకుంటాను. (మొహం తిప్పుకుంటాడు.)

యాంక్ — (కోపంవస్తుంది) మాతాత ఎక్కడున్నాడో నాకు తెలుసు. మా వంశ శ్మశానంలో ఎక్కడుండాలో అక్కడే ఉన్నాడు. కాని నేను యాంబులెన్సు

కారు నడిపేవాణ్ణి కావడంచేత నాకు చాలా రెజిమెంట్లు తె....తె....తెలుసు. అందులో నీ స్నేహితులు కొందరు నాకూ మిత్రులు కావచ్చునని అడిగాను.

లాచీ — ఇది సాధ్యం కాదు. నే నంత సులభంగా స్నేహితుల్ని చేసుకోను.

యాంక్ — (పరుపుమీద వీపు జేరవేసి) నీకు స్నేహితులు లే....లే....లేరన్నమాట.

(లాచీ సిగరెట్టు పీలుస్తాడు. తర్వాత తన బూటుకు రాసి ఆర్పేస్తాడు. బాగా ఆరిందో లేదో చూసి మళ్ళా సిగరెట్టుపీక జేబులో పెడ్తాడు. లేచి తన వస్తువుల ప్యాకేజీని విప్పుతుంటాడు. కివీ, లాచీ పరుపుమీదికి ఒక పుస్తకం విసురుతాడు )

కివీ — చదవడానికి ఏమైనా కావాలా ?

లాచీ — (పుస్తకం తీసుకుని మళ్ళా కివీ పక్కపైకి విసిరేస్తాడు) నేను పుస్తకాలంటే విలువ చెయ్యను.

యాంక్ — నిన్ను నువ్వు మరిచిపోదలుచుకోలేదా ?

లాచీ — (ప్యాకేజీ విప్పుతూ) నాతో నాకు సంఘర్షణ ఏమీ లేదు. ఆలోచనాపరుడైన మనిషికి పుస్తకాలు కాలవ్యర్థ మంటాను.

యాంక్ — అట్లానా ? నువ్వు ఆలోచనాపరుడి వన్నమాట !

లాచీ — అవును.

యాంక్ — బైబిల్ అంటే ఏమైనా శ్రద్ధ ఉంటే దాన్ని గూర్చి ప్రసంగిద్దాము.

లాచీ — నాకు సందేహమే.

యాంక్ — అందులో మంచి కవిత్వ ముంది.

లాచీ — నాకు కవిత్వమంటే ఇష్టం లేదు. అది మతసంబంధందైనా వేరే విధం దైనా.

యాంక్ — చు....చు....చూడు. (లేచి రెండు మంచాలమధ్య నిలబడతాడు) ఇక్కడ స్నేహపాత్రులైన మంచి మిత్రుల జట్టుంది. నీకు పుస్తకాలు గాని కవులు గాని నచ్చకపోయినా మాకు పరవాలేదు.

లాచీ — గత్యంతరంలేదు. (మంచంమధ్య తలగడకు వీపానించి కూచుంటాడు.)

యాంక్ — నేను చె....చె....చెప్పబోయే దేమిటంటే బతుకూ బతకనీ (పటికిబెల్లం కడ్డీ ఒకటి అందిస్తూ) ఇదిగో తీసుకో.

లాచీ — (దానివైపు చూస్తూ) నామీద బలవంతంగా ఏమి రుద్ద దలచుకున్నావో అడగడానికి సాహసించవచ్చునా ?

యాంక్ — చాక్లెట్ కడ్డీ అక్కర్లేదా ?

లాచీ — (అతని కళ్ళల్లో సూటిగా చూచి) అది మంచిదికాదా ?

యాంక్ — (విసుగుదలతో) మంచిదా, చాలా మంచిది. నీ కెందు కిస్తున్నా ననుకుంటున్నావు ?

లాచీ — ఎందుకు ?

యాంక్ — ఎందు కంటావా ? అది నాకు కావాలి. కాని నాకంటే నీకే ఎక్కువ కావాలేమో అని నీ కిచ్చాను. అది పరాభవమా ?

లాచీ — (మరోవైపు చూస్తూ) నీకు కావాలి కాబట్టి నా కిస్తున్నావా ? ఈమాట విరుద్ధంగా ఉంది.

యాంక్ — (తనమంచం మీదికి దూసుకువచ్చి) ఓహో ! మా త....త....తాత యాంగన్ వ....వ....వచ్చాడయ్యా !

కివీ — (ఒక్కక్షణం ఊరుకొని మాట్లాడతాడు) లాచీ! ఎప్పుడైనా న్యూజిలాండు వెళ్ళావా ?

లాచీ — నేను చేయవలసినంత మట్టుకు ప్రపంచపర్యటన చేశాను. కాని మ్లేచ్ఛ దేశాలూ, మిషనరీలూ విడిచిపెట్టాను.

కివీ — (కోపంతో) న్యూజిలాండు మ్లేచ్ఛదేశం కాదు. నేను అక్కడినుంచే వచ్చాను.

లాచీ — (కివీవైపు చూచి) అది ఏమంత మంచికారణం కాదు.

టామీ — (చాలా సంతోషంతో) కివీ ! నిన్నక్కడ చూశాడోయ్.

కివీ — (ఓపిగ్గా) ఒకప్పు డది మ్లేచ్ఛదేశమై ఉండినమాట నిజమే. కాని అది చాలా కాలంక్రితం మాట. ఇప్పుడు న్యూజిలాండు ఆధునికదేశం, సరికొత్తగా ఉంటుంది.

లాచీ — నీఅభిప్రాయం కాదనను-అది తప్పయినా సరే.

కివీ — మమ్మల్ని మేమే పరిపాలించుకొంటాము. స్కాట్లండు కంటే నయమే కదా ?

లాచీ — (అతని వంక తిరిగి) మీరు ఫిజీదీవులకు పొరుగున ఉన్నారు కదా ! అంతేనా ?

కివీ — దానికీ దీనికీ సంబంధ మేమిటో నాకు తెలియదు.

లాచీ — ఫిజీదీవులవాళ్ళు నరభక్షకులను కొంటాను ? నిజమేనా ?

టామీ — ఆఁ, నిజమేనోయి లాచీ ! వాళ్ళు ఒకళ్ళ నొకళ్ళు తింటారు—అపాద మస్తకమున్నూ.

కివీ — వాః, నేనొక్క ఫ్రైజీ నెరగను.

లాచీ — మాకు దురదృష్ట వశాత్తూ ఇంగ్లీషువాళ్ళు పొరుగు వాళ్ళైనా వాళ్ళింకా ఒకళ్ళ నొకళ్ళు వండుకు తినడం లేదు. అధమం బహిరంగంగా తినడం లేదని చెప్పడానికి సాహసించవచ్చా ?

టామీ — (పరుషమీద గెంతుతాడు) నాకు కోపం వస్తుంది. నా చరిత్రపారమే జ్ఞాపకముంటే స్కాటులే మాసరిహద్దులపై దోపిడీలు చేసి మా పశువులు ఎత్తుకు పోయేవాళ్ళు. పశుల దొంగలు వాళ్ళు.

లాచీ — అవును, మీ ఇంగ్లీషుపశువులు తక్కువజాతివి కావడంవల్ల గాని లేక పోతే స్కాట్లండు ఈవేళ మంచిసంపన్నదేశంగా ఉండేది.

టామీ — (కోపంతో కేకలువేస్తూ) మీరు వెధవబ్రిటిష్‌సామ్రాజ్యంలో భాగమే కదా ?

లాచీ — (టామీతో) మీ కాసామ్రాజ్యం ఎలా వచ్చింది ?

టామీ — మ్లేచ్ఛు ల్నందరినీ ఓడించి.

లాచీ — (అలసిపోయి) అబ్బా ! ఎంత అహంభావమయ్యా బ్రిటిష్‌వాళ్ళకి ? మీరు విజేతలు కారు. మీ వలసరాజ్యాలు ఏవిధంగా సంపాదించారో చెప్పమంటావా—ఒక్క స్కాట్లండు తప్ప ?

టామీ — సైన్యాలు తీసుకువెళ్ళాం, జయించాం, అంతే.

లాచీ — మీరు మిషనరీలవల్ల జయించారు. మీకన్ను ఏదేశంమీదఉంటే ఆదేశానికి మిషనరీలను పంపించారు, మ్లేచ్ఛులకు ప్రార్థన నేర్పించారు. ఎప్పుడైతే మ్లేచ్ఛుడు మోకాళ్ళపై నిలబడి తల వంచాడో వాడిమీద ఇంగ్లీషు జెండా ఎత్తేశారు.

టామీ — నువ్వు స్వయంగా పరాజితజాతివాడివి. ఇంకా స్వరాజ్యంకోసం ఎలెక్ట్రిసిటీకోసం పోరాడుతున్నారు మీరు.

డిగ్గర్ — (స్నేహభావంతో) టామీ ! లాచీ చెవుతుంది నిజం. ఆస్ట్రేలియాకు కూడా మిషనరీలు వచ్చారు. (లాచీతో) లాచీ ! నువ్వు చాలా తెలివితేటలైన వాడివోయ్.

లాచీ — (డిగ్గర్‌కేసి చూచి) ఓహో ! నీది ఆస్ట్రేలియా ?

డిగ్గర్ — (సగర్వంగా) అది దేవుడి దేశం.

లాచీ — నువ్వనుకోడంమట్టుకే, గంతులువేసే పెద్దఎలకలకంటే ఎక్కువ ఏదీ పుట్టించని దేశం అంటే, నాకేమీ గురి కుదరలేదు.

డిగ్గర్ — (కోపంతో) కాంగారూ ఎలక కాదు.

కివీ — (ఇంకా కోపంతోనే) న్యూజిలాండు మ్లేచ్ఛదేశం కాదు.

లాచీ — మీదేశానికి ప్రతినిధిత్వం వహించే దేమిటి ? రెక్కలులేని పక్షి. ఎగర లేని పిట్ట.

యాంక్ — (కివీతోను, డిగ్గర్‌తోను) ఇక మీకు చెప్పవలిసిందేదో చెప్పేశా నను కొంటాను. ఇక అమెరికాలో కాంగారూలు కాని ఎగరలేని పిట్టలు కాని లేవు.

లాచీ — (జాలిపడుతూ) అహా ! అమెరికా ! మికీమౌస్‌దేశం. సంపన్నదేశం. అంతా డబ్బాలమీదా పదిసెంట్‌స్టోర్లమీదా మీబతుకు. ఊరగాయలు ఎన్ని విధా లున్నాయి అన్నివిధాల చర్చి లున్నాయి మీకు. కాని మీ విశ్వాస మంతా విటమినులమీదా రూజువెల్టుమీదాన్నూ.

యాంక్ — నువ్వు అజ్ఞానంతో మాటాడుతున్నావు.

లాచీ — అజ్ఞానంతో మాటాడుతున్నానా ? నాకప్పుడు పన్నెండేళ్ళ వయస్సు. గ్లాస్గోనించి ఓడమీద ప్రయాణం చేస్తున్నాను. గ్లాస్గోపేరు నువ్వు నిస్సం దేహంగా వినే ఉంటావు. మీ మహాన్యూయార్కు-నగరంలో ఒక చలికాలం పనిచేశాను. అబ్బా ! ఏం చలికాల మది ! మిమ్మల్ని చాలా దగ్గిర్నుండి పరిశీలించాను. మీ జాతి పుట్టుపూర్వోత్తరాలగురించి మాట్లాడ్డంలేదు. ఇదంతా వ్యక్తిగతంగా ఏమీ కాదు.

యాంక్ — (ఇరుకులోపడి) ఓరిపితుగా ! మనిద్దరి నేస్తంలో తగువు వచ్చేటట్టే ఉంది.

టామీ — అతనిపక్షం మాటాడినందుకు మంచి శాస్తి జరిగింది.

కివీ — ఇంక కోపాలూ తాపాలూ మానేయాలి. ఇదంతా కుగ్రతరహాగా ఉంది.

(గ్లాసమ్ లేచి లాచీవైపు పదేక స్పష్టిలో మాస్తాను.)

లాచీ — ఈ బ్రిటిష్ ఎవడో తెలుసుకో వచ్చా ?

యాంక్ — వార్డంతటిలో ప....ప....ప....పరమ అదృష్టవంతుడు. ఇంగ్లీషు అర్థంకా దతడికి.

లాచీ — ఏం కావా లంటాడు ?

యాంక్ — ఉత్తనే నిన్ను బాగా చూడాలని వచ్చాడు. నీలాంటి వాణ్ణి ఎ....ఎ.... ఎన్నడూ చూచి ఉండడు.

(ఆండరూ లాచీ నుంచి మొహం తిప్పుకొని తన అల్లికపని ప్రారంభిస్తాడు. బసుటో పూసలు గుచ్చడానికి వెళ్ళిపోతాడు.

ఒక్క క్షణంలో మార్గరెట్ వస్తుంది. ఆమె చేతిలో నీళ్ళసీసా ఉంటుంది. ఒక్కసారి నాల్గువైపులా చూస్తుంది.)

మార్గరెట్ — (సంతోషంతో) ఎలా నడుస్తుంది వ్యవహారం? (ఎవ్వరూ మాట్లాడక పోతే లాచీతో మాట్లాడుతుంది) వార్డులో వాళ్ళందరితోనూ పరిచయమైందా? ఇతను యాంక్.......

యాంక్ — (మాటకు అడ్డువచ్చి) మేమందరం పరిచయం చేసుకున్నాం.

మార్గరెట్ — (లాచీతో) అందరితో పరిచయం చేసుకొన్నారా?

యాంక్ — (కొంచెం విరసంగా) మే మంతా స్నేహితుల మయ్యాం.

మార్గరెట్ — (లాచీ మంచంపక్క బల్లమీద నీళ్ళసీసా పెడుతుంది.) నేను చేయ దగిం దేమైనా ఉందేమో ఆలోచించారా?

లాచీ — నా రెజిమెంటుకు నన్ను పంపించే అధికారం నీకు లేదా?

మార్గరెట్ — ఇక్కడ కొన్నాళ్ళు పేషెంటుగా ఉంటా లనుకొంటాను. వేళకోసం నిరీక్షించాలి.

లాచీ — నిరీక్షిస్తాను గాని పేషెంటును మాత్రం కాను.

మార్గరెట్ — లాచీ, నీ రెజిమెం టేది?

యాంక్ — నువ్వు స్కాటువో, లేక నీస్కాటుతాత బతికిఉంటేనే తప్ప నీప్రశ్నకు జవాబు దొరకదనుకో, సిస్టర్!

లాచీ — (యాంక్‌వైపు వంగి) దవడమీద ఒక్కగుద్దు పడేస్తాను, నీఇష్టం!

మార్గరెట్ — (వెంటనే) యాంక్, నీమంచిప్రవర్తన అంటే ఇదేనా? ఏమైందినీకు?

లాచీ — యాంకులో మంచిప్రవర్తన ఎలా ఉంటుంది?

యాంక్ — (మెల్లగా) ఇలాంటి క్రాక్ ఇంకో డున్నాడా? లెండ్–లీజ్ ఆపు చేసేస్తాను. (తిప్పుకొంటాడు.)

మార్గరెట్ — (లాచీ తలగడా బ్లాంకెట్లూ సర్దుతూ) స్కాట్లండుసంగతి మాటాడు దాం. ఐర్‌షైర్ ఎరుగుదువా?

లాచీ — (అనుమానంతో) నా కార్డుమీద చూచి ఉంటావు. నేను ఐర్‌షైరులోనే పుట్టాను.

మార్గరెట్ — నిజంగా నేను కార్డు చూడలేదు. నాకు ఐరూడూన్‌ఫుట్ బాగాతెలుసు.

లాచీ — కాని నువ్వు స్కాట్‌వి కావు కదా!

మార్గరెట్ — ఒకప్పుడు నేను స్కాట్లండులో పిల్లలకు చదువు చెప్పాను. ఎంత ముద్దైన పిల్లలు!

లాచీ — (కొంచెం ఆగి) అవును.

మార్గరెట్ — మంచి వ్యవసాయభూమి కూడాను.

లాచీ — (కొంచెం దీర్ఘంగా ఆగి) అవును.

మార్గరెట్ — నువ్వు కామరూన్ హైలాండర్స్‌కు చెందినవాడవని చెప్పావా నేను నమ్మను.

లాచీ — (చిదరించుకొంటూ) నువ్వు నా రికార్డు చూశావు.

మార్గరెట్ — నువ్వు కామరూన్సు తెగవాడివా ?

లాచీ — అవును.

మార్గరెట్ — కాదు.

లాచీ — సిస్టర్, నీకు చెవుడా ?

మార్గరెట్ — (ఏమీ తొణకకుండా) నా కాశ్చర్యంవేసింది. ఓహో ! వాళ్ళ దెంత అద్భుతమైన రెజిమెంటు ?

లాచీ — ఒక మోస్తరుగా బాగానే ఉంటాము.

మార్గరెట్ — ఎర్రాక్‌టార్టాన్ తొడుగుతారు కదూ !

లాచీ — అవును. అందరిలాగే.

మార్గరెట్ — నీ కిల్ట్ తెచ్చుకొన్నావా ? (లాచీ జవా బివ్వడు) మీరు కిల్టు తొడుగు తారు కదూ ? తొడగరా ?

లాచీ — బైటకి వెళ్ళేటప్పుడు తొగుగుతాం.

మార్గరెట్ — త్వరలోనే మాకోసమైనా తొడిగి చూపించాలి. (వార్డులో వాళ్ళ నందరినీ చూచి) లాచీ కిల్టు తొడగ్గా మీ అందరికీ చూడాలని లేదూ ?

యాంక్ — (చిరునవ్వైనా లేకుండా) అందుకోసం నేనెంతమాత్రం వేచుకొని ఉండలేను.

మార్గరెట్ — (లాచీతో) ఒక కంటిమీద పడుతూఉండే టోపీ తొడిగి, కిల్టు గల గలలాడుతూ ఉండగా వీధిలో నడుస్తూ ఉంటే ప్రపంచంలో నీతో సమానమైన మొగా డుంటాడా ?

లాచీ — (ఒక్కనిమిషం నిశ్శబ్దంగా ఉంటాడు) నాకు కిల్టులేదు.

మార్గరెట్ — కాని నీకు కిల్టు తప్పకుండా కావాలి కదా ?

లాచీ — తప్పకండా ఉండాలని ఏమీలేదు.

మార్గరెట్ — కాని నువ్వు కామరూన్సుకి చెందినవాడవు కదా ! నిన్ను తొడుక్కో నిస్తారు. నువ్వెలాంటి స్కాటు వయ్యా, లాక్లెన్ !

లాచీ — కిల్టుకోసం మేమే డబ్బిచ్చుకోవలసివస్తుంది. మంచి కిల్టు కావాలంటే ధర ఎక్కువ.

మార్గరెట్ — మీ కిట్లు ఇవ్వరా ?

లాచీ — మాకు యుద్ధంచేసే దుస్తులు తప్ప మరేమీ ఇవ్వరు.

మార్గరెట్ — నేనే మీ రెజిమెంటులో ఉంటే ఎంత ఖరీదయినా సరే, అన్నిటి కంటే మంచి కిట్లు కొని ఉంచుతాను.

లాచీ — (చలించకుండా) ఆడదానివికాబట్టి నువ్వు కొంటావు. నేను నాడబ్బు అంతకంటె మంచిగా వినియోగిస్తాను. నువ్వు దేనికి విలువ ఇస్తావో దాన్ని బట్టి ఉంటుంది అంటాను.

మార్గరెట్ — (లాచీదగ్గరకు వెళ్ళి) చూడు, లాక్లైన్, నువ్వు నాలుగేళ్ళనించి బైట ఉన్నావు కదూ ? అంతేనా ?

లాచీ — అవును. అప్పుడు నాకు పదిహేడేళ్ళు.

మార్గరెట్ — నీజీతం అంతా ఖర్చుపెట్టి ఉండవు. ఏమీ పొదుపుచెయ్యకుండా ఖర్చుపెట్టా వంటే సిగ్గుచేటు.

లాచీ — నాడబ్బు స్కాట్లండులో ఉంది.

మార్గరెట్ — దాన్ని తెప్పించుకోవచ్చుగా.

లాచీ — భూమిలోంచి దాన్ని ఊడబెరికి తెచ్చేదా ?

యాంక్ — (పరుపుమీద గంతులేస్తూ) న....న....నాకు తెలుసు. ఒకటిన్నుడబ్బాలో దాచి భూమిలో పాతిపెట్టి ఉంచాడు.

లాచీ — (తన పరుపుపక్క నీళ్ళసీసా చేత్తో పుచ్చుకుని) ఈసీసా తిరగ్గొట్టి కొడతాను, నోరుమూసుకొని ఊరుకోకపోతే.

మార్గరెట్ — యాంక్, నీఒంట్లో బాగాలేకపోతే పడుకో. దయచేసి కొంచెం మర్యాదగా ఉండవయ్యా !

లాచీ — నేను స్కాట్లండుకు తిరిగి వెళ్ళేటప్పుడు నాగాయాలు తప్ప మరేముంది తీసుకు వెళ్ళడానికి ? నాడబ్బు ఒకచిన్నపొలంలో పెట్టుబడిపెట్టాను. నేను భూస్వామి నవుతాను. (ఎడమచేతి వైపున్న కిటికీవద్దకు పోయి బైటికిచూస్తూ నిలబడతాడు. అందరూ హటాత్తుగా గంభీరముద్ర వహిస్తారు.)

మార్గరెట్ — ఓహో ! అదా ?

లాచీ — ఓహో ఎందుకంటావు ? ప్రపంచంలో పొలంకంటె అందమైనదేముంది? పనిచేసుకోడానికి నీస్వంతభూమి ! తరువాతిజీవితమంతా సంతృప్తిగా గడుపు కోడానికి ?

మార్గరెట్ — నీడబ్బంతా ఆకాస్తకొంద్రపరా పోతుందా ?

లాచీ — అవును. నాడబ్బు తాగుడుమీదా, మిరాయిలమీదా ఖర్చు పెట్టను.

మార్గరెట్ -- (మెత్తగా) నీపొలంఖరీదు సుమారుగా తీరిపోయిందా ?

లాచీ — మరోరెండునెలలు పోతే పొలం నాదైపోతుంది. (ఆమాట లతనికి సంగీతంలా చెవులకు సోకుతాయి.)

మార్గరెట్ — (ఒక్కనిమిషం ఊరుకొంటుంది) లాచీ! తెలివితక్కువపనే ఎందుకు చెయ్యవు ? నీకోసం ఒకకిల్టు ఎందుకు కొనుక్కోవు ? పొలం ఆగుతుంది. మరేం పరవాలేదు.

లాచీ — (మాట తెగేస్తూ) కిల్టు ఆగుతుంది.

*కివీ — నీపొలంలో భాగస్వామినిస్కూడా ఉందా ?

లాచీ — ఎవ్వరూ భాగస్వాములు లేరు.

(డిగ్గిం, టామీ, కవీ, యాంక్ తమ అల్లికపనుల్లో మునిగిపోతారు.)

మార్గరెట్ — నీపొలంలో ఏకాకిగా ఉండదలచుకొన్నావన్నమాట. అంతేనా ?

లాచీ — (కిటికీలోంచి ఇంకా బైటికిచూస్తూ) అవును.

మార్గరెట్ — ఒంటరిగాడ వైపోవూ ?

లాచీ — జీవితంలో ఎప్పుడూ నేను ఏకాకిగా లేను.

మార్గరెట్ — నీకేం కావాలో నీకు తెలిసినట్టే ఉంది. (వార్డు కలయజూచి) మీరందరూ అసాధారణమైన కృషిచేస్తున్నారే ఇవాళ !

యాంక్ — తేనెటీగల్లా ప....ప....పనిచేస్తున్నాం. ప్రతి ని....ని....నిమిషం లెక్కెడుతున్నాం కూడాను. (తన కుట్టుసూది లేసులో గుచ్చుతాడు. మార్గరెట్ తన ఆఫీసులోకి వెళుతుంది.)

యాంక్ — (ఒక్కక్షణం పరిశీలించి, లాచీతో) ప్రపంచంవిడిచి పొలంమీద ఉండాలని అనుకోడానికి కారణ మేమిటి ?

లాచీ — నిన్ను మాట్లాడ్డానికి ప్రోత్సాహించేవాణ్ణికాను.

యాంక్ — నిన్ను ఒకే ఒక ప్రశ్న వె....వె....వేస్తాను. అవి నీప్లాన్లు తల్లకిందులు చేయవుకదా ?

లాచీ — (కిటికీవద్దనించి కదిలి తన మంచంమీదికి వస్తాడు.) నన్ను తల్లకిందులు చేయడానికి నీతరంకాదు. ఒక్క ప్రశ్నవేయడానికి నీకు అనుమతి ఇస్తున్నాను. ఒకేప్రశ్న.

యాంక్ — కృతజ్ఞుణ్ణి. నీ అనుగ్రహం (కాళ్ళు కిందికి వేలాడవేసి, ముందుకు వంగుతాడు. లాచీకి అభిముఖంగా ఉంటాడు) నీకేం పట్టింది ?

లాచీ — పట్టుకోడమంటే ఏమిటి ? దయచేసి ఇంగ్లీషులో మాట్లాడ్తావా ?

యాంక్ — (లేచి లాచీకి అభిముఖంగా నిలబడతాడు.) నీకంటె మంచిభాష మాట్లాడే చిలకఉంది నాదగ్గిర.

లాచీ — నీచిలకదగ్గిరైనా బాషనేర్చుకున్నావు కావు. నిన్ను చూస్తే జాలివేస్తుంది.

యాంక్ — (తను తాను సంబాళించుకొంటూ) నీకసలు ఇంత చిరాకుగా ఎందుకుందో తెలుసుకోవాలని ఉంది. ఒక మనిషి నీతో స్నేహంగా ఉండి నీతో మాట్లాడితే అతనితో నువ్వెందుకు సుఖంగా ఉండవు ?

లాచీ — మీరందరూ స్నేహంగా ఉన్నారా ?

యాంక్ — నువ్వంత ఊహించలేవా ?

లాచీ — ఆసంగతి నాతో చెప్పవలసింది. నీవేళా, శ్రమా కూడా మిగిలేవి. నాకు స్నేహం వద్దు. మనుష్యపశువంటే నే నేమీ విలవచెయ్యను, నా స్వేచ్ఛ ఎవ్వరూ దొంగిలించకూడదని నాఅభిప్రాయం. (పక్కమీద కూచొని యాంక్ వైపు వీపుతిప్పుతాడు.)

యాంక్ — మరి నువ్వు విలువ ఇచ్చేది దేనికి ?

లాచీ — నువ్వు రెండోప్రశ్నకూడా వేస్తావని నాకుతెలుసు. (అతనివైపు చూడానికి తిరుగుతాడు) నీకు దేవుడిచ్చిన బుద్ధేఉంటే నువ్వీప్రశ్న అడగవు. నేను ఏకాంతసేవకు విలువఇస్తాను. ఇప్పు డర్థమైందా ?

యాంక్ — నీ కదే కావాలంటే కావలసినంత తీసుకో. (స్ట్రీకిను తీసుకు రావడానికి పెద్దపెద్ద అంగలువేసుకు వెళతాడు. తనకి సహాయానికి రమ్మని బ్లాసమ్‌కు సంజ్ఞచేస్తాడు. యాంక్ స్ట్రీకను అమరుస్తాడు. లాచీ వార్డునుంచి వేరై పోయినట్టు ఉంటుంది) నీ ఏకాంతప్రదేశంలో ఉండు. మృత్యువును కౌగిలించుకో. తమ్ముడూ, మాకు సంబంధించినంతవరకు నువ్వు లేవే అనుకుంటాను.

(అతను వెళ్ళిపోతాడు. యాంక్ తిన పక్కమీద పీపు చేరవేస్తాడు.)

యాంక్ — తెగనికత్తి ఎవరిదగ్గిరైనా ఉందా ? ఇక నాగొంతు కోసుకుంటాననుకొంటాను.

టామీ — (వినుకుంటూ) సిస్టర్ కివేవీ నచ్చవు.

యాంక్ — అత నేం కావాలంటున్నాడో అదే ఇస్తున్నాను. అతను తనకు తానే ఇష్టపడడు.

డిగ్గర్ — (యాంక్‌తో) ఓయ్, యాంక్ ! ఆస్ట్రేలియాగురించి ఆ పిచ్చివాడు చెప్పినమాటలు విన్నావుకదూ !

కివీ — అవును. నూజిలాండుగురించి అతనుచెప్పిన దానితో ను వ్వేకీభవించావు.

యాంక్ — పోనీలెంతయ్యా ! మరచిపొండి.

టామీ — (పడుకుంటాడు) హుమ్ ! పసులదొంగవెధవలు ?

(బాగ్ పైపు ధ్వని వినిపిస్తుంది. అందరూ లేచి తిన్నగా కూర్చుంటారు. లాచీస్క్రీను వెనుకాల నించి బాగ్ పైప్ వాయిస్తున్నాడు. స్క్రీను కిందినించి అతని పాదం కనిపిస్తుంది )

యాంక్ — ఏమై ఉంటుంది ?

టామీ — నేను మాత్రం కాను. ఇంకా నాకు నిద్రైనా పట్టలేదు.

(యాంక్ తన పరుపుమీద నిలబడి స్క్రీన్ మీంచి తొంగి చూస్తాడు.)

యాంక్ — (ఒక్క కేక వేస్తాడు) ధ్వని బాగ్‌పైపులది. (కళ్ళుమూసుకొని పళ్ళు పటపటా కొరుకుతూ) జెనెసిస్, ఎక్సోడస్, నెవెటికస్, నంబర్, డు....డు ... టర్నమీ, జాషువా, జజెస్.

(తెరపడుతుంది)

---

## రెండో అంకం

### మొదటి రంగం

(అదేరంగం. రెండు వారాలతర్వాత. బసుటో కిటికీ పక్క అల్మారా పై కూచుని పిల్లనగ్రోవి ఒకటి పట్టుకొని ఒక ఆఫ్రికన్ పాట పాడుతున్నాడు.

కివీ చేతిపట్టీ తీసేసి ఉంది. నేలి దుస్తులున్నాయి. యాంక్ మంచంమీద కూచుని ఈగలు తోలే స్వాటర్‌తో గాలి విసురుకుం

టున్నాడు. డిగ్గర్ పడుకొని ఏమీతోచని వాడిలా స్వెటర్‌తో ఈగలు కొడుతున్నాడు. టామీ ఉత్తరం రాస్తున్నాడు.

యాంక్ కడుపు మీద పడుకొని ఉన్నాడు. లాకీ తన సూట్‌కేసు మీద పడుకొని బూట్ పాలిష్ చేస్తున్నాడు. ఆంగర్ పైపు ఆతని వీపు ఉంది.

తెరలేచేటప్పటికి ముసుగులో పాటధ్వని వినిపిస్తుంది.)

డిగ్గర్ — నిశ్శబ్దంగా ఉండండి.

( గ్లాసమ్ తన పాట ఆపేస్తాడు. అంతా నిశ్శబ్దం. లాకీ బూట్ షూ కింద నుంచి మరొకటి తీస్తుకుంటాడు. దానిపై ఉమ్మి పాలిష్ మొదలెడతాడు. గ్లాసమ్ తన గ్లాసొకటి అక్కడ పెట్టేస్తాడు. కిటికీ దగ్గిరికి వెళ్ళి బైట చూస్తూ నిలబడతాడు.)

టామీ — (పైకిచూచి) ఇవాళ తేదీఏమిటి ? (ఎవ్వరూ మాట్లాడరు.) యాంక్ ! ఇవాళతేదీ ఎంతోయ్ ?

యాంక్ — (తలగడకిందనుంచి తలతీసి)

" థర్టీడేస్ హాస్ సెప్టెంబర్
ఏప్రిల్ జూన్ అండ్ నవంబర్
ఆల్‌ది రెస్ట్ హావ్ థర్టీవన్
ఎక్సెప్ట్ ఫిబ్రవరి " ఇంకేదో ఏదో — ఏదో కారణంవల్ల ఇరవైఎనిమిదిరోజులే అవుతాయి. ఇవాళ మొదటితారీఖు. (మళ్ళీతలకాయ తలగడకిందదూర్చి విశ్రమిస్తాడు. టామీ ఉత్తరంపూర్తిచేస్తాడు. ఒకకవరులో పెట్టి టేబుల్‌మీద పెడతాడు. తన ప్లెస్వాటర్ తీసుకొని చుట్టూచూస్తాడు. డిగ్గర్ కేసి ఒక్కచరుపుచరుస్తాడు.)

డిగ్గర్ — (చిరాకుపడుతూ) ఆఁ (కడుపుమీద దొర్లుతాడు. టామీ ఈగలు నిర్లక్ష్యంగా కొడుతూ ఉంటాడు. కివీ లేచి తనపడుకుమీదికి వెళతాడు.)

టామీ — ఇప్పుడు టైమెంతైంది ?

కివీ — (గడియారం చూస్తూ) పదకొండు న్నర.

టామీ — టిఫిన్‌వేళ అయిం దనుకొన్నాను.

డిగ్గర్ — కడుపుసంగతిమాత్రం ఎప్పుడూ మరచిపోవు.

టామీ — (అభిమానం చూపిస్తూ) నువ్వింక నన్ను ప్రేమించవు. ఒకప్పుడు నేను మంచి స్నేహితుణ్ణనుకొన్నావు. (పళ్ళికిలిస్తాడు.)

యాంక్ — (విరసంగా) ఇక్కడనించి సంతోషంగా వెళ్ళిపోతాను.

(ఒక్క క్షణం తర్వాత, త్వరత్వరగా అడుగులు వేస్తూ మార్గరెట్ వస్తుంది. చాలా ఉల్లాసంగా ఉంటుంది.)

మార్గరెట్ — ఇవాళ ఎంతసర్దా అయినరోజో చూడండి. (ఉత్తరాలు పైకిచూపిస్తూ) ఇప్పుడే పోస్టువచ్చింది.

యాంక్ — (కేకలు వేస్తాడు) ఉత్తరాలు !

(అందరూ కౌతుకంతో గంతులేసి దిగుతారు.)

టామీ — ఇప్పుడే ఒక ఉత్తరం రాశాను.

డిగ్గర్ — మంత్రకత్తెవి, సిస్టర్ !

కివీ — పందెంవేస్తాను నాకుత్తరం వచ్చిందని.

యాంక్ — (ఆవేగంతో) సిస్టర్ జాగ్రత్తగాచూడు.

మార్గరెట్ — ఒక్కనిమిషం ఆగండయ్యా ! (డిగ్గర్ తలగడమీద రెండుత్తరాలు పెట్టి) డిగ్గర్ ! ఒకటి—రెండు.

డిగ్గర్ — (తీసి) నువ్వు దేవకన్నెవు, సిస్టర్ !

మార్గరెట్ — (టామీవైపు దాటి) టామీ, ఇదిగో లావాటి ఉత్తరం. ఒకటి నీకు. (అతనిచేతి కిస్తుంది.)

యాంక్ — నాకుకూడా ఒక ఉత్తరం వెతికిఇయ్యి సిస్టర్ ! అది చెల్లించని బిల్లైనాసరే. ప్లీజ్ !

మార్గరెట్ — (అతని చేతికొక ఉత్తరం ఇస్తుంది) ఒకటి.

యాంక్ — (దానివైపు చూస్తాడు) అదే అది. వ....వ....వా (చదవడానికి వీపు జేరవేస్తాడు.)

మార్గరెట్ — (కివితో) నిన్ను ప్రేమించేవాళ్ళున్నారు కొంతమంధి. (అతనికి మూడుత్తరా లిస్తుంది.)

కివీ — (సంతోషంతో) నేనేం చెప్పాను ?

మార్గరెట్ — అయిపోయాయి ఉత్తరాలు. (కివీతో) బ్లాంకెట్లు లోపలచుట్టు.

(బాబీ ఇంకా జోళ్ళు పాలిష్ చేస్తూనే ఉన్నాడు. ఎక్కడివాళ్ళక్కడ ఉత్తరాలు చదువుకుంటున్నారు.)

టామీ — (తనలో తాను చదువుకొంటూ) ఓ డియర్! ఓ డియర్! ఓ డియర్! (పళ్ళికిలించి నవ్వుతాడు.)

మార్గరెట్ — (ఆగి లాచీవెనక నిలబడుతుంది.) లాచీ, నీఉత్తరా లేమౌతున్నాయో నాకు తెలియదు. నీ రెజిమెంటులోవాళ్లు ఉంచుకోడం లేదుకదా? పోష్టాఫీసుకు ఎందుకు రాయవు ?

లాచీ — (పైకి చూడకుండా) నాకేమీ ఉత్తరాలు రావు.

మార్గరెట్ — నువ్వెక్కడున్నావో మిత్రులకు చెప్పలేదా ?

లాచీ — నాకు చాలామంది స్నేహితులున్నారు. డూన్‌ఫుట్‌లో, ఐర్‌షైర్‌లో, గ్లాస్గోలో, రోజ్‌మార్కులో, ఎడింబరోలో, ఇంకా చాలాస్థలాల్లో. నేను జాగర్తగా ఎన్నుకొన్న మిత్రులు. వాళ్ళందరికీ నాఅభిప్రాయాలు తెలుసు. వాళ్ళకు నేనేమీ రాయక్కరలేదు.

మార్గరెట్ — ఇంటిదగ్గిర్నుంచి వార్తలు రాకపోతే ఏదో పోగొట్టుకొన్నట్టుండదూ ?

లాచీ — నేనుపోగొట్టుకొన్నది చాలాఉంది. కాని నువ్వు వినే ఉంటావు : ఇప్పుడు యుద్ధం జరుగుతుందని.

మార్గరెట్ — అవును. విన్నాను. నేను పెళ్ళిచేసుకోవాలనుకొన్న మనిషి క్రీట్‌లో చచ్చిపోయాడు. యుద్ధంగురించి విన్నాను.

లాచీ — (కొంచెంతగ్గి) ఐతే నువ్వు ఎరుగుదువన్నమాట ! (మళ్ళా బ్రష్‌తీసుకొని షూపాలిష్ ప్రారంభిస్తాడు.)

మార్గరెట్ — కాని బ్లయిటీలో ఏంజరుగుతుందో తెలుసుకోడంకూడా మంచిదే అంటాను.

లాచీ — నేను తెలుసుకొన్నంత మాత్రాన అక్కడి పరిస్థితులు మార్తాయా ?

మార్గరెట్ — మారవచ్చు. (తనఆఫీసులోకి వెళ్ళిపోయి ఆగుతుంది) టిఫిన్‌లో మీకేమైనా ప్రత్యేకంగా కావాలా ?

లాచీ — ఏమీలేదు.

మార్గరెట్ — తప్పకుండా నీకిష్టమైన ప్రత్యేకవస్తు వుండకపోదు. నేను స్వయంగా చేస్తావాన్ని.

లాచీ — ఎందుకు ?

మార్గరెట్ — ఎందుకని ఎందు కడుగుతావు ?

లాచీ — సిస్టర్, నేను చూస్తున్నాను. నువ్వు నాపై ఏదో మెహర్బానీ చేయాలని చూస్తున్నావు. దానిలో ఉద్దేశమేమిటో నాకు తెలియదు. ఈసందర్భంలో

నిన్ను హెచ్చరించడం న్యాయ మనుకుంటాను. నా ప్లానుల్లో వివాహాని కేమీ స్థానం లేదు.

మార్గరేట్ — (రెచ్చిపోయి) ఇలాచెప్పడం చాలా మంచిదైంది.

లాచీ — అవును.

మార్గరెట్ — నిన్ను ఉచ్చులువేసి పట్టే ఉద్దేశం కూడా లేదని నమ్మజెప్పుతున్నాను.

లాచీ — ఇది నాజీవితంలో మొదటిసారి కాదు.

మార్గరెట్ — నాకు తెలుసు నిన్నుచాలామంది వెంటాడేఉంటారు. నిన్ను నీభోజనం గురించే అడిగాను. మామూలుకంటే కొంచెం మారిస్తే నువ్వు సంతోషిస్తా వేమోనని.

లాచీ — ఒకళ్ళు నాకోసం ఎలాంటి మెహర్బానీ చేయబోయినా అది నాకిష్టంలేదని చెప్ప సాహసించనా ? నాకు ఏవిధమైన ప్రత్యేకతా అవసరంలేదు.

మార్గరెట్ — ఓలాచీ ! ఎప్పుడైనా ఒకసారి అయినా మనకు ప్రత్యేకతకు అర్హత ఉంటుంది. మరెందుకు కాకపోయినా ధిక్కారానికైనా ఆ అర్హత ఒకసారి సంపాదించుకోవా లంటాను.

లాచీ — ప్రత్యేకతకు నాకు హక్కే ఉంటే దాన్ని అడగను. డిమాండ్ చేస్తాను.

మార్గరెట్ — లాచీ ! నువ్వొక్కొక్కప్పుడు చాలాదూరం వెళ్ళిపోతావు.

టామీ — (పైకిచూచి) హియర్ ! హియర్ !

లాచీ — నా గాయాలకు జాలిపడి ఇంత దయగా ప్రవర్తిస్తున్నావా ? నన్నెరగవు నువ్వు. ఎరిగితే ఇదంతా నాకోసం చేస్తా ననవు.

మార్గరెట్ — ఓలాచీ ! దయచేసి కొంచెం మానవత్వంతో ప్రవర్తించు.

లాచీ — నీకిష్టమని నేను బలహీనుడిగా ప్రవర్తించననుకో.

మార్గరెట్ — నేనూ అంతే. బలహీనుల్ని చూస్తే నాకు ఎలాగో ఉంటుంది. నాలోని లోపం అది. ఇది నాకర్థమౌతుంది. (కోపంతో తన ఆఫీసులోకి దూసుకుపోతుంది. త్వరలోనే పశ్చాత్తాపపడి లాచీవద్దకు వస్తుంది.) నీమీద కోప్పడ్డాను. దానికి విచారిస్తున్నాను.

లాచీ — ఆడవాళ్ళకోపతాపాలు నేనంత లెక్కచెయ్యను.

మార్గరెట్ — నువ్వెప్పుడైనా పెళ్ళిచేసుకొనిఉంటే అది చాలాప్రయోజనకరమైన గుణం.

లాచీ — (నిందాపూర్వకంగా) నువ్వు మాటిమాటికీ పెళ్ళిపెళ్ళి అంటావు. వింతగా ఉంది.

మార్గరెట్ — (సంయమంతో) లాచీ ! నామాట నమ్ము. నీకోసం ఏమీ పిలపన్న దంలేదు. నీ మీద నాకేమీ పెళ్ళిచేసుకోవాలన్న అపేక్ష లేదు. నేను నీఅందాన్ని ధిక్కరించగల బలం తెచ్చుకుంటాను. అందుకోసం నువ్వు పెద్దజాగర్త పడనక్కరలేదు.

లాచీ — (నిశ్చలంగా) ఒకవైపు మానసంతానూ ఉన్నావు. మరోవైపు నిరాక రిస్తూనూ ఉన్నావు.

మార్గరెట్ — నేనేం గట్టిగా కాదనడమూలేదు ; అలాగని పట్టుపడాలేదు. నిజంగా (దీర్ఘనిశ్వాసం విడుస్తుంది) లాచీ ! నీకోసం ఏదైనా స్పెషల్‌డిష్ ఏర్పాటు చేయమంటావా అనిమాత్రం అడుగుతున్నాను. ఇందులో నీపై దయదల్చింది ఏమీలేదు, మెహర్బానీలేదు.

లాచీ — ఉన్నదానితో నేను సంతృప్తిచెందుతున్నాను. (పక్కపై వీపువాలుస్తాడు.)

మార్గరెట్ — నీఇష్టం వచ్చిం దేదైనా అడిగే దినంకోసం నిరీక్షిస్తాను. అడిగి నప్పుడు మాత్రం అద్భుతంగా చేస్తాను. (బయలుదేరుతూ) యాంక్, మంచి ఉత్తరమా ?

యాంక్ — చ....చ....చాలా మంచి ఉత్తరం.

(ఆమె బైటికి వెళ్తుంది. డిగ్గర్ తన రెండో ఉత్తరం తెరిచి చదవనారంభిస్తాడు.)

డిగ్గర్ — (కేకలువేస్తూ) హిప్ ! హిప్ ! మాఆవిడి ప్రసవించింది. (ఉత్తరం చేతితో ఆడిస్తాడు.)

యాంక్ — క్షేమమేనా ?

టామీ — నాకు నొప్పులయ్యాయా ? (పళ్ళికిలిస్తాడు.)

కివీ — పిల్లా ? పిల్లాడా ?

డిగ్గర్ — పిల్లవాడు. మా ఆవిడ నాపేరు పెట్టింది. ప్రియతమా ! (తన తలగడ తీసుకొని పరుపుమీద నిలువుగాపెట్టి వీపుజేరవేస్తాడు.)

యాంక్ — తల్లీ పిల్లా బాగున్నారా ?

డిగ్గర్ — (పళ్ళికిలించి నవ్వుతూ) అద్భుతంగా ఉన్నారు.

కివీ — అభివందనాలు. డిగ్గర్ !

టామీ — నాకూ పిల్లవాడుంటే ఎంతబాగుండేది ! పిల్లవాడే పుడితే నన్ను ఇంటికి పంపేవాళ్ళు దయదలిచి. నాలుగేళ్లయింది ఇల్లువిడిచి.

యాంక్ – (వెనక్కి చేరబడి) మరొకసారి చదువుతాను. నాపిల్ల నన్నెంతో ప్రేమిస్తుందోయ్.

(అందరూ ఉత్సాహంగా వినడానికి కూర్చున్నారు. రెండో ఉత్తరంలో ఏదో చదివి టామీ కిలకిలానవ్వుతాడు.)

టామీ – ఓ డియర్, ఓ డియర్, ఇది మీరు వినాలి.

యాంక్ – విందాం పట్టండి. (కూచుంటాడు.)

కివీ – మేం వింటున్నాం.

టామీ – (ముందు తాను వికారంగా శరీరం తిప్పుతాడు.) నా గాయాలగురించి నాభార్య ఊరంతా చాటేంది. నేను పెద్ద హీరోనైపోయాను. (ఆవేశంతో) వాళ్ళేంచేశారో తెలుసా ?

యాంక్ – నీవిగ్రహం ప్రతిష్ఠించారా ? – పిగ్‌ఐరన్‌తో.

టామీ – (ఆవేశంతో చెప్పలేకపోతున్నాడు) కాదు. నాగౌరవార్థం పబ్లిక్‌డిన్నరు ఏర్పాటుచేశారు. ఒక పుడ్డింగుకు నాపేరు పెట్టారు. (కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వుతాడు) పుడ్డింగు !

డిగ్గర్ – (నవ్వుతూ) పుడ్డింగు చాలాబరువుగా ఉందని పందెం వేస్తాను.

టామీ – వాళ్ళసహృదయత్వం చూడండయ్యా ! క్రిస్మస్ పళ్ళతో నన్ను అమర్త్యుణ్ణి చేశారు. ఓహో డియర్ ! ఓ డియర్ ! పిచ్చివాళ్ళు. (అతని నవ్వు కిలకిలలో లయించిపోతుంది. హఠాత్తుగా మళ్ళా విరగబడి నవ్వుతాడు.) " ది పర్సివేల్ హాకిన్స్ పఫ్ఫ్వీట్ పుడ్డింగు. "

(ఒక్క లాచీ తప్ప అందరూ నవ్వుతారు. లాచీ తటాలున లేచి వాళ్ళకభిముఖుడై నిలబడతాడు.)

లాచీ – మీకు మంచిఆడవాళ్ళే దొరికారయ్యా !

యాంక్ – తప్పకుండా వాళ్ళు మంచివాళ్ళే. ఇప్పు డేంవచ్చింది ?

లాచీ – నిస్సందేహంగా వాళ్ళంటే మీరు గర్విస్తున్నారు.

కివీ – ఎందుకు గర్వించకూడదు ?

లాచీ – ఈ అనవసరమైన వార్తలన్నీ రాయడానికి టన్నులకొద్దీ కాగితం ఖర్చవుతున్న సంగతి మీకు తెలుసా ? ఈవార్తలు ఇప్పుడు రాయకపోతేనేం ? స్టాంపుల మీద ఖర్చుపెట్టే డబ్బంతా తిండికిఖర్చుపెట్టవచ్చుకదా ? ఈమతిలేని ఆడవాళ్ళఉత్తరాలు మాత్రమే తీసుకు రావడానికి ఎన్నిఓడలు ఎన్ని విమానాలు కావలసివస్తుందో ఎప్పుడైనా ఆలోచించారా ?

డిగ్గర్ — (అలసటతో) కొంతమార్పుగానైనా ఉంటుంది. కొన్నాళ్ళు ఈప్రపంచాన్ని నువ్వే పాలించి దేవుడికి కొంత విశ్రాంతి ఎందు కివ్వవయ్యా!

లాచీ — వ్యర్థవ్యయం అనే నేరం చేస్తున్నారు మీరు; మీరూ మీఆడవాళ్ళున్నూ. (అందరివైపు చూస్తాడు) మరి మీరందరూ పిల్లల్లా కూచున్నారు, దీనంతటికి సంతోషిస్తూ.

యాంక్ — మాయంపు దయదల్చి మాతప్పులు మాత్రం చూపించకు, సరేనా?

లాచీ — మీఅంతరాత్మ మిమ్మల్ని వేధిస్తుంది; నేనుకాదు. (బ్యాగ్‌పైపుకోసం తనమంచంవెనక్కి వెళతాడు.)

యాంక్ — సరే, అలాగేకానీ. నాఅంతరాత్మేను.

(లాచీ తన బ్యాగ్‌పైప్ తీసికొని దాన్ని వాయించడానికి కూర్చుంటాడు.)

యాంక్ — (ఆకాశంవైపు చూస్తూ) దేవుడా! ఇతనికి దమ్మురోగం ఈ.

(లాచీ బ్యాగ్‌పైప్ వాయించటం మొదలుపెట్టకముందే మార్గరెట్ ప్రవేశిస్తుంది.)

మార్గరెట్ — లాచీ! కర్నల్ వెంటనే నిన్ను చూడాలని కబురంపించాడు.

లాచీ — (బ్యాగ్‌పైప్ అక్కడే వేలాడదీస్తాడు. మార్గరెట్ అతనిటేబుల్‌నుంచి అతనిబాత్‌రోబ్ తీస్తుంది.) అత నిక్కడి కెందుకురాడు?

మార్గరెట్ — (స్నానంకోటు తొడిగించడానికి పట్టుకు నిలబడుతుంది.) ఎప్పరే తీసుకొంటా డనుకొంటాను. చక్రాలకుర్చీ కావాలా?

లాచీ — నాకు కాళ్ళున్నాయి. ఆరోగ్యమూ ఉంది. (కోటు తొడుక్కొని) మరి కర్నల్‌అంటే నాకేమీ గౌరవంలేదు.

మార్గరెట్ — నీకు గౌరవం ఉండవలసింది. అతను మంచి కమాండింగ్ ఆఫీసరే కాకుండా గొప్ప సర్జన్‌కూడాను.

లాచీ — నేనంటే అతడికి కసిగా ఉంది.

మార్గరెట్ — అది అసంభవం.

లాచీ — అయినా అతడికి నామీద కసిగా ఉంది. (తలుపువైపు బయలుదేరతాడు) నేను ఆరోగ్యంగా ఉన్నాను. నాస్వంత ఆలోచనలు గల స్కాటును నేను. ఇదంటే ఏ ఇంగ్లీషువాడికీ కిట్టదు. (తలుపు జోరుగా వేసుకు బైటికి వెళ్తాడు.)

యాంక్ — సిస్టర్, ఇతను నిజంగా చావబోతున్నాడా? ఎందుకంటావా? చావకపోతే నేనే చంపుతాను.

మార్గరెట్ — ఎంత భయంకరమైన మాట అన్నావు? నువ్వంటే నాకు సిగ్గు వేస్తోంది.

కివీ — నువ్వతనితో ఉండనక్కరలేదుగా ?

డిగ్గర్ — వాడా ? ప్రపంచం అంతటిమీదా వాడికి కసిగా ఉంది.

యాంక్ — వాడి వైఖరి ఏదుపందివైఖరి. వాణ్ణి ముట్టుకోలేరు మీరు.

మార్గరెట్ — అతణ్ణి తెలుసుకోడానికి మీరు ప్రయత్నించారా ?

యాంక్ — వాణ్ణి తెలుసుకొంటే వాణ్ణి అసహ్యించుకోడం అన్నమాట.

మార్గరెట్ — అతణ్ణి ప్రేమించడానికి ఎందుకు ప్రయత్నించరు ?

టామీ — మేమంటే అతని కిష్టంలేదుకదా ! అతడు పరమ కఠినుడు.

మార్గరెట్ — అతడితో విరోధం ఎందుకు పెట్టుకోరు ?

డిగ్గర్ — అతడితో విరోధమా ?

యాంక్ — అతడికి విరోధం ఉండనే ఉంది.

మార్గరెట్ — నామాటవినండి. మీరందరూ ఉల్లాసంగా ఉండాలని అతణ్ణి మీదగ్గరకు పంపించలేదు. మీ రతనికి సహాయంచేయాలని పంపించారు. అది మీకు ప్రశంసకదా !

యాంక్ — మామీద సవాలా ?

మార్గరెట్ — సరే, సవాలే అనుకో. ఒక సవాలు నుంచి పారిపోవడం మొగతనమా ? నాకు ఒక్కొక్కప్పుడు ఓపిక సన్నగిల్లుతుంది. నే నొప్పుకుంటాను. కాని మన ప్రయత్నంలోపం ఉండకూడదు.

డిగ్గర్ — వాడు సుఖంగా ఉంటే బాధపడతాడనుకో, సిస్టర్ !

యాంక్ — నువ్వు ప్రేమించగల ఒక్కవిషయం వాడిలో ఉందేమో చూడు.

మార్గరెట్ — మీ రతనంటే ఇష్టపడుతున్నారా లేదా అన్నది ముఖ్యవిషయం కాదు. లాచీ వీరుడా కాడా అన్నదీ ముఖ్యం కాదు. అత డొక మానవుడు. రోగి. బాధపడుతున్నాడు. అలాంటి వాణ్ణి ఖండిస్తూ ఉండడం ఎంత అనుచితమైన పని ! మీరందరూ బాగుపడతారు. అతనో ?

టామీ — అతను మాటిమాటికీ ఎదురుతిరుగుతాడు కదా !

మార్గరెట్ — మన అభిప్రాయాలూ అతని అభిప్రాయాలూ కలవ్వనుకొందాము. దానివల్ల అతను మనకు శత్రు వౌతాడా ?

టామీ — మాట్లాడడానికి కఠిను డౌతాడు.

మార్గరెట్ — తన జీవితం చివరి వారాలు మీతో గడుపుతున్నా డతడు. అలాంటి వాడికి ఉపకారంచేసే అవకాశం మాటిమాటికీ దొరుకుతుందా ? మీ అందరి వైఖరీ చూస్తే నాకు సిగ్గుగాఉంది.

(ఒక్క క్షణంపాటు అందరూ నిశ్శబ్దంగా ఉంటారు.)

టామీ — అవును, అలా చేయకపోతే మనలో మంచితనం లేదన్నమాట. — నేనైనా తక్కినవాళ్ళైనా.

మార్గరెట్ — సరే ఈవేళ దాన్ని సర్దుకొనే అవకాశం ఉంది. (యాంక్ వంక తిరుగుతుంది) యాంక్, నాఆఫీసులోకి వెళ్ళు. అక్క డొక పెద్ద పార్సిల్ ఉంది. దాన్నిక్కడకు పట్టుకురా. (యాంక్ బైలుదేర్తాడు) ఇవాళ అతను పుట్టినదినం.

(యాంక్ ఆగుతాడు.)

కివీ — అతని పుట్టిన దినమా ?

మార్గరెట్ — అతని ఎడ్మిషన్సు కార్డుమీద చూచాను.

డిగ్గర్ — మాంచి పుట్టినదినం విందిస్తావా అతనికి ?

మార్గరెట్ — సహాయం చెయ్యవా మరి ?

యాంక్ — సరే, మరోసారి ప్రయత్నిద్దాం. (మార్గరెట్ ఆఫీసులో అడుగు పెడ్తాడు.)

టామీ — కేక్ తెప్పించావా ?

మార్గరెట్ — అసలు హాగిస్ చేయిద్దామనుకొన్నాను. కాని ఇక్కడ హాగిస్ ఎవరు చెయ్యగలరు ?

(యాంక్ పార్సెలు తీసుకువచ్చి లాచీ మంచంమీద పెడ్తాడు. మార్గరెట్ వెళ్ళి పార్సెలు విప్పుతుంది.)

టామీ — నాకు బహుమానాలంటే చాలా ఇష్టం.

మార్గరెట్ — కిల్టు తెప్పించాను.

కివి — — కిల్ట్ !

మార్గరెట్ — దానికి సంబంధించిన సామానంతాను. అతని రెజిమెంటు నడిగి కలకత్తా రాసి తెప్పించాను. (అందరూ ఆమె చుట్టూ మూగుతారు.) ఆల్—ఎ—ఎష్కు మనం కృతజ్ఞులమై ఉండాలి. వేళకు చేరిం దిది.

యాంక్ — ఒక్క నిమిషం ఆగండి. దీనంతటికీ నువ్వే డబ్బివ్వక్కరలేదు.

మార్గరెట్ — అవును. మీరందరూ ఇవి అతనికివ్వాలని నాకోరిక.

యాంక్ — మేమే అతని కిచ్చేటట్టయితే మేమే దాని డబ్బిచ్చుకుంటాం.

కివి — మేము తప్పకంకా డబ్బిచ్చు కొంటాము.

డిగ్గర్ — అందులో ధరలుపట్టీ ఉంటే చూడండి. మాకు తగినవస్తువు తీసుకొని డబ్బిచ్చేస్తాము. అలా చేయనిస్తావా, సిస్టర్ !

మార్గరెట్ — తప్పకుండా అలాగే చేయండి. (ధరలపట్టీ డిగ్గర్ కిస్తుంది.)

టామీ — ఇది అతణ్ణి ఆనందింప జేయలేకపోతే మరేదీ చేయలేదు.

డిగ్గర్ — సిస్టర్ ! ఈ జోళ్ళు ఇవ్వవచ్చా నేను ?

మార్గరెట్ — సరే, ఇది నీవంతు. త్వరపడాలి. (జోళ్ళు డిగ్గర్ కందిస్తుంది. నీ తలగడకిందో మరేమూలో కనపడకుండా ఉంచు.

డిగ్గర్ — (వాటిని అందుకొని) నాకే ఇప్పుడు జోళ్ళజత కావలసిఉంది. (తన పరుపుకాళ్ళవైపు తలగడకింద దాస్తాడు.)

టామీ — నేను బెల్టు ఇస్తాను. ఎలాగుంటుంది ?

యాంక్ — (మార్గరెట్‌వైపు కనుబొమలు ముడివేసి) బెల్టు తనకి చాలా పనికి వస్తుంది. (మార్గరెట్ చేతిలోంచి బెల్టు తీసుకుని టామీ కిస్తాడు.)

మార్గరెట్ — (యాంక్ మాటలు లక్ష్య పెట్టకుండా) కివీ ! నువ్వేమిస్తావు ?

కివీ — నువ్వే దివ్వమంటే అది ఇస్తాను.

మార్గరెట్ — స్పాట్స్, స్టాకింగ్స్, సపోర్టర్స్ ఇస్తావా ?

కివి — సరే, ఇవి నేనిస్తాను.

యాంక్ — నేను జాకెట్ కిట్టూ ఇస్తాను. మీకెవ్వరికీ అభ్యంతరం లేదుకదా ? మీ అందరికంటె నేనే అతణ్ణి అసహ్యించుకుంటాను.

మార్గరెట్ — (చిరునవ్వులో) ఇదంతా చాలా బాగుంది. నేనూ అదే అనుకొన్నాను. (కిట్టు ఎత్తి అందరికీ చూపిస్తుంది.)

కివీ — (ఈల వేస్తాడు) అబ్బా ! ఎంత అందంగా ఉంది !

డిగ్గర్ — అద్భుతం !

టామీ — గొప్పగా ఉంది.

యాంక్ — ఒక మోస్తరుగా పరవాలేదు. కాని అతనికి సరిపోతుందా ?

మార్గరెట్ — సైజు అదీ అంతా సరిగ్గానే ఉంది. అవన్నీ చూపించే తెప్పించాను. (యాంకుకి అందిస్తుంది. యాంక్ జాకెట్టుతో సహా దానిని తనబ్లాంకెట్టుకింద ఉంచుతాడు.)

కివీ — (కిటికీదగ్గిర నిలబడి బైటికి చూస్తున్న బ్లాసమ్‌ను చూచి) బ్లాసమ్ ! సంగతేమిటి ? ఇందులో అతణ్ణి చేర్చుకొందామా ?

యాంక్ — తప్పకుండా అతనిచేత టోపీఇప్పిద్దాం. డబ్బు మనం పెట్టుకొందాం.

కివి — ఇది బాగుంది.

టామీ — రైటో !

మార్గరెట్ — (పెట్టిలోంచి టోపీతీసి బ్లాసమ్‌దగ్గిరికి వెళ్ళి టోపీ చూపిస్తుంది) ఇదిగో బ్లాసమ్ ! (పెట్టెవైపు తిరుగుతుంది. బ్లాసమ్ ఆనందంతో టోపీ ఉల్లాగా తొడుగుతాడు. రిబ్బన్లు అతనికళ్ళపైనించి వేలాడుతుంటాయి.)

టామీ — చచ్చామురా, బాబూ ! వీడికిది నచ్చింది. వీడిదగ్గిర్నుంచి తీసుకోడం కష్టమే.

డిగ్గర్ — దేవుడా ! ఇప్పుడు లాచీ వచ్చేస్తేనో ? (తలుపువద్దకు పరిగెత్తి, లాచీ వస్తున్నాడేమోనని తలుపుతీసి చూస్తాడు. మార్గరెట్ బసుటోవద్దకు వెళ్ళి టోపీ తీసుకోడానికి ప్రయత్నిస్తుంది. ఒక్క నిముషంపాటు పెనగులాట జరుగుతుంది. చివరికి టోపీతీసుకుంటుంది. బ్లాసమ్ ఏమీతోచనట్టూ పరాభవం జరిగినట్టూ చూస్తాడు.)

మార్గరెట్ — కాదు. అతనికి (లాచీ మంచంవద్దకువెళ్లి వేలుతోచూపిస్తుంది) అతనికి బహుమానం. (అతనికి ఇవ్వాలని సంజ్ఞతో చూపి కివీ వైపు తిరుగుతుంది.) వీడిలా దద్దమ్మ నౌతున్నాను నేను. (టోపీ అక్కడుంచి బసుటోను కూచోమని సంజ్ఞచేస్తుంది. బ్లాసమ్ అర్థమైనట్టు తలఊపి చిరునవ్వు నవ్వుతాడు.) లాచీకి బహుమాన మిచ్చేవరకూ దాన్ని నేను దాచిపెడ్తాను. (పెట్టె వద్దకు వెళ్లి ఒకసంచి తెస్తుంది.) ఇది నాబహుమానం.

కివీ — హోగిన్ కాదుకదా అది ?

మార్గరెట్ — ఇది స్పొరాన్.

టామీ — (ఔదార్యంతో) చిల్లరడబ్బు లందులో ఉంచుకుంటాడు.

యాంక్ — (ద్వేషభావంతో కాకుండా) గాలాలతో కలిపి.

మార్గరెట్ — (పెట్టెలోచూచి) చివరకు మిగిలిపోయిం దిదే.

యాంక్ — అంతా పూర్తిఅయిందా ? ఏదైనా ముఖ్యమైంది మరచిపోయావా ?

మార్గరెట్ — (వేళ్ళపై లెక్కపెట్టి) ఏమీ మరచిపోలేదు.

యాంక్ — కిల్టుకింద ఏవో ఒకవిధమైన ప్యాన్సీ ప్యాంటు తొడగరూ ?

టామీ — నీకు తెలియదా ? (యాంకును సంజ్ఞచేసి పిలుస్తాడు. యాంక్ అతని వైపు వంగుతాడు. ఇద్దరూ గుసగుసలాడుకొంటారు, యాంక్ ఆశ్చర్యంతో కూచుండిపోతాడు.)

యాంక్ — ఏమీ లేదా ?

టామీ — (గుత్తంగా కూచొని) ఏమీ లేదు.

డిగ్గర్ — ఎక్కడో పొరపాటు జరిగిందనుకొంటాను.

మార్గరెట్ — (పెట్టిలో మరోసారి చూచి) పెట్టిలో మరేం లేదు తొడిగేందుకు.

కివీ — వాళ్ళు పొరపాటున విడిచిపెట్టేయవచ్చు కూడాను.

యాంక్ — (తానుకూడా పెట్టిలో చూచి) అంతపొరపాటు చేయటం మర్యాద కాదు.

టామీ — ఇది మితమర్యాదకాదు, అమితమర్యాద.

డిగ్గర్ — ఏదో విఘమైన ప్యాంట్లు తొడుగుతా రనటంమాత్రం నిశ్చయం.

కివీ — (పరుపుమీద మోకాళ్ళతో నిలబడి ఉత్సాహంతో) పందెంవేయండి. రెండు పౌండ్లు పందెం. మీరు పొరపడుతున్నా రంటాను.

యాంక్ — నేను రెండుపౌండ్ల పందెంవేస్తాను. నువ్వు తప్పంటాను.

కివీ — పందెం! ఎన్నాళ్ళకు గెలిచాను, దేవుడా ! పందెం! (మహానందంతో పక్కపై కూలబడతాడు.)

డిగ్గర్ — యాంక్ చెప్పిందే నిజం. రెండుపౌండ్లపందెం.

టామీ — (వెంటనే) నువ్వూ, యాంకూ ఇద్దరూ తప్పని నేను పందెం వేస్తాను.

డిగ్గర్ — పందెం ఒప్పుకున్నాను.

కివీ — పందెం వేస్తావా, సిస్టర్ !

మార్గరెట్ — (ఆఫీసర్‌గా ప్రవర్తిస్తూ) నేను వేయను. ఇదంతా కుర్రతరహాగా ఉంది. మోటుగాను ఉంది.

కివీ — ఇది సామాన్యపరిజ్ఞానంకోసం సిస్టర్ !

మార్గరెట్ — నేను వేయను.

టామీ — (డిగ్గరుతో) ఇలాగే తొడుక్కుంటే వాడు దిగంబరిగా ఉంటాడు.

(మార్గరెట్ పెట్టె దాచేస్తుంది. స్ప్రాన్, టోపియారిక్ వల గుడకింద దాస్తుంది.)

మార్గరెట్ — ఇంక వేళాకోలం మానేయండి. మీబహుమతు లన్నీ దాచిపెట్టండి. అతను రాగానే అతని కిద్దాం. (టామీ తనతలగడకింద బెల్టు దాస్తాడు. కివీ

స్వాఖ్యు, స్టాకింగ్సు సపోర్టర్స్ తనవైపు చేరవేస్తూ తలగడకింద దాస్తాడు
ఈలోగా మనం టిఫెన్‌కానిద్దాము. యాంక్, వంటింటిలో ట్రేఉంది.

యాంక్ — (లేచి కాళ్ళీడ్చుకుంటూ నడుస్తాడు చల్లారిన గొడ్డుమాంసం, రొట్టె, జెల్లీ. (బైటికి వెళ్తాడు.)

కివీ — (ఆశతో) ఎవరైనా దీనిమీద రెండురూపాయలు పందెంవేస్తారా ?

మార్గరెట్ — అంతకంటె మంచిటిఫిన్ చేయడం సాధ్యంకా దిక్కడ.

టామీ — నేను లేచి అతనికి జెట్టు ఇచ్చేదా, సిస్టర్ ?

మార్గరెట్ — అతనిమీద ఈవస్తువులన్నీ పారేయవద్దంటాను.

కివీ — అతను టిఫెన్‌తినడం పూర్తయ్యేవరకూ ఉందామా ?

మార్గరెట్ — కాదు. అతను రాగానే.

యాంక్ — (పెద్దట్రే పట్టుకువస్తాడు. దానిలో టిఫిన్‌ప్లేట్లుంటాయి. ప్రతిమంచం వద్దిరా ఒకప్లేటుంచి, తానూ ఒకటి తీసుకొని, తనమంచంవద్దకు వెళ్తాడు. అందరూ తమతమ మంచాలమీద కూచుని తింటూ ఉంటారు) సిస్టర్ ! నాకొక ఆలోచన తట్టింది. మన బహుమతులు అతను తీసుకోకపోతేనో ?

కివీ — తానెప్పుడూ బహుమానాలు తీసుకోలేదన్నాడు, జ్ఞాపక ముంచుకొంతి.

మార్గరెట్ — నిరాకరించడు. నిరాకరించలేడు. ఇది అతను పుట్టినదినం.

టామీ — చాలా జిత్తులమారి, అవునా ?

యాంక్ — సిస్టర్, వా డీబహుమానాలు మామీద విసిరికొట్టాడా, వాడి బ్యాగ్ పైప్‌తోనే కొట్టి చంపేస్తాను వాణ్ణి. ఇది నాప్రజ్ఞ అనుకో.

మార్గరెట్ — అతను నిరాకరించడు. అలా మనం అనుకోడమే అసంగతం. అయినా, ఒకసారి అతను నిరాకరించాడే అనుకొందాం. నిరాకరించడానికి అతనికి హక్కుంది.

యాంక్ — సరే, గట్టిగా నమ్మకంలేదుకదూ, సిస్టర్ !

డిగ్గర్ — (తలుపు అవతలచూసి) జాగర్త ! వస్తున్నాడు. (గబగబ తినడం మొదలెడతాడు,)

టామీ — (తలుపువైపు చూస్తూ) నేను బకింగ్‌హామ్ ప్రాసాదంలో పద్రంపని చేస్తూఉండేవాణ్ణి. (రహస్యంగా) అది నేను రాయల్‌ఇంజినీర్సులో ఉన్న కాలంలో. (లాచీ ప్రవేశించి మాట్లాకుండా తిన్నగా తనమంచం దగ్గిరికి వెళతాడు. తనప్లేటు చూచి ఎత్తుకుంటాడు. తనఫోర్కు తెచ్చుకొని తినడ మారంభిస్తాడు, తనపక్కమీద కూచొని. టామీ తనకథ సాగిస్తాడు.) వర్షం

పడుతూ ఉంది. ఇంతలో రాజుగారు నావద్దకు వచ్చారు. నన్నుచూచి 'నీహ్యాటేదోయి అబ్బాయి!' అని అడిగారు. 'మాకుహ్యాయిఇవ్వరు, మహాప్రభూ!' అన్నాను. 'నీకళ్ళమీద వర్షం పడుతోంది. ఇదిగో నాకిరీటం తీసుకో' అన్నారు. (విరగబడి నవ్వుతాడు. తిండి బొక్కేస్తుంటాడు. లాచీ వాళ్ళమాటలు వినడు. వాళ్ళు ఉన్నట్టుగా లెక్కచేయడు.)

డిగ్గర్ — (భుజాలు ఎగరేసి టామీతో) తనకంటె రెండేళ్ళు పెద్దయిన అత్తగారు కలవాడు ఇంతకంటె బాగా ప్రవర్తిస్తాడా ?

(మార్గరెట్ డిగ్గరుకు సంజ్ఞ చేస్తుంది. అతను వెనక్కు తిరిగి ఆమెవంక చూస్తాడు. మొదట బహుమానం అతణ్ణి ఇమ్మంటుంది. తన సేల్లు కిందనుంచి అతను బ్రోగ్స్ బైటకు తీస్తాడు. లాచీ మంచం దగ్గిరికి వెళ్ళి షోకేస్ కింద పెడతాడు.)

డిగ్గర్ — (స్నేహభావంతో, పశుచుతనం తొందరతో) లాచీ, నీపుట్టినరోజని విన్నాము. నువ్వీ జోళ్ళజత ఉపయోగించుకుంటావని ఆలోచించాను. అభినందనాలు (ఒక్కక్షణం ఆగుతాడు. లాచీ తనగరిటెనగంపవరకు ఎత్తి ఆగిపోతాడు. తర్వాత ఇటూ అయీ చూడకుండా తింటూ ఉంటాడు. ఒక్క మాటా పల్కడు. తనప్లేటువైపు తప్ప ఎటూచూడడు. డిగ్గర్ సంకోచిస్తాడు. లాచీ మాట్లాడకపోవడం చూచి తనపరుపుదగ్గిరికి వచ్చేస్తాడు. లాచీ కొంచెం తలవంచి తనకడకంటితో జోళ్ళు చూస్తాడు. తిండి మెల్లగా నములుతూ ఉంటాడు, మార్గరెట్ టామీకి సంజ్ఞచేస్తుంది. అతను శ్రమపడి పరుపు మీదినించి లేచి లాచీవద్దకు వెళతాడు. లాచీపరుపుపక్కని జోళ్ళదగ్గిర బెల్టు పెడ్తాడు.

టామీ — (సంతోషంప్రకటిస్తూ) ఇది స్కాట్లండులో చేసింది. శుభకాంక్షలు.

(లాచీపైకి చూడకుండా మెల్లగా తింటూ ఉంటాడు. ఏమీ అనడు. టామీ ఒక్కక్షణం తటపటాయిస్తాడు. తర్వాత తనమంచం దగ్గిరికి వచ్చేస్తాడు. మార్గరెట్ కివీకి సంజ్ఞ చేస్తుంది.)

కివీ — (తన బహుమానాలు పట్టుకుని గొంతుసవరించుకొంటాడు.) స్టాకింగ్సు లేకుండా నువ్వు జోళ్ళు తొడగవు. కార్న్సవస్తాయి. సపోర్టర్లు లేకుండా స్టాకింగ్సుతొడగలేవు. మెడకాయ విరుగుతుంది. సర్వం శుభం! (కివీ తన పరుపుమీదినించి వంగి లాచీ పరుపుమీద తనబహుమానాలు ఉంచుతాడు.

ప్రత్యుత్తరంకోసం నిరీక్షించకు. మార్గరెట్ బోపే బసుటో కిస్తుంటే. లాచి పక్కనుపెట్టి రమ్మని సంజ్ఞచేస్తుంది. ఆఫ్రికన్ తలఊపి, ఆమె చెప్పినట్లు చేస్తాడు. అతను లాచీపరుపువద్దకు వెళ్ళి బహుమానాల గుట్టమీద మెల్లగా బోపే ఉంచి లాచీ మొహం ఒకసారి చుట్టూ చూడబోతాడు. మార్గరెట్ అతణ్ణింక పొమ్మని సంజ్ఞచేస్తుంది. బసుటో గిర్రున తిరిగి తనమంచానికి వెళ్ళిపోతాడు. అతను కూర్చున్నతర్వాత మార్గరెట్ తనస్పారాన్ అందుకుంటుంది.)

మార్గరెట్ — (లాచీ వెనక నిలబడుతుంది) నీకోసం హాగిస్ తయారుచేయలేక పోయాం, లాక్లెన్ (తక్కిన బహుమానాల పక్కనే స్పొరాన్ పెడుతుంది.) మంచిబహుమానాలే పోగుచేశావు ! (వెంటనే అక్కడినించి కదిలిపోతుంది. యాంకుకు సంజ్ఞచేస్తుంది, అతనిబహుమానం ఇమ్మని. లాచి ఇంకా నోరు మెదపకుండానే ఉన్నాడు. యాంక్ లేచి తనజాకెట్టూ కిల్టూ తీసుకువెళ్తాడు. అందరూ తినడం మానేసి కుతూహలంతో ముందుకు వంగుతారు.)

యాంక్ — (కెల్టు తనచేతిమీద ఉంచుకువెళ్ళి లాచీపక్కపైనున్న బహుమానాల మీద పెడతాడు.) లాచీ, నీకంతా శుభం కలుగుగాక !

(లాచీ నవ్వులతో ఆగిపోతాడు. కాని మాట్లాడడు. పైకి చూడనూ చూడడు. యాంక్ తన పొగాకు గొట్టం బయటకు తీస్తాడు. మార్గరెట్ బొటన వేళ్ళమీద నడుస్తూ పోయి టామీ చెవిలో ఏదో చెపుతుంది. టామీ తల ఊపుతాడు. గొంతు సవరించుకుంటాడు. పాట ప్రారంభిస్తాడు.

టామీ — హాపీ బర్త్‌డే టు యూ
హాపీ బర్త్‌డే టు యూ

(మార్గరెటూ, తక్కిన వాళ్ళూ గొంతు కలుపుతారు. బ్లాసమ్ తన పక్కాలు వాయిస్తూ పరమానందం ప్రకటిస్తాడు.)

హాపీ బర్త్‌డే, డియర్ లాక్లెన్
హాపీ బర్త్‌డే టు యూ.

(పాట అయిపోయింది. మళ్ళీ అంతా నిశ్శబ్దం. అందరూ ఒకళ్ళ మొహం ఒకళ్ళు చూసుకుంటారు.)

యాంక్ — (పళ్ళుబిగించి) జెనెసిస్, ఎక్సోడస్, లెవెటికస్, నంబర్స్....

(మార్గరెట్ తొందరగా అతని దగ్గిరకి వెళ్ళి చాలు చాలు అంటున్నట్టుగా తన చెయ్యి అతని భుజంపై వేస్తుంది. యాంక్

ఆగుతాడు. లాచీలేచి అందరికీ అభిముఖుడై నిలబడతాడు. గొంతు సవరించుకొంటాడు.)

లాచీ — మీకందరికీ ఒకమాటచెపుతాను. (గుటకవేస్తాడు) మీరు చేస్తుంది నాకర్థం కాలేదు. నన్ను నేనూ అర్థం చేసుకోలేదు. మీరు చేసినపని నామెదడు స్తంభింపజేసింది. (కిల్టుమీద మెల్లగా తనచెయ్యిపెడతాడు.) నా జీవితంలో ఎవ్వడూ రెండణాల వస్తువిచ్చిన పాపాన పోలేదు. మీరు చెప్పకపోతే నా పుట్టినరోజని నాకూ తెలిసేదికాదు. కాని (వెనకాల చేతులు ముడుస్తాడు.) మీ కిల్టు తీసుకోడానికి నాకు హక్కుందా ? తీసుకున్నానంటే మీకు రుణపడి పోతాను. ఆరుణం నేను తీర్చుకోలేను. నేను తప్పుచేయదలచుకోలేదు. తొందరగుండెలో దుఃఖం కలుగుతుందంటారు పెద్దలు. నేను దుఃఖంతెచ్చి పెట్టుకో దలచుకోలేదు. అదీ నాసమస్య.

మార్గరెట్ — (థెర్మామీటర్‌తో లాచీవద్దకు వెళ్ళుతుంది.)లాచీ, ఒక్కనిమిషంఆగు.

లాచీ — (తొందరగా) నామనస్సులో ఉన్నది వివరిస్తాను—ఇప్పుడు, నాసమస్య....

మార్గరెట్ — నువ్వేమీ వివరించనక్కరలేదు. నీజీవితంలో ఒక్కసారి తొందర పడి పొరపాటుచేయడానికి సాహసించు.

లాచీ — (పూర్తిచేయడానికి ప్రయత్నిస్తూ) కాని నేను........

( అతడి నోట్లో మార్గరెట్ థెర్మామీటర్ పెడుతుంది. లాచీ నోరు మూసుకుంటాడు.)

మార్గరెట్ — నోరు మూసిఉంచి నీహృదయాన్ని మాట్లాడనీ, ఒకస్కాట్ తన్ను తాను 'ఫూల్' చేసుకుంటే గొప్ప 'ఫూల్' అవుతాడు. (నిలబడి ఉన్నవాడ్ని మెల్లగా తోసి కూచోబెడుతుంది.)

టామీ — (ఆత్రతతో) వాటిని తీసుకుంటాడా, సిస్టర్ ?

మార్గరెట్ —(వాళ్ళవంక తిరిగి) తప్పకుండా. అతని మనస్సులో మరోఆలోచన లేదు. (లాచీతో) గంభీరంగా మీకు కృతజ్ఞత ఎలా తెలపాలా అని ఆలో చిస్తున్నాడు. అంతేకాదూ, లాచీ ?

(లాచీ తలఊపుతాడు కృతజ్ఞతతో)

యాంక్ — తొడుక్కో.

కివీ — తొడుక్కో.

డిగ్గర్ — ఇవి తొడుక్కుంటే నువ్వెలాఉంటావో చూద్దాం, లాచీ !

టామీ — లోపల ఏమైనా తొడుగుతాడో లేదో చూడాలి.

యాంక్ — (లాచీవంక తిరిగి) మేమొకపందెం వేసుకొన్నాం. నీవల్లే పరిష్కారం కావాలది.

మార్గరెట్ — (నవ్వుతుంది.) ఓహో, మీరంతా వ్యాపారం చేస్తున్నారు.

యాంక్ — కిల్టుకింద ఏమైనా తొడుగుతావా తొడగవా ?

లాచీ — (నోట్లోంచి థర్మామీటరు తీసి) మిత్రులారా ! మీరడిగినందుకు చాలా క్షోభిస్తున్నాను. ఎందుకంటే మీకది నేను చెప్పలేను. ఈప్రశ్నకు జవాబు ఏస్కాటూ ఇవ్వలేడు.

యాంక్ — (నమ్మడానికి వీల్లేదన్నట్టు) ఐతే నువ్వూ మాకు చెప్పవన్నమాట !

లాచీ — మాజాతిమర్యాదకు భిన్నంగా ప్రవర్తించమంటావా ?

యాంక్ — పోనీ తొడుక్కో.

కివి — మరి తొడుక్కో.

డిగ్గర్ — (కేకలతో) కిల్టు తొడుక్కో-వోయ్ !

టామీ — తొడుక్కో.

లాచీ — (శాంతంగా) ఉచితమైన సమయం వచ్చేవరకూ తొడుక్కోదలచుకోలేదు.

యాంక్ — (ముందుకు వంగి) ఏమన్నావు ?

లాచీ — ఉచితమైనసమయం వచ్చినప్పుడు కిల్టు తొడుగుతాను. నా రెజిమెంటుకు తిరిగి వెళ్లిననాడు తొడుగుతాను. అంతకుముందు ఎంతమాత్రం తొడగను. (లేచి బహుమానాలన్నీ పక్కకు తోసేయడానికి వెళుతుంటాడు.)

యాంక్ — (నిస్సహాయంగా) సిస్టర్ ! నువ్వతనిచేత ఇది చేయించలేవు. అన్నీ తీసి పారేస్తున్నాడు.

లాచీ — (అనుమానదృష్టులతో చూస్తూ) నాసంతోషంకోసం కిల్టుఇచ్చారా, ఏవైనా షరతులు పెట్టి ఇచ్చారా ?

మార్గరెట్ — (వెంటనే) లాచీ ! ఇది నీపుట్టినరోజు. నీ ఇష్టంవచ్చినట్టు చెయ్యి.

లాచీ — కొన్నాళ్ళాగుతాను (మార్గరెట్ అందిస్తూ ఉంటే తనవస్తువులు పెట్టెలో ప్యాక్‌చేసుకుంటాడు.) ఇన్నిబహుమతులకు మీకు కృతజ్ఞుణ్ణి. ఈవేళని నేనెప్పుడూ మరవను.

యాంక్ — (అతను ప్యాక్‌చేస్తూ ఉండడంచూచి) ప....ప....పార్టీ అయి పోయిందా ?

లాచీ — (నిష్కల్మషంగా) ఇంకా ఏమైనా చెయ్యవలసిఉందా ?

యాంక్ — ఏమీలేదు. (నిష్ఠురంగా) అంతే అనుకుంటాను. (పిడికిలిమీద గడ్డం ఆనించి నిలబడి నిట్టూరుస్తాడు.) ఇది స్వచ్ఛమైన స్కాటిష్ జన్మదినోత్సవం. (పరుపుమీద కూచుంటాడు. లాచీ తనపెట్టె మంచంకింద ఉంచుతాడు. కూచుని మళ్ళా భోజనం ప్రారంభిస్తాడు.)

మార్గరెట్ — (మెత్తగా) నేను వెళ్ళిపోయేముందు నీకు చేయగలిగేది ఏమైనా ఉందా ?

లాచీ — ఏమీ లేదు.

మార్గరెట్ — సరే. (తన ఆఫీసులోకి చిరునవ్వు నవ్వుతూ వెళుతుంది. కొన్ని నిమిషాలనిశ్శబ్దతర్వాత కివీ లేచి తనస్నేహితులతో మాట్లాడ్డానికి వెళతాడు. వెళ్ళి యాంక్మంచంమీద కూచుంటాడు. అందరూ నిస్పృహులై కూచుంటారు. ఏదో గంభీరంగా ఆలోచిస్తుంటారు. లాచీ వాళ్ళందరివైపూ చూస్తాడు. అలా చూచి లేస్తాడు. మొదట బసుటోదగ్గిరికి వెళ్తాడు. అతనిభుజంమీదుగా కిటికీగుండా చూస్తాడు. తరవాత తలుపుదగ్గిరికి వచ్చి, తలుపుతీసి గాలి వాసనచూస్తాడు. మళ్ళీ కిటికీదగ్గిరికి వచ్చి నిశ్చలంగా, గంభీరంగా కిటికీ బైటికి చూస్తాడు.)

లాచీ — (డిగ్గర్వైపు తిరిగి ఆత్రుతతో) అమ్రిచెట్టుమీద చాలా వింతపక్షి ఉంది. (వేలితో చూపిస్తాడు. డిగ్గర్ లేచి అతని భుజంమీదుగా బైటికి నిర్లక్ష్యంగా చూస్తాడు.)

(లాచీ మరోసారి బైటికి చూస్తాడు. ఒక్క నిమిషం సందేహంతో ఆగి ఒక సిగరెట్టు పెట్టె తీస్తాడు.)

డిగ్గర్ — అవును. కాకి.

లాచీ — సిగరెట్ ?

డిగ్గర్ — (చాలాఆశ్చర్యంతో) థాంక్స్ ! ఒకటితీసుకొంటాడు. లాచీ తిరిగి టామీకి కూడా సిగరెట్టిస్తాడు.)

టామీ — (నిర్ఘాంతపోయి) థాంక్స్ !

(లాచీ యాంక్ పరుపువద్దకు వెళ్తాడు. దానిపై కివీ కూచొని ఉంటాడు. లాచీ సిగరెట్టుపెట్టె కివీకిస్తాడు.)

కివీ — (అతని ప్రవర్తనకు సంతోషిస్తూ) థాంక్స్ !

లాచీ — (యాంక్వంక తిరుగుతాడు. యాంక్వీపు అతనికేసి ఉంటుంది. గొంతు సవరించుకుంటాడు.) సిగరెట్ తీసుకుంటావా ? (విరామం. అతనిమాటలు

హృదయాల్లో దిగుతాయి. యాంక్ తలెత్తి చూస్తాడు. మాట్లాడకుండా ఒక సిగరెట్ తీసుకుంటాడు. అగ్గిపుల్ల వెలిగించబోతాడు. లాచీ పుల్లవెలిగించి అతనిసిగరెట్టు అంటిస్తాడు. యాంక్ ఆశ్చర్యంతో మాటాడకుండా స్వీకరిస్తాడు. లాచీ తానూ ఓక సిగరెట్టు తీసి కాలుస్తాడు. కొంచెంసేపతటిర్వాత యాంక్ మంచంచివర చూపించి) కూచోవచ్చా ?

(యాంక్ తల ఊపుతాడు. లాచీ కూచుంటాడు. అందరూ నిశ్శబ్దంగా సిగరెట్లు కాలుస్తారు. లాచీ అందరికేసీ కనుకంటితో చూస్తాడు. యాంక్ తనలో తాను చిరునవ్వు నవ్వుకుంటాడు; లేచి నిలబడతాడు. అతని భుజం లాచీ భుజానికి తగుల్తుంది. ఇద్దరూ ఒకేసారి చేతులెత్తి సిగరెట్లు పీలుస్తారు. యాంక్ పళ్ళికిలిస్తాడు. లాచీ కంత్ర్ప్టప్రకటిస్తాడు. ఒకరిపైపు ఒకరికి తగుల్తూ ఉంటుంది)

తెరపడుతుంది.

---

## రెండో అంకం

## రెండో రంగం

అది సాయంకాలం. మొగటిరంగం అయిన కొన్ని రాత్రుల తర్వాత. అస్తమిస్తున్న సూర్యుని కాంతి కుడిచేతి వైపు కిటికీలోంచి వస్తూ ఉంటుంది. తక్కిన కిటికీలన్నీ మూసేసి ఉన్నాయి.

డిగ్గర్ స్నానాలగదిలో ఉన్నాడు. టామీ డిగ్గర్ దోమ తెరా, తన దోమతెరా దించుతున్నాడు. అతడు పాజామాలు తొడుక్కొని ఉన్నాడు.

బ్లాసమ్ నీలి దుస్తుల్లో ఉన్నాడు. తన దోమతెరా, కివీ దోమ తెరా దించి, కింది అంచులు పరుపుకిందికి దోపుతున్నాడు.

యాంక్ ఒకతువాలు మెడకు చుట్టుకొని, పళ్ళబ్రష్ ఒకటి జేబులో పెట్టుకొని, తన దోమతెర దించుకుంటున్నాడు. లాచీ మంచానికి ఉపన్యాసం ఇస్తున్నాడు. కివీ ఎన్నోసార్లు లేవాలని ప్రయత్నించి లాచీ ఉపన్యాస ధోరణికి మూళ్ళకుంచొంటున్నాడు.

లాచీ — (సహృద్భావంతో, ఆవేశంతో, శక్తివంతమైన గొంతుతో) కివీ ! నీకు జ్ఞాపకముండే ఉంటుంది. ఒకసామాన్యసభ్యుడు పార్లమెంటును ముసలివాళ్ళ పెన్షనులో మూడుపెన్నీలు హెచ్చించమని అడిగితే ఏమైంది ? కిరీటంలో ఉన్నరత్నాలు తీసిపారేయమని అసభ్య డడుగుతున్నా డనుకుంది ప్రభుత్వం. (కివీ లేవడానికి ప్రయత్నిస్తాడు. లాచీ అతణ్ణి బలవంతంగా కూచోబెడ్తాడు) జ్ఞాపకముంచుకో, ఒక్క-మూడణాలు. మనలార్డులు ఎగిరినిలబడతారు. (తన చేతులతో చేసిచూపిస్తాడు. కివీ ఈఅవకాశం చూచుకొని లేచి నిలబడతాడు.)

కివీ — (బాధతో గొణుగుతూ) ఇదంతా బాగానేఉంది, లాచీ ! అయితే ఈకథ రేపు పూర్తిచేద్దాం. (లాచీవైపు వీపుతిప్పి వెళ్తుంటాడు. లాచీ పట్టుదలతో అతనివెనకాలే వెళతాడు.)

లాచీ — (చెయ్యిచాచి) "సామ్రాజ్యాన్ని దివాలాతీయిస్తావా ?" అని కేకలు వేస్తారు వాళ్ళు, (కివీ స్నానాలగదివైపు వెళ్తాడు. లాచీ వెంటబడతాడు.) "ఎక్కడినించి వస్తుంది ?" అని అరుస్తాడు మరొకడు.

కివీ — (యాంక్‌వైపు చూపిస్తూ) యాంకుతో ఎందుకు చెప్పవు ? అతనికి నాకంటె ఎక్కువ ప్రవేశంఉంది రాజకీయాల్లో.

(లాచీ యాంక్ వైపు తిరుగుతాడు. కివీ స్నానాలగదిలోకి వెళ్ళి పోతాడు.)

లాచీ — (యాంక్‌వద్దకి వెళ్ళి) విన్నావా? మూడుపెన్నీలు. పేదవాళ్ళసహాయానికి. "చిక్కుడుగింజలోంచి రక్తంపిండలేవు" అంటాడు ప్రధానమంత్రి.

యాంక్ — (సౌహార్దంతో) ఇదిగోచూడు. వారంరోజుల్నుంచి ఒకేవరసగా వాగుతున్నావు. బాగ్‌పైప్ వాయించరాదూ ? (లాచీ భుజంపై చెయ్యివేసి తట్టి తన దోమతెర పరుపుకింద దోపడానికి వెళతాడు.)

లాచీ — (నిరుత్సాహపడకుండా) ఒకమనిషినించి రక్తంపిండాలంటే ఇట్టే డబ్బు తీస్తారు. యుద్ధం చెయ్యాలన్నా అంతే.

యాంక్ — (స్నానాలగదిదాటి వెళతాడు) నేను పళ్ళుతోముకొనేవరకు పార్లమెంటు అర్జర్న్ చేద్దూ.

లాచీ — (అతణ్ణి వెంటాడుతూ) "పేదవాళ్ళంటే మాకు చాలా విచారంగా ఉంది" అంటుంది పార్లమెంటు "కాని ప్రభుత్వం పేదది." సరే, యుద్ధం జరపడానికి హిస్‌మెజెస్టీస్ గవర్నమెంటు ఎంతఖర్చుపెడుతుందో తెలుసా నీకు ?

టామీ — భయంకరమైన మొత్తమై ఉంటుంది.

(లాచీ టామీకి జవాబు చెప్పడం కోసం అటు తిరుగుతాడు. తువాలు పట్టుకొని యాంక్ స్నానాల గదిలోకి పారిపోతాడు.)

లాచీ — పదిలక్షలపౌండ్లుపైన. పదిలక్షలపౌండ్లు. (వెనక్కితిరిగి చూచి యాంక్ వెళ్ళిపోయినట్లు గ్రహిస్తాడు. అటు శ్రోతలులేరని టామీమీదికి వచ్చిపడతాడు.) మరి....ఈడబ్బంతా తెచ్చే మంత్రగాళ్ళెవరు? (టామీవైపు వేలితో చూపిస్తూ) అర్థశాస్త్రజ్ఞులు.

టామీ — ఎవరూ?

లాచీ — అర్థశాస్త్రజ్ఞులు.

టామీ — వాళ్ళు మనపక్షం వాళ్ళేనా?

లాచీ — (తలఊపి) వాళ్ళ కీడబ్బు ఎక్కడినించి వస్తుంది? వాళ్ళు చేసేది మరేమీలేదు. నోట్లు అచ్చువేసేస్తారు. అంతే.

టామీ — (స్నానాలగదివైపు బయలుదేరతాడు.) అయితే మరికొన్నినోట్లు అచ్చేసి, నాజీతం ఎందుకు హెచ్చించరంటాను?

లాచీ — (అతణ్ణి వెంటాడుతూ) వాళ్ళెంతఎక్కువ అచ్చేస్తే దానివిలువ అంత తగ్గుతుంది. అందుకోసమే మీకు నేను సలహా ఇస్తున్నాను. నాఉదాహరణ అనుసరించండి. మీడబ్బు భూములమీద పెట్టండి. మీరు భూములు అచ్చెయ్యలేరు.

టామీ — నాడబ్బు నేను కడుపులో దాచిపెడతాను. (కిలకిలా నవ్వుతాడు. స్నానాల గదిలోకి వెళ్ళిపోతాడు. లాచీ ఒక్కడే అయిపోతాడు. 'తనపరువుకేసి వెళ్ళి, కిటీపక్క వేస్తున్న బ్లాసమ్‌ను చూస్తాడు. అతడ్ని ఉద్దేశించి అరంభిస్తాడు. బ్లాసమ్ కంగారుపడి వింటుంటాడు.)

లాచీ — (తనవేలుతో బ్లాసమ్ విశాలవక్షం పొడుస్తూ) ఒక్కొక్కసోల్జరుకు తగు శిక్షణ ఇచ్చి యుద్ధరంగంలోకి తీసుకురావాలంటే ఎంతఖర్చౌతుందో తెలుసా? మనిషికి పదివేల పౌండ్లౌతుంది. రెండుపక్షాల పోరాడుతున్నమనుష్యులకు అందులో సగం ఇస్తే రెండునిమిషాల్లో యుద్ధం ఆగిపోతుంది: 'జాతీయ ఋణాలు' సగం పోతాయి.

బ్లాసమ్ — (తనతో మాట్లాడినందుకు సంతోషించి) బ్లాసమ్!

(మార్గరెట్ ప్రవేశించి ఉపన్యాసధోరణి వింటూ ఒకక్షణం నిలబడుతుంది.)

లాచీ — (ఉత్సాహంగా) వ్యక్తులముందు ఎంతచెడ్డ ఉదాహరణ పెడుతుంది ప్రభుత్వం ?

మార్గరెట్ — ఇంతకీ నువ్వేమి చేస్తున్నట్టు ?

లాచీ — (వెనక్కి తిరిగి ఆమెను చూస్తాడు.) నా అనుభవం చెపుతున్నాను నాస్నేహితులకి. (తనమంచంవాటి వెళ్ళి కాళ్ళకేసి కూచుంటాడు. బ్లాసమ్ తన పాజామాలు పట్టుకొని స్నానాలగదిలోకి వెళతాడు. మార్గరెట్, లాచీ — ఇద్దరే ఉండిపోతారు.)

మార్గరెట్ — రేపటికోసం కొంతప్రసంగం దాచిపెట్టు. మరి పదినిమిషాల్లో దీపాలు ఆరిపోతాయి. (అతనిదోమతెర దించుతుంది) ఈవేళ ఎలాఉంది లాచీ ?

లాచీ — నువ్వలా అడగడం వింతగా ఉంది.

మార్గరెట్ — అలా అడగడం నాధర్మం.

లాచీ — నామనస్సు గ్రహించావేమో అనుకొన్నాను. నాకేదో ఒకవింత అలసట ఉంది. నాచేతులకు చెమటపడుతుంది. కాళ్ళు కొద్దిగా వాచాయి.

మార్గరెట్ — వార్డులో చాలాఎక్కువగా తిరుగుతున్నావు. చాలా ఎక్కువగా మాట్లాడుతున్నావు కూడాను.

లాచీ — మనిషన్నవాడు కొంతనడవనూ నడవాలి; కొంత మాట్లాడనూ మాట్లాడాలి. అతనేం చెట్టాచేమా ?

మార్గరెట్ — కాని నువ్వు అలసిపోతే నిద్రపోలేవు. రాత్రి నేను వార్డులో వచ్చినప్పుడు నువ్వు పక్కమీద దొర్లుతున్నావు. మూలుగుతున్నావు.

లాచీ — (కోపంతో) నేను మూలగలేదు.

మార్గరెట్ — (చిరునవ్వుతో) మొత్తానికి బాగా నిద్రపోలేదు.

లాచీ — నాకొక సమస్యవచ్చిపడింది. అంచేత నామెదడు నన్ను శాంతంగా పడుకోనిచ్చింది కాదు.

మార్గరెట్ — (మృదువుగా) దేనికోసమైనా తపిస్తున్నావా లాచీ ?

లాచీ — అవును.

మార్గరెట్ — నేనేమైనా సహాయంచెయ్యగలన్నా ?

లాచీ — నాలాంటి మనిషి తప్పుచేశానని ఒప్పుకోడం చాలా కష్టమనుకో, సిస్టర్ ! నన్ను గురించి నువ్వేమనుకుంటున్నావో నే నలాంటి మనిషినికాను.

మార్గరెట్ — నే నేమనుకొంటున్నానో నీకు తెలుసు ననుకొంటావా ?

లాచీ — నేను వివేకిననీ, చతురుణ్ణనీ బహుశా అనుకొంటున్నా వేమో ! నాసమస్య

లన్నిటికి ఉచితమైన విలువ ఇస్తాననీ, నన్ను ఏదీ చలింపజేయ జాలదని బహుశా అనుకొంటున్నావు.

మార్గరెట్ — (సహృదయమైన వినోదంతో) అదా నే ననుకొంటుంది ?

లాచీ — అవును. (తన ఆత్మను లోతుగ విచారిస్తూ) సిస్టర్ ! నేను మానవ జాతిఅంటే ఎప్పుడూ ఇష్టపడలేదు. నాకు ఏమనిషన్నా గౌరవం లేదు. ప్రేమా లేదు. మనుష్యుల మంచితనంలో నాకు నమ్మకంలేదు. యుద్ధం వచ్చినా నాలో ఈభావాలు పోలేదు.

మార్గరెట్ — స్కాట్లండులో నీకు చాలామంది స్నేహితు లున్నారన్నావు ?

లాచీ — (పెడమొహం పెడతాడు.) అబద్ధం చెప్పాను. నాకు స్నేహితు లెలా ఉంటారు ? నాకు చదువులేదు. చాలా పెద్దవాణ్ణి కావడంచేత దూబరాగా ఖర్చుపెట్టడానికి నాదగ్గిర డబ్బులేదు. ఇవ్వడానికి ఏమీ లేకపోయె. ఆకర్షించ డానికీ ఏమీ లేకపోయె. ఇవేమీ లేకండా మనిషి ఎలా మాట్లాడగలడు ?

మార్గరెట్ — ఎందుకు మాట్లాడలేడు?

లాచీ — మనికి స్వాభిమానం, గర్వం అన్నీ ఉంటాయి.

మార్గరెట్ — (సహాయపడుతూ) వినయం గొప్పగుణం.

లాచీ — కాలబలమైన గుణంకాదు. వెనక నాజీవితం నేనంటే ఎవ్వరూ ఇష్టపడే వాళ్ళు కారు. నేనూ ఎవరన్నా ఇష్టపడేవాణ్ణి కాదు. కాని ఇప్పుడు మారాను.

మార్గరెట్ — నువ్వు మారడానికి ఒక యుద్ధం కావలసి వచ్చిందంటే నారు విచా రంగాఉంది. (స్టేజివెనకాలనించి టామీ కిలకిలా నవ్వుతున్న ధ్వని వస్తుంది. డిగ్గర్ 'దాన్ని ఆరబెట్టు' అంటున్నాడు. లాచీ లేచి స్నానాలగదివైపు వెళ తాడు.)

లాచీ — నీవద్ద ఏప్రతిఫలమూ ఆశించకుండా ఒకవ్యక్తి నీస్నేహితు డౌతాడని నేనెప్పుడూ అనుకోలేదు. ఇరవైఒక్కసంవత్సరాలు ఇదేభావంలో పోయాయి. ఇప్పుడు ఏదో నావంతుకు వచ్చిన శ్రమ పడతాను.

మార్గరెట్ — (చలించి, సహాయపడ్డానికి ప్రయత్నిస్తూ) లాచీ, నువ్వు కొత్త విలువలే కనిపెట్టిఉంటే, పరిగెత్తుకు పోయి వాటిధర ఇచ్చేయాలనుకోకు.

లాచీ — కాని అది పశ్చాత్తాపంలాంటిది, సిస్టర్ ! అది నాలో ఎలా వృద్ధి పొందుతుందో నీకు తెలియదు. నాకు సహాయంకావాలి, సిస్టర్ !

మార్గరెట్ — సరే. (జంకుతుంది) నీకు చాలా వేళఉంది. లైట్లు ఆరిపోయాక తాగడానికి వెచ్చటి వస్తు వొకటితెస్తాను. నిన్ను నిద్రపుచ్చుతాను.

లాచీ — అదంతా నీకు శ్రమకాదు కదా !

మార్గరెట్ — ఏమీ శ్రమకాదు. నీకు మర్దనా చెయ్యమని యాంకుతో చెప్తాను. (స్నానాలగదిదగ్గిరికి వెళ్ళి పిలుస్తుంది) యాంక్ ! నేను కొన్నినిమిషాలు ఆలస్యంగా రావచ్చు, నువ్వు లాచీకి కొంచెం మర్దనా చేస్తావా ?

(తెర వెనకనించి) తప్పకుండా.

మార్గరెట్ — కిటికీవేయడం మరచిపోకేం ! (వార్డులోంచి బైటికి పోవడానికి దాటుతుంది.) నీలిదుస్తులు తీసేసి పడుకో, లాచీ ! రాత్రంతా మేలుకొని ఉండి ప్రపంచం మార్చేయడానికి ప్లాన్లు వేస్తూ ఉండడం నాకిష్టంలేదు. (బైటికివెళ్ళిపోతుంది. లాచీ తనమంచంమీద కూచుంటాడు. నీలిదుస్తులు తీసేస్తాడు. క్షణంలో టామీ ప్రవేశిస్తాడు.)

టామీ — మళ్లా ఈవేళకూడా పీడకలలు రావని ఆశిస్తాను. నిన్నరాత్రి నాకో వింతకల వచ్చింది. నాకడుపు బాగాపెద్దదైపోయిందట ! ఎంతపెద్దదంటే, దాన్ని తోపుడుబండిలో వేసుకువెళ్లవలసి వచ్చిందట !

లాచీ — టామీ, ఒక్కనిమిషం ఇలా వస్తావా ?

టామీ — ఎందుకురాను ? మంచంతప్ప మరోచోటికి వెళ్లడానికి వీలేలేదు మనకి.

లాచీ — యుద్ధం అయిపోయిన తరవాత నీకేదైనా నౌకరీ అక్కడుందా ?

టామీ — నానౌకిరీ మా ఆవిడేను. ఆమెతండ్రికి ఒక హోటలుంది.

లాచీ — ఛా ! బంధువులకోసం పనిచేయకూడ దనుకో. నీకు తెలుసుకదా, స్కాట్లండులో నాకు కొంత భూమి అదీ ఉంది. నువ్వు అలాంటి స్థలానికేదైనా వెళ్లి విశ్రాంతి తీసుకుంటావేమో అనుకున్నాను. అక్కడ కావలసినంత పొగాకు ఉంటుంది పీల్చడానికి. తినడానికి రొట్టే, నీఇష్టం వచ్చినట్టు కబుర్లు చెప్పుకోడానికి మంచికుర్చీ ఉంటాయి.

టామీ — నీ సుహృద్భావానికి కృతజ్ఞుణ్ణి లాచీ ! ఐతే మాఆవిణ్ణి విడిచిపెట్టి ఎప్పుడైనా వెళ్లిపోయానా—అది స్కాట్లండుకంటె చాలా దూరంగా వెళ్లిపోతాననుకో. (తన మంచంపక్క లాంతరు ఆర్పేస్తాడు.)

లాచీ — డూన్‌ఫుట్ అంటే ఇష్టమా ?

టామీ — నే నామెని గురించి నిర్దయగా మాట్లాడతాను. కాని నిజంగా ఆమె అంటే నాకు ప్రేమే. (దోమతెరలోకి దూరి తనమంచంమీదికి వెళ్లిపోతాడు.)

లాచీ — తొందరపడి పిలిచిన పిలుపు కా దది. కొంచెం ఆలోచించి నీమంచికోసమే ఆహ్వానించాను.

టామీ — నీదయకు చాలాకృతజ్ఞుణ్ణి. కాని నేను బ్లైటే వెళుతున్నాను. (యాంక్ ప్రవేశిస్తాడు. చివరికిటికీ మూసేస్తాడు. బైటి లాంతర్లవెలుగుతప్ప, పాకలో చీకటిగానే ఉంటుంది.) నువ్వెప్పుడైనా లండన్‌వచ్చావా, మాఇల్లు నీఇల్లు గానే భావించు. (బిగ్గరగా ఆవులిస్తాడు.) గుడ్ నైట్.

లాచీ — గుడ్ నైట్.

యాంక్ — (రబ్బింగు ఆల్కొహాల్ తెచ్చి) నిన్ను మరచిపోయా ననుకొన్నావా ?

లాచీ — లేదు.

యాంక్ — కాళ్లు చాచి పడుకో.

లాచీ — (పాజామా అంచు ఎత్తి బోర్లాపడుకుంటాడు) నేనింత ఎందుకు అలసి పోతున్నానో అర్థం కావడం లేదు.

యాంక్ — విశ్రమించు.

లాచీ — యాంక్ !

యాంక్ — ఏమిటి ? (వీపు తోమడ మారంభిస్తాడు.)

లాచీ — నువ్వెరుగుదువు కదా ! స్కాట్లండులో నా కొక మంచి ఇల్లుంది. యుద్ధం అయిపోయినతర్వాత నీకు వెళ్లడానికి నీకు అమెరికా తప్ప మరోచోటు లేకపోవడంచేత మాఇంటికి వచ్చి నీఇష్టం వచ్చినన్నాళ్లు ఉండరాదా అని ఆలోచిస్తున్నాను.

యాంక్ — థాంక్స్! కాని వెళ్లేవేళ వచ్చేటప్పటికి నేను తిన్నగా ఇంటికి వెళ్లి పోతాను.

లాచీ — కాని నీకక్కడేదైనా వృత్తి ఉన్నదా వెళ్లి అందులో ప్రవేశించడానికి?

యాంక్ — దాన్ని వృత్తే అనవచ్చు. నాపిల్ల నాకోసం ఎదురుచూస్తూ ఉంటుంది.

లాచీ — ఆమెని గాఢంగా ప్రేమిస్తావు.

యాంక్ — ఏమైతేనేమి? నాకో పిల్లఉంది. అద్భుతమైన చిత్రవర్ణాలతోగూడినపిల్ల.

లాచీ — (ఆగుతాడు) యాంక్, హాస్పిటల్ ఎప్పుడు విడిచిపెడతావు ?

యాంక్ — బహుశా రేపు కాగితాలమీద కర్నల్ సంతకం పెడతాడు. ఎల్లుండి వెళ్లిపోతాను. (ఆల్కొహాల్ కోసం యాంక్ కిందికి వంగుతాడు.)

లాచీ — ఎల్లుండి. ఇక నువ్వు వెళ్ళిపోయినతర్వాత నామీద నీకెందుకి స్నేహం ఉంటుంది ? బహుశా తర్వాత నీవార్తే నాకు తెలియదనుకొంటాను.

యాంక్ — నా పెళ్ళి అయిన తర్వాత నయాగరాజలపాతం బొమ్మ ఒకటి నీకు పంపిస్తాను.

లాచీ — స్కాట్లాండులోని నాఇంటి ఫోటో నీకు పంపిస్తాను.

యాంక్ — (లేచి తోముతూ) ఆకిల్టు తొడుక్కొని ఫోటోతీసుకొని పంపిద్దూ. నిన్ను, కిల్టుతొడగ్గా చూడాలని ఉంది.

లాచీ — రేపు మాతో నీచివరిరోజని నీకు నిశ్చయమేనా ?

యాంక్ — కర్నల్ మనస్సు మారితే తప్ప.

లాచీ — (సంకోచిస్తూ) నేను నారెజిమెంటుకు వెళ్ళిన మరునాడు దాన్ని తొడగా లనుకొన్నాను. కాని నువ్వు సమంజస మనుకుంటే....

యాంక్ — నీమనస్సు మార్చుకుంటా నంటావా ?

లాచీ — నువ్వు దానికి విలువే ఇస్తే నీకోసం కిల్టు తొడుగుతాను.

యాంక్ — అయితే, లాచీ ! నాకోసం రేపు తొడుగు. నేను నీ ఫోటో తీసు కొంటాను. ఇవ్వాళే రెండుఫిల్ములు వచ్చాయి, ఇంటినించి.

లాచీ — నే నింతవరకూ ఫోటో తీయించుకో లేదంటే నమ్ముతావా ?

యాంక్ — అయితే రేపు తీసుకుందాము.

లాచీ — సరే, నేను కిల్టు తొడుక్కుంటాను. కాని ఫిల్ముధరమాత్రం నన్నివ్వ నివ్వాలి.

యాంక్ — (సీసా ఎత్తుకొంటాడు. వీపు ఎండిపోతుంది.) డబ్బివ్వక్కరలేదు, మరో ఫిల్ము ఉందికదా !

లాచీ — (పట్టుదలతో) రెండుఫిల్ములు నాకమ్మితే తప్ప నేను ఫోటో తీయించుకోను. నాకు రెండు కావాలి. ఎందుకంటే మనవాళ్ళందరిఫోటోలూ తీసుకుంటాను.

యాంక్ — దానివల్ల నీకు స్వేచ్ఛగా ఉందనుకొంటే తప్పకుండా డబ్బు తీసు కుంటాను.

లాచీ — డబ్బు ఉదయం ఇస్తాను.

యాంక్ — (పళ్ళుబిగించి) నిన్ను నమ్ముతాను. (తనపక్కదగ్గిరికి వెళతాడు) నీదీపం ఆర్పేయి.

లాచీ — ఒకసిగరెట్టు కాల్చి. (యాంక్ సిగరెట్టివ్వబోతాడు) నాదగ్గిరా ఉంది.

యాంక్ — అదికాదు, ఇది.

లాచీ — (శంకిస్తూ) సరేకానీ. (సిగరెట్టు తీసుకొంటాడు. డిగ్గరూ, కివీ స్నానాల గదిలోంచి వస్తారు. పడుకోడానికి సన్నద్ధులై ఉంటారు.) థాంక్ యూ.

యాంక్ — ఇవాళ చచ్చేటంత అలసిపోయాను. (దీపం ఆర్పేస్తాడు.)

డిగ్గర్ — ఇవేళ టామీ గుర్రుపెట్టాడా వాడి చెవులు కోసేశా నన్నమాటే.

యాంక్ — (దోమతెరలోకి పాక్కుంటూ వెళతాడు.) కొన్నాళ్ళిలాగే ఉండి కూలిపోతాను—లాచీ, గుడ్‌నైట్.

లాచీ — గుడ్‌నైట్. (లాచీ డిగ్గర్‌వైపు చూస్తాడు. డిగ్గర్ తన దోమతెర పరుపు కిందికి దూరుస్తుంటాడు. లాచీ లేచి అతనిదగ్గిరికి వెళ్తాడు.) డిగ్గర్, యుద్ధమై పోయింతరవాత ఏంచేయాలో నీకు తెలుసా ?

డిగ్గర్ — మాఆవిణ్ణి, పిల్లవాణ్ణి తీసుకొని తిన్నగా ఆస్ట్రేలియా వెళ్ళిపోతాను. (దోమతెర పరుపుకింద దూరుస్తూనే ఉంటాడు.)

లాచీ — అది మంచిదేశమే అనుకొంటాను. కాని నీకక్కడ ఏదైనా నౌకిరీ ఉందా ?

డిగ్గర్ — నాచేతులు చల్లగా ఉన్నంతకాలం భయ మేముంది ?

లాచీ — స్కాట్లాండులో పని సంపాదించాలని ఎప్పుడైనా నీకు తోచిందా ?

డిగ్గర్ — లేదు, దేవుడా ! ఎవరైనా అలా అనుకున్నారా ఎప్పుడైనా ?

లాచీ — నీకు జ్ఞాపకం ఉండి ఉంటుంది, నాకు కొంత భూమిఉంది. ఒక మంచి ఇల్లూ ఉంది. నువ్వక్కడకు వస్తే మనసారా నీకు స్వాగతమిస్తాను. నీకుటుంబాన్ని తీసుకురా. దమ్మిడీ ఇవ్వక్కరలేదు. నాభూమి మంచిది. పండించుకో. నాకొక్క పైస శిస్తు ఇవ్వక్కరలేదు.

డిగ్గర్ — నాపేబుక్కు తిప్పి చూసుకుంటే నేను ఒకే ఒక వైపు వెళ్లవలసి ఉంది. అది ఆస్ట్రేలియా. (కళ్లుమూసుకుంటాడు.) దేవుడా ! ఆస్ట్రేలియా ! ఆపేరు తలుచుకున్నప్పుడల్లా నాగుండెలో పంటి నొప్పిలేస్తుంది.

లాచీ — స్కాట్లండుకంటె అందమైన దేశం మరి లేదనుకో.

డిగ్గర్ — నేను ధనికుణ్ణైన తరవాత ఒకసారి తప్పకుండా వస్తాను.

లాచీ — అవును. నువ్వు ధనికుడవైతే నాసహాయం కోరనే కోరవు. మళ్లీ కనిపించవు.

డిగ్గర్ — అలా చెప్పలేవు. ఎలాగున్నా నేను మాత్రం ధనికుణ్ణికాను. కాని పేదవాణ్ణికూడా కానని పందెం వేయవచ్చు. (దీపం ఊదేస్తాడు.) నీకు ఒక పోస్టు కార్డు పంపిస్తాను. ఉత్తరమూ రాస్తాను. (మంచంలోకి పాకిపోతాడు.)

లాచీ — (ఆవేశంతో) నాకు ఉత్తరం రాస్తావా ?

డిగ్గర్ — నీకు ఉత్తరమూ రాస్తాను.

లాచీ — (ఈకొత్త అనుభవం గురించి యోచిస్తాడు.) నాస్వంతపేరున ఉత్తరం ! లాక్లెన్ మెకాచెన్ (ఆగి) ఎస్క్వైర్ !

డిగ్గర్ — దేవుడా ! నాకు నిద్ర అంటే చాలా ఇష్టం. గుడ్ నైట్. (దోమతెర తనచుట్టూ చుట్టుకుంటాడు.)

లాచీ — గుడ్ నైట్. (ఒక్కనిమిషం నిశ్శబ్దంగా నిలబడతాడు. కివి తనమంచం దగ్గర నుంచుని దోమతెర పరుపుకింద దోపుతూ ఉంటాడు )

కివీ — ఆశ్చర్యంవేస్తుంది, నాకు మలేరియా ఎందుకు రాలేదో! ఒక్కసారి నిద్రపట్టిందా నాపాదాలు రాత్రంతా బైటే ఉంటాయి. దోమలు వాటిని ' బ్లడ్ బ్యాంకు ' అనుకుంటాయి.

లాచీ — (దాటివచ్చి) మేజోళ్ళు తొడుక్కొని ఎందుకు పడుకోవు?

కివీ — ఈదోమలు గుంపుకట్టి మేజోళ్ళులాగి పారేస్తాయి. (దోమతెరలోకి దూరి పోతాడు.)

లాచీ — మీదేశంలో భయంకరమైన దోమ లున్నాయనుకొంటాను.

కివీ — న్యూజీలాండ్ దోమలైతే నారక్తమంతా పీల్చుకొన్నా పరవాలేదు. ఒక్కసారి మాదేశం వెళ్ళానా ఇంక బైటపడ్డ మనేది లేదనుకో.

లాచీ — (నిట్టూరుస్తాడు) నువ్వు నిజంగా ఇంటికి తప్పక వెళ్ళాలా ?

కివీ — నువ్వెప్పుడైనా నాదు వేళావా ? నాదు పికినప్పుడు వేళ్ళన్నీ వస్తాయా ?

లాచీ — (దుఃఖభారంతో) అవును, నాకు తెలుసు.

కివీ — అంతే అనుకో. కాని నీకు ఉత్తరాలు రాస్తాను. నీతో సంబంధం వదులుకోను. (దోమతెర బాగా అమర్చి) నేనింక పడుకుంటాను. దీపం ఆర్పేస్తావా? (కివీ దీపం ఊదేస్తాడు.) థాంక్స్, గుడ్ నైట్.

లాచీ — గుడ్ నైట్.

(బ్లాసమ్ తన పాజామాలతో వస్తాడు. తన మంచంమీద కెక్కుతాడు. లాచీ గబగబా అతని దగ్గిరికి వెళ్ళి — కొంచెం సంకోచించి నిలబడతాడు.)

బ్లాసమ్ — (పైకి చూచి) బ్లాసమ్ ?

(లాచీ నిరుత్సాహంతో తిరిగి పోతాడు.)

లాచీ — వద్దు. నిన్నెవ్వరూ స్కాట్లండ్‌లో అర్థం చేసుకోరు.

(బ్లాసం దీపం ఊదేసి మంచంలో దూరి పడుకుంటాడు. లాచీ వార్డులో అటూ ఇటూ పచారుచేస్తుంటాడు. దోమ తెరలు పరుపుల కింద సరిగ్గా లేకపోతే అవి సరిచేస్తుంటాడు. యాంకీ దోమతెర సరిగ్గా ఉందోలేదో చూచి తన పక్క దగ్గిరికి వెళ్తాడు. అతని దీపమొక్కటే వెలుగుతూ ఉంటుంది. మార్గరెట్ చేతిలో ఒక కప్పు పట్టుకుని చప్పుడు చేయకుండా వస్తుంది.)

మార్గరెట్ — చాలా ఆలస్యంచేశాను. స్టోర్‌రూము తాళంచెవి వెంటనే దొరికింది కాదు.

లాచీ — నేను స్నేహితులతో మాట్లాడుతూ గడిపాను.

మార్గరెట్ — ఇది తాగు నిద్రపడుతుంది.

లాచీ — థాంక్ యూ! (తన పరుపుచివర కూచుంటాడు. తాగడు.) ప్రపంచం నాలుగుమూలలనించీ వాళ్లు నాకు ఉత్తరాలు రాస్తారు. అలా అని వాళ్లన్నారు. (ఆమెవైపు చూస్తాడు.) దానివల్ల నాకెంతప్రయోజనమో సువ్వాలోచించావా, సిస్టర్!

మార్గరెట్ — ఉత్తరాలుచూచి గర్విస్తావు.

లాచీ — అవును. అంతకంటే ఎక్కువగా ఆనందిస్తాను. నేను జీవితంలో ఎక్కడికివెళ్ళినా ఏకాకినిమాత్రం కాను.

మార్గరెట్ — (మృదువుగా) లాచీ! ఏకాంతం ఎంతభయంకరమో నాకూతెలుసు.

లాచీ — కాని నేను చేయదగిం దేదీలేదు. నాజీవితంలో మొదటిసారి సహాయం చేయాలనుకొన్నాను. ఎలాచేయాలో తెలియదు.

మార్గరెట్ — మధనపడ్డం మానేయమని చెప్పా ననుకొంటాను.

లాచీ — కాని నేనేదో చేయాలి. సిస్టర్! నా కిది గుండెకోతగా ఉంది. నేనెంతో రుణపడి ఉన్నాను.

మార్గరెట్ — (అతనిపక్కనే కూచుంటుంది.) సరే, లాచీ! ఏదో రుణపడ్డానన్నావే, ఎవరికి? నీతోటిమనుషులకా?

లాచీ — అవును. నేనిన్నాళ్ళూ నాతోటి మానవులకు అపచారం చేశాను. నాఫార్మ్ దిక్కులేని గాయపడ్డసిపాయిలకోసం ఎందుకు ఉపయోగించరాదు అనుకుంటున్నాను.

మార్గరెట్ — తొందరపడకు. లాచ్లెన్, జ్ఞాపకముంచుకో "తొందరగుండెలో దుఃఖం పుడుతుంది."

లాచీ — నేను తొందరపడడంలేదు. నాధర్మం నాకుతెలుసు. నేను మతప్రచారకుణ్ణి కాలేకపోయాను. నాకు దేవుణ్ణి గురించి ఏమీ తెలియదు. దేవుడే నాకిప్పుడు స్నేహితుల్నిచ్చాడో ఏమో తెలియదు. నాకు ప్రార్థనచెయ్యడమైనా తెలియదు.

మార్గరెట్ — ఒకళ్ళకి రుణపడి ఉండడం నీకిష్టంలేదు కదూ!

లాచీ — నేను పుస్తకం రాయలేను. నేనెప్పుడూ స్కూలుకు వెళ్ళలేదు. సహాయం చేయాలని కోరికమాత్రమే ఉంది. నారెండుచేతులూ భూమీ మాత్రమే ఉన్నాయి, ఇచ్చేయడానికి.

మార్గరెట్ — లాచీ ! నువ్వు .......(లేచి నిలబడుతుంది.) ఒక్కనిమిషం ఆగు. (ప్రతిమంచంలోకీ ఫ్లాష్‌లైట్‌వేసి చూస్తుంది. అందరూ గాఢంగా నిద్రపోతున్నారని నిశ్చయమైనతర్వాత మళ్ళీవచ్చి లాచీపక్కను కూచుంటుంది.) లాచీ, నీకున్న సమస్తమూ ఇంకొకళ్ళతో ఎందుకు పంచుకోవు ? దానివల్ల మనం మరీ సంపన్నుల మౌతాం. నాతో నువ్వు పంచుకున్న కొన్నివస్తువులతోనే నేను చాలా సంపన్న నైనాను. అది నాకు తెలుసు.

లాచీ — నన్నుగురించేనా నువ్వు చెపుతున్నది, సిస్టర్ ?

మార్గరెట్ — అవును. మానవవ్యక్తిగా నాకు నిజమైన వ్యక్తిత్వం లేదనుకొంటాను. నేను కలిసిన వాళ్ళందరూ కలిసి నేనయ్యాను. నే నిన్నాళ్ళూ చదివిందీ, చూసిందీ కలిసి నేనయ్యాను. ఇక్కడొక సుగుణం, అక్కడొక దుర్గుణం నే నపహరించాను. నేను ప్రేమించినవా ళ్ళందరూ కలిసి నేనయ్యాను.

లాచీ — నాదగ్గిరనించికూడా ఏమైనా గ్రహించావా ?

మార్గరెట్ — నీకు తెలియకుండానే.

లాచీ — నీ కిది తెలుసునా, సిస్టర్ ? అతుపాకిగుండుముక్క నాలో అపాటి మిగిలిపోకపోతే నాలో ఈసంతృప్తి వచ్చేదికాదు. ఇదినేర్చుకోడానికి దెబ్బ తినవలసివచ్చింది.

మార్గరెట్ — దెబ్బతినవలసిన అవసరంలేదు. కాని దానివల్ల చాలా మేలైంది.

లాచీ — (ఆలోచిస్తాడు) మనుషులు ఎక్కువగా జబ్బుపడుతూఉంటే ప్రపంచం ఆరోగ్యంగా ఉంటుందంటావా ?

మార్గరెట్ — నాకుతెలియదు. (లేస్తుంది) ఇక నువ్వు పడుకోవాలి.

లాచీ — ఇవ్వాళరాత్రి నేను పడుకోను. అహా ! నాహృదయం సంకెళ్ళుతెంచే మాటలేవి ?

మార్గరెట్ — లాచీ, నిజంగా నువ్వు మాతో ఇంతసుఖంగా ఉన్నావా ? జీవితంలో ఎప్పుడూ నువ్విలాంటి సుఖం అనుభవించలేదా ?

లాచీ — (మెల్లగా) నేను ఒక్కక్షణం రాజులతో పంచుకున్నా ననుకుంటాను.

మార్గరెట్ — (ఎటో చూస్తూ ఉంటుంది) గుడ్ నైట్ లాచీ ! (పోబోతుంది.)

లాచీ — సిస్టర్ మార్గరెట్ ! నీకు తెలియకుండానే నాకు ఏదో ఇచ్చావని తెలుసా ?

మార్గరెట్ — (అతనివైపు తిరుగుతుంది) ఏమిటి, లాచీ ?

లాచీ — అదేమిటో నాకూ నిశ్చయంగా తెలియదు. కాని నేనెప్పుడూ ఎరగనిదది. నువ్వీగది విడిచిపెట్టి వెళ్తున్నావంటే నాలో తెలివి గలిగించే దది నువు వెళ్ళిపోవడం సహించలేని దేదోఅది.

మార్గరెట్ — (మృదువుగా) అది చాలా మధురమైంది. (అతని భుజంమీద చెయ్యివేస్తుంది.)

లాచీ — ఆహా! ప్రేమప్రపూర్ణమైన దేవాంగనా! (ఆమె చెయ్యిపట్టుకుని తన పెదవులకు నొక్కుతాడు. వెంటనే కంగారుగా విడిచిపెట్టేస్తాడు.)

మార్గరెట్ — ఎందు కలాచేశావు ?

లాచీ — అవును నాకు హక్కులేదు.

(మార్గరెట్ ఒక్క క్షణంపాటు అతణ్ణి కిందిచూపులతో చూస్తుంది. కళ్ళెత్తి ఆమెను చూస్తాడు. ఆత్రుత ప్రకటిస్తాడు. కృతజ్ఞత తెలియిచ్చుతాడు. చిన్నవాడిలా అయిపోతాడు. మార్గరెట్ రెండు చేతుల్లోనూ అతని ముఖంతీసుకుని ముద్దెట్టుకొంటుంది.)

మార్గరెట్ — ఏమీ హక్కులేదు.

(వెనక్కి తిరిగి, వాణ్ణి విడిచి వెళ్ళిపోతుంది. లాచీ నిలబడి, ఆమె వెళ్ళిపోతూ ఉంటే శాంతంగా చూస్తూ ఉంటాడు. దీర్ఘంగా ఊపిరి తీసుకుంటాడు. గిర్రున తిరిగి, బ్యాగ్ పైప్ తెచ్చుకుంటాడు. తన పక్కమీద కూచుని వాయించబోయి, అందరూ పడుకొన్నారని గ్రహిస్తాడు. తనచుట్టూ చూస్తాడు. మెల్లగా బ్యాగ్ పైపు ముద్దుస్తాడు. లేచి చప్పుడు లేకుండా అది ఉన్నచోటున పెట్టేస్తూ ఉండగా—

తెర పడుతుంది

---

## మూడో అంకం

### మొదటి రంగం

[ మరునాటి సాయంకాలం.

టామీ మంచంచుట్టూ ఆరుగురు రోగులూ నిలబడి ఉన్నారు. ఎన్నో అడుగుల దూరంలో మార్గరెట్ కెమేరా పట్టుకొని నిలబడి ఉంటుంది. ఆజట్టుమధ్య కిల్టు తొడుక్కొని లాచీ నిలబడి

ఉంటాడు. తలమీద టోపీకూడా ఉంటుంది. అందరిముఖాలూ గంభీరంగా ఉన్నాయి.]

మార్గరెట్ — సర్కసులో వెనక మేము చూచే విగ్రహాల్లా ఉన్నారు మీరందరూను. (సైగచేస్తుంది.) కొంచెం దగ్గిరికి వస్తారా ? (అలాగే చేస్తారు.) ఇంకా కొంచెం ఉల్లాసంగా కనిపించండయ్యా !

టామీ — నన్ను వీళ్ళందరూ నొక్కేస్తున్నారు.

కిప్ — టామీని వెనకఉంచితే ముందు చాలాస్థలం మిగిలిపోతుంది.

మార్గరెట్ — టామీ ! మంచంమీద మోకాళ్ళతో నిలబడు.

(టామీ మంచం మెక్కి అందరి వెన కాల నిలబడతాడు.)

కిప్ — నాకాళ్ళదగ్గిర్నుంచి పోయాడు. సుఖంగా ఉంది.

టామీ — కాళ్ళమీదకాక మోకాళ్ళమీద నిలబడ్డం నాకూ సుఖంగానే ఉంది. (కిలకిల మంటాడు.)

మార్గరెట్ — (కెమెరాలో చూస్తుంది. లాచీ గడ్డకట్టుకుపోయినవాడిలా నిల బడ్డాడు ) లాచీ, కొంచెంచిరునవ్వు నవ్వు.

లాచీ — (గురగురలాడతాడు) నేను సినిమాస్టార్నా, ఎలాపడితే అలా చేయ డానికి ?

మార్గరెట్ — కొంచెం మరి నవ్వలేకపోతే, చీదరించుకోడం కొంచెం తగ్గించ గలవా ?

లాచీ — అబ్బా ! త్వరగా ఫోటోతీసుకొని చాలిద్దూ.

మార్గరెట్ — సరే, సరే, ఇది టైమ్ ఎక్స్పోజర్. మీరందరూ కదలకుండా నిల బడాలి. (అందరూ అలాగే నిలబడతారు.) సిద్ధమేనా ? చిరునవ్వు నవ్వండి. (అందరూ చిరునవ్వు నవ్వుతారు ఒక్క లాచీతప్ప.) ఒకటి .... రెండు .... మూడు .... (తిన్నగా నిలబడుతుంది.) బాగానే పడింది అనుకొంటాను ఫోటో. (బాధ వదిలిందని అందరూ సంతోషిస్తారు. లాచీ స్క్రీనువెనకాలికి వెళ్ళ బోతాడు. మార్గరెట్ అతణ్ణి ఆపుచేస్తుంది.) లాచీ, ఇక్కడ నువ్వు తప్ప తక్కినవాళ్ళం అందరం ఒక్కొక్కబొమ్మ తీసుకున్నాం. రా, నీబొమ్మకూడా తీస్తాను.

లాచీ — (జంకుతూ) వద్దు.

డిగ్గర్ — తీసుకోవోయ్, లాచీ ! మేమందరం తలో కాపీ తీసుకుంటాం.

టామీ — మేము తీసుకోలేదా ?

మార్గరెట్ — (బతిమాలుతూ) కిల్టులో చాలా బాగా కనిపిస్తావు. తీసుకోవూ మరి ?
కివీ — దానివల్ల నీకేమీ అపాయం కలగదు.
లాచీ — (దృఢంగా) ఫిల్ము నాది. నేను ఫోటో తీసుకోను.
యాంక్ — మంచి కారణమైనా చెప్పవోయ్.
లాచీ — నేనొక్కణ్ణే కెమేరాముందు నిలబడలేను. (స్క్రీన్‌వైపు బయలుదేరతాడు) ఇప్పుడు కిల్టుతీసేస్తాను.
మార్గరెట్ — (పురికొల్పుతూ) ఒక్క ఎక్స్పోజర్ ఉండిపోయింది. ఎక్సురే అనుకొని నిలబడు.
యాంక్ — అదికూడా అయితేనేకాని తక్కినవాటిని డెవలప్ చేయలేము కదా.
డిగ్గర్ — కానివ్వవోయ్.
లాచీ — (వెనకాముందూ అవుతూ) సరే............(పొరపాటు చేశాడా అన్నట్టుంటాడు.)
యాంక్ — గుడ్ ! (లాచీని పట్టుకొని మధ్య నిలబెడతాడు.)
మార్గరెట్ — ఇదిగో ఆ వలయంలో నుంచో.
లాచీ — (కంగారుగా) నన్ను తొందరపెడుతున్నారు. కానివ్వండి.

(యాంక్ హెూ శాశ్వ్యా చేస్తూ నేల కానించి కెమేరాకేసి మార్గరెట్ ముందు నుంచుంటాడు. తక్కిన వాళ్ళు లాచీ వెనకాల ఉంటారు.)

యాంక్ — నువ్వు ని.........ని.........నీభూమిమీద ఉన్నట్టు నటించవోయ్. నీగడ్డి మైదానంమీద నిలబడి రోడ్డుకేసి చూస్తున్నట్టు నటించు.
టామీ — గాలిలో నీకిల్టు తొడుక్కొని. (కిల కిలా నవ్వుతాడు.)
మార్గరెట్ — దీన్ని అన్నిటికంటె మంచి ఫోటో చేద్దాం. (కెమేరాలో చూస్తుంది. లాచీ కదులుతాడు.) కదలకండా నిలబడు లాచీ !
డిగ్గర్ — ఒక వంకరపైపు పీలుస్తున్నట్టుగా ఉంటే బాగుంటుంది.
టామీ — గొర్రెలుకాసే కుక్కకూడా ఒకటి ఉండాలి.
యాంక్ — ఇక మీ కోచింగు చాలు.

(లాచీ తన చేతులు ఎలా ఉంచాలా అని ఆలోచిస్తున్నాడు.)

మార్గరెట్ — అలూ ఇటూ కదిలా వంటే ఫోకస్‌లో నిమ్చుంచడం కష్టమౌతుంది.
లాచీ — చేతు లెక్కడపెట్టాలో తెలియడంలేదు.
డిగ్గర్ — జేబుల్లో పెట్టు.

(లేని జేబుల్లో పెట్టాలని ప్రయత్నిస్తాడు లాచీ. మరింత చీకరించుకుంటాడు. చేతులు పక్కకి వేలాడేస్తాడు. టామీకి ఒక ఊహ తట్టుతుంది తన ఈగలుతోలే స్వాటరు అందుకుంటాడు. యాంక్ మంచం దాటి తన మంచంకిందికి పాకుతాడు. లాచీ కిల్టు వెనక భాగం స్వాటర్‌తో ఎత్తబోతాడు. డిగ్గరూ, కివీ మహా ఉత్సాహంతో ఇదంతా చూస్తుంటారు)

డిగ్గర్ — చేతులు పిర్రలకానించి నిలబడు. చూద్దాం ఎలాఉంటుందో. (లాచీ అలాచేస్తాడు.) ఉఁహూఁ, బాగాలేదు. (మాట మళ్ళించి) చెయ్యి కళ్ళకు నీడగా ఉంచి దూరాన తనగొర్రెలకోసం చూస్తున్నట్టు నిలబడితేనో!

మార్గరెట్ — (లాచీవెనకాల టామీ ఉండడం కనిపెట్టి) టామీ! బొమ్మలో వచ్చేస్తావు. ఇటు వచ్చెయి. (టామీ, డిగ్గరూ, కివీ ముగ్గురూ తామున్నచోట్లు విడిచిపెట్టి వచ్చేస్తారు. మార్గరెట్ మళ్ళా కెమెరావద్దకు వస్తుంది. కెమెరా సర్దుకుంటుంది. ఈలోపున, చేతులు కట్టుకునిలబడ్డం మంచిపోజని నిశ్చయించుకుంటాడు లాచీ.) అందరూ కదలకుండా ఉండండి. లాచీ, వాళ్ళమాటలు వినకు. (టామీ కదులుతాడు, తాను పడుకోబోతున్నాడా అన్నట్టు. కిల్టుకింద ఏముందో చూడ్డానికి మరోవైపు జరుగుతుంటాడు.) ఇప్పుడు, చిరునవ్వు నవ్వు. ఆఁ, చిరునవ్వు. (లాచీమాత్రం విగ్రహంలాగ చలనంలేకుండా నిలబడతాడు.) చిరునవ్వు, లాచీ!

లాచీ — నేను చిరునవ్వు నవ్వలేను. (అతను కదిలేటప్పటికి టామీ, డిగ్గరూ, కివీ మళ్ళా తమతమస్థానాలకు వచ్చేస్తారు—కిల్టు రహస్యం ఇంకా బైటపడకుండానే.)

యాంక్ — వీడికి పిచ్చెక్కుతుంది. దానికి ముందే బొమ్మతీసుకో, సిస్టర్! (టామీ ఫ్లైస్వాటర్ నోటకరుస్తాడు. తనమంచంకిందికి పాకుతాడు, కిల్టు సంగతి కనిపెట్టడానికి.)

మార్గరెట్ — అంతా సిద్ధం. ఒకటి .... రెండు .... మూడు. (మీటనొక్కి నవ్వుతుంది) దేవుడా! అయిపోయింది.

(లాచీ తలుపు దగ్గిరకి వెళ్తాడు. టామీ, యాంక్ మంచంకింద ఉంటారు. కిల్టుకింద ఏముందో చూడ్డానికి చేసిన ప్రయత్నం వ్యర్థమైనందుకు నిస్పృహులైఉంటాడు.)

యాంక్ — (నవ్వుతూ) నువ్వు ఘోరమైనవాడివి.

లాచీ — మీరందరూ స్నేహితు లనుకొన్నాను.

యాంక్ — క్షమించు లాచీ! కిల్టుతొడుక్కున్న పిచ్చిస్కాటు మహా భయం కరంగా ఉంటాడు.

మార్గరెట్ — థాంక్ యూ, లాచీ! నువ్వు ఓపిగ్గానూ, చక్కగానూ ప్రవర్తించావు. (కెమెరా యాంక్ కిస్తుంది.) కొంచెం ఎక్స్‌రేరూముకు పోయి మన బొమ్మలు డెవలప్‌చేస్తారేమో కనుక్కోవాలి.

యాంక్ — సరే.

మార్గరెట్ — ఇప్పుడు కొందరువెళ్ళి వార్డు 'సి' లో బాత్‌టబ్బు పట్టుకు వస్తారా? వారంరోజులపాటు మన్ని టబ్బు వాడుకోనిస్తారట.

టామీ — ఓ, మంచిపని. బీర్‌తర్వాత నాకు వేడినీళ్ళస్నానం అంటే చాలా ఇష్టం. టబ్బునిండి ఉండాలి.

కివీ — నేను వెళ్ళవచ్చునా? సిస్టర్! కొంచెం నడవాలని ఉంది.

మార్గరెట్ — ఎవరైనాసరే, వెళ్ళండి. ఎలాగో ఒకలాగ బాత్‌టబ్ ఇక్కడ చేర్చడం నాకు కావాలి. (నవ్వుకొంటూ బైటికి వెళ్ళిపోతుంది.)

లాచీ — సరే, నాకిల్టు తీసేస్తాను (క్రీకునువెనక్కి బైలుదేర్తాడు.)

టామీ — ఓ లాచీ!

లాచీ — (ఆగి) ఏమిటి?

టామీ — (చతురంగా) ఒకటి రెండు నిమిషాలు ఆగుతావా? నిజంగా నిన్నింకా బాగా చూడనేలేదు.

లాచీ — ఫోటోలో చూడు. (క్రీకునుదిక్కు వెళ్ళబోతాడు.)

టామీ — (తొందరగా) కదలకుండా ఒక్కనిమిషం ఆగు. నీకిల్టు కళ్ళారా చూడనీ.

కివీ — లాచీ, కొంచెం అటూ ఇటూ తిరుగు.

(టామీ యాంక్ పరుపుమీద కాళ్ళవైపు కూచుంటాడు యాంక్ తనమంచానికీ టామీ మంచానికీ మధ్య నిలబడతాడు.)

లాచీ — మీకు కావాలంటే అలాగే కానివ్వండి. (సగర్వంగా తలుపుదగ్గిరికి నడుస్తాడు. మళ్ళీ గిర్రునతిరిగి వెనక్కి వస్తాడు. మంచాలదగ్గిరనుంచి వెళ్తుతూ ఉంటే ప్రతివాడు కిల్టు వెనకభాగం పట్టుకుని ఎత్తబోతాడు. కాని ఎవ్వరూ త్వరగా చెయ్యరు.)

డిగ్గర్ — ఓ! నడుస్తూఉంటే ఎంత గలగలమంటుందో చూడు.

(లాచీ ఆగి వాళ్ళకి అభిముఖంగా నిలబడతాడు.)

టామీ — (మరేదైనాపద్ధతి కనిపెట్టడానికి ప్రయత్నిస్తూ) ఏదీ తిరిగిచూడు. ఇలా తిరిగినప్పుడు ఎలా అనిపిస్తుందో చూద్దామని.

లాచీ — (సగర్వంగా) అది చాలా విలాసంగా ఉంటుంది. (మెల్లగా తిరుగుతాడు. కిల్టు కొద్దిగా మడతపడుతుంది. అతను తిరిగేటప్పుడు నలుగురూ వంగుతారు.)

టామీ — (మళ్లా ఆశాభంగమైనా నిరుత్సాహపడక) నువ్వొకసారి గిర్రున తిరిగా వనుకో, అప్పు డెలాగుంటుందో ?

లాచీ — ఉఁహూఁ.

టామీ — కాంజీలా విలాసంగా ఉంటుంది. లాచీ! ఒక్కసారి గిర్రున తిరుగు చూద్దాం.

(టామీ ఒక మోకాలిమీద నిలబడతాడు. లాచీ వేగంగా గిర్రున తిరుగుతాడు. మళ్ళా తల కాయలన్నీ కిందికి వంగుతాయి. తల కాయలు లేచేటప్పటికి మార్గరెట్ తలుపు తీసుకు వస్తుంది.)

మార్గరెట్ — మీరు టబ్బు తీసుకువస్తారా లేదా ?

కివీ — (అయిష్టంగా) తెస్తాం.

లాచీ — (యాంక్ దిక్కు తిరిగి) యాంక్ ! నువ్వు కొంచెం ఆగుతావా ? నీతో ఒక మాట చెప్పవలసి ఉంది.

యాంక్ — తప్పక. (తక్కినవాళ్లతో) నేను లేకపోయినా పని నడుస్తుందా ?

డిగ్గర్ — (టామీతో) రావోయ్, ముసలితొక్కా ! మనం టబ్బు ఉపయోగించుకో వచ్చు కూడాను.

టామీ — నాకేదో తెలియకుండా చేయడానికి కుట్రపన్నిన ట్లున్నారు.

(టామీ, కివీ, డిగ్గర్ టబ్బుకోసం వెళతారు.)

యాంక్ — నీ మనస్సులో ఏముందో చెప్పు.

లాచీ — (విసుక్కుంటూ ప్రారంభిస్తాడు) నువ్వు ఇంటికి వెళ్ళినతర్వాత పెళ్ళి చేసుకొంటానని చెప్పినట్లున్నావు కదూ ?

యాంక్ — అహా !

లాచీ — నీకు భార్యకావాలని ఎప్పుడు మనస్సైంది ?

యాంక్ — నా అమ్మాయిని మొదటిసారి ముద్దెట్టుకొన్నప్పుడు.

లాచీ — (బాగా నచ్చినట్టుగా) అహా ! నువ్వు ముద్దెట్టుకొన్నప్పుడు కదూ ?

యాంక్ — అది నా పద్ధతి.

లాచీ — ఒకపిల్ల నిన్ను ముద్దెయికొన్నప్పుడో ? అది ప్రోత్సాహకరమైన సంజ్ఞ కాదూ ? అవునా ?

యాంక్ — (పళ్ళికిలించి నవ్వుతూ) మంచి కానీ, చెడ్డ కానీ, ఎలాచూసినా అది ప్రోత్సాహకరమైన విషయమే.

లాచీ — నువ్వు వివరించి చెప్పలేని దేదో అవుతుంది కదూ ?

యాంక్ — ఆహా ! నేను వివరించి చెప్పగలననుకో. దానివల్ల ప్రయోజన మేమిటి ?

లాచీ — నాకూ పెళ్ళిచేసుకోవాలని ఉందనుకొంటాను. (యాంక్ మంచంచివర కూచుంటాడు) నేననుకొంటాను.

యాంక్ — నిశ్చయంగా చెప్పలేవా ?

లాచీ — అవును. అదే నాసమస్య. ఒక కన్యను 'నువ్వు నాభార్యవౌతావా ?' అని అడిగే హక్కు నాకుందంటావా ? ఇప్పుడు మనమున్న పరిస్థితుల్లో ? (యాంక్ మాట్లాడడు. లాచీ అతనివైపు చూస్తాడు) నువ్వెందుకు వెనకముం దౌతున్నావు ?

యాంక్ — (సావధానంగా) 'ఉన్నపరిస్థితుల్లో' అంటే ఏమిటి ?

లాచీ — సరే, ఇప్పుడు నేను పెళ్లే చేసుకొంటే, నేను నారెజిమెంటుకు తిరిగి పోవాలి. అది నావధువుకు న్యాయంగా ఉంటుందా ?

యాంక్ — ఓరి పిడుగా ! నువ్వు సిస్టర్....... ....

లాచీ — అవును. సిస్టర్ మార్గరెట్.

యాంక్ — అది వీల్లేదు.

లాచీ — ఆమెకు పెళ్లికాలేదు.

యాంక్ — లాచీ ! విను. ప్రతివాడూ తన నర్సును ప్రేమిస్తాడు. అది సహజమే. ఈవార్డులో ఉన్న ప్రతివాడూ ఎప్పుడో ఒకప్పుడు సిస్టర్ మార్గరెట్‌ను ప్రేమించిన వాడేనని పందెం వేస్తాను. ఆమె మనకు ఉపచారాలు చేస్తుంది. మన మీద అనురాగంతో ఉంటుంది. దాని అర్థం ఆమె మన్ని ప్రేమిస్తుందని కాదు. ఆమె మంచితనాన్ని ప్రేమ అనుకుంటే ప్రమాదం వస్తుంది.

లాచీ — అందుకోసమే నీసలహా కోరింది. నువ్వు స్కాటువే. (యాంకు ఒప్పుకో నట్టుగా చూస్తాడు.) సిస్టర్ మార్గరెట్ ఏపేషెంటునైనా ముద్దు పెట్టుకున్నట్టు విన్నావా ?

యాంక్ — నన్నుమాత్రం ఎన్నడూ ముద్దెట్టుకోలేదు.

లాచీ — ఆమె స్వేచ్ఛగా ఒక మనిషిని ముద్దెట్టుకొన్నదంటే దాని అర్థం అతణ్ణి ప్రోత్సహిస్తుందనే కదా ?

యాంక్ — నిన్ను ముద్దెట్టుకుందా ?

లాచీ — అవును.

యాంక్ — ఓ!

లాచీ — (మృదువుగా) ఆమె రెండు మెత్తని చేతుల్లో నామొహం పెట్టుకొని ముద్దెట్టుకొంది.

యాంక్ — హం. లాచీ ! ఆడవాళ్లు ఇలాగే చాలమంది మొగాళ్లను ముద్దెట్టు కొంటారు. దాని అర్థం పెళ్లిచేసు కొంటారని కాదు.

లాచీ — కాని, సిస్టర్‌మార్గరెట్ అంత స్వేచ్ఛాప్రవర్తనం కలదంటావా ?

యాంక్ — (టామీ మంచంమీద కూచుంటూ) కాదు.

లాచీ — (ముందుకు వంగి) నన్ను ముద్దెట్టుకొందంటే దానికి కొంత అర్థం ఉండాలంటావా ?

యాంక్ — తప్పక ఏదో ఉండాలి.

లాచీ — నేను రాత్రంతా మేలుకొని ఆశ్చర్యంతో ఆలోచించాను, నాకంత అదృష్టం కూడానా అని. అయినా ఎలాంటి భ్రమలోనూ ఉండదలచుకో లేదు. (యాంక్ వంక తిరిగి) నేను పెళ్ళిమాట ఎత్తడం అవివేకమంటావా ?

యాంక్ — (కొంచెం ఆగి) చెప్పలేను.

లాచీ — కాని విషయం చూస్తే, నాకు అనుకూలంగానే ఉన్నాయి పరిస్థితులు. (యాంక్ ఒప్పుకోవాలని ఆత్రతతో చూస్తాడు.)

యాంక్ — (ఆగుతాడు) సరే, నడు. ముందుకునడు. అది పొందదగిందే అయితే, అర్రులు చాచడానికి అర్హమైందే. అయితే, కానీ.

లాచీ — అవును. అర్రులు చాస్తాను, పెళ్ళిమాట ఎత్తుతాను.

యాంక్ — (నిరుత్తరుడై) నువ్వు ఎక్కువగా పడుకొని తక్కువగా యోచిస్తే మంచి దనుకుంటాను.

(సరిగ్గా ఇలా అనుకుంటుండగా మార్గరెట్ ప్రవేశిస్తుంది. మాత్రలసీసా చేతిలో ఆడించు కొంటూ వస్తుంది.)

మార్గరెట్ — లాచీ, నీకోసం మందుతెచ్చాను. (మందులపెట్టె వద్దకు వస్తుంది. కిటికీవద్ద బసుటో నిలబడి ఉన్నాడు. అతడు కిటికీలోంచి దూరంగాఎక్కడో చూస్తున్నాడు) బ్లాసమ్ ! అందరూ విడిచిపెట్టేశారా నిన్ను ?

యాంక్ — (లాచీ చెవిలో గుసగుస లాడతాడు.) ఇంతకంటె మంచి అవకాశం మరొకటి దొరకదు.

లాచీ — ఇప్పుడే అంటావా ?

యాంక్ — (నొక్కి చెపుతూ) ఇప్పుడే.

లాచీ — సరే. కిల్టు అలాగే ఉంచుకొన్నాను. సంతోషం. దీనివల్ల నాఉద్దేశభంగ మైతే కాదుకదా !

యాంక్ — కిల్టు అలాగే ఉంచు.

మార్గరెట్ — (మాత్రలసీసా, నీళ్ళగ్లాసూ తీసుకొని లాచీవద్దకు వస్తుంది.) మెడికల్ ఆఫీసర్ ఈమాత్రలు తినమన్నారు.

లాచీ — ఈ మాత్రలు వ్యర్థపుచ్చడం తప్ప మరేమీలేదు.

యాంక్ — (లేచి బయలుదేరుతూ) మళ్ళా కలుస్తాను, లాచీ ! (బ్లాసమ్‌ని పిలుస్తాడు.) బ్లాసమ్ ! ఇటు రా. (బ్లాసమ్ బయలుదేర్తాడు. యాంక్ అతని చెయ్యి పట్టుకొని) నిన్ను బైటికి తీసుకువెళ్ళి మరొక్కమాట నేర్పుతాను. అన్ని అవసరాలకూ సరిపోయే ఒకమాట. (ఇద్దరూ వెళ్ళిపోతారు.)

మార్గరెట్ — (లాచీవైపు తిరిగి) మరి తీసుకో.

లాచీ — నేను ఆరోగ్యంగానే ఉన్నాను. నన్ను వేధించడానికి ఈ మందులు పంపిస్తాడు.

మార్గరెట్ — కొంచెం అతనితో ఇచ్చకా లెందుకాడవు ? పాపం, ముసలి కర్నల్ !

లాచీ — అవును. అలాగే చేస్తాను. అతణ్ణి నామనస్సులోకి ఎప్పుడూ రానివ్వను. (మాత్రలు తీసుకొని మింగుతాడు. మార్గరెట్ గ్లాసుతీసుకొని బయలు దేరుతుంది.) ఒక్కనిమిషం తీరిక ఉందా, సిస్టర్ !

మార్గరెట్ — మేట్రన్‌ను చూద్దామని బయలుదేరాను. సరే, ఏంకావాలో చెప్పు.

లాచీ — పెళ్ళిమాట నీతో చెప్పాలనుకొంటున్నాను. కొంచెం కూచో.

మార్గరెట్ — (టామీ మంచంమీద కూచుంటుంది.) దేవుడా ! అవును. (ఆగుతుంది. ఆమె వినలేదేమో అనిపిస్తుంది.) ఒక్క క్షణం ఆగు, లాచీ ! ఈ పెళ్ళిమాట నాతో నేనా ?

లాచీ — అవును. మరెవరితో ?

మార్గరెట్ — ఓహో ! (మొదటనే విన్నది.)

లాచీ — ఒకప్పుడు నీతో అన్నాను; నాకు పెళ్ళిచేసుకొనే ఇచ్ఛలేదని. జ్ఞాపకముండి ఉంటుంది !

మార్గరెట్ — బాగా.

లాచీ — నేనప్పుడు చెప్పినదానికి పశ్చాత్తాప పడుతున్నాను. పెళ్ళిగురించి నావైఖరికూడా నీకు విశదపరచాను.

మార్గరెట్ — (చీదరించు కొంటుంది. పెద్దగా శ్వాస తీసుకొంటుంది.) లాచీ! నువ్వు మరొక విధంగా....

లాచీ — దయచేసి నామాటకు అడ్డురాకు. (ఆమెపక్కని నిలబడి, చేతులు వెన కాల ముడివేసి) పైకి నేనో పెద్దమనిషిలా కనిపించను. కాని నేను గొప్ప ఇచ్ఛాశక్తి కలవాణ్ణి. నాకు స్కాట్లాండులో ఒక మంచి ఫార్మ్ అదీ ఉంది. అది నీకు తెలుసు. కర్నల్ అభిప్రాయం ఎలాఉన్నా నా ఆరోగ్యం చాలా బాగుంది. నేను కొంచెం దురాగ్రహ పరుణ్ణి. కాని దానివల్ల నీకేమీ కష్టం కలక్కుండా చూస్తాను. నేను చేయదగిందంతా చేస్తాను. నేను సైన్యంలో ఉన్నంతకాలం నా జీతం ఉండనే ఉంది. అదెంతో నీకు తెలుసు. అదంతా నీపేర రాసేస్తాను, నేనివ్వగలిగిందంతా ఇస్తాను. నీకు తిండికీ ఇంటికీ ఎప్పుడూ దైన్యం ఉండదు. నేను ఏడేళ్ళ వయస్సునుండీ పనిచేస్తున్నాను. నేను కాబిన్ బాయ్‌గా, సీమన్‌గా, రైతుగా, గనిపనివాడిగా, స్టీవెడోర్‌గా, సార్జెంటుగా పనిచేశాను. నీకోసం ఎప్పుడూ పనిచేయగలను. నా వయస్సు ఇరవైఒక్కటి. నేను ఔరసుణ్ణి కాను. నాతల్లి పెళ్ళిచేసుకోలేదు. (ఇంకా మనస్సు తడుముతూ ఉంటాడు) నాకు మంచి పళ్ళున్నాయి. (ఇంకేదైనా గుణం తనలో ఉందేమోనని వెదుకుతాడు.) నేను పచ్చబొట్టు పొడిపించుకో లేదు. (ఇక ఏమీ తోచక అపుచేస్తాడు.) దీన్ని గురించి ఆలోచించడంలో తొందరపడవని ఆశిస్తున్నాను.

మార్గరెట్ — (కళ్ళు చేతులతో కప్పుకొని కూచుంటుంది.) లాచీ! నాకు నువ్వేదో రుణపడి ఉన్నావనుకొని నాకు నీజీవితమంతా ధారపోస్తున్నావా?

లాచీ — (మృదువుగా) నాహృదయం నీకర్పిస్తున్నాను. నువ్వు లేకపోతే దాని వల్ల నాకేమీ ప్రయోజనంలేదు.

మార్గరెట్ — (లేచి అతణ్ణుంచి దూరంగా పోతుంది.) ఓలాచీ! ఇదంతా అంత సులభం కాదు.

లాచీ — నీజీవితం ఇంకెవరికైనా దత్తమా?

మార్గరెట్ — అదికాదు.

లాచీ — నాభావాలతో ఏకీభవించలేకండా ఉన్నావా? (ఆగుతాడు) నీకనవస రంగా దుఃఖం కలిగించాను. నేను భ్రమపడ్డాను. క్షమిస్తావా?

మార్గరెట్ — (అతనివైపు తిరుగుతుంది.) మూర్ఖుడివైన మొండి మనిషి ! నిన్నెందుకు ప్రేమించాలి నేను ?

లాచీ — దయతలుచు. నన్ను కంగారు పెడుతున్నావు. చెప్పు. నువ్వు నన్ను ప్రేమిస్తావా ? ప్రేమించవా ?

మార్గరెట్ — భగవంతుడు మన్ని రక్షించుగాక ! నిన్ను ప్రేమిస్తున్నాను.

లాచీ — (ఆమెవైపు తదేకదృష్టితో చూస్తూ) నేను నమ్మలేను. (ఆమె చేతులు పట్టుకొంటాడు.) నన్ను పెళ్ళిచేసుకొంటావా ?

మార్గరెట్ — నువ్వు కావాలంటే. (అతని మొహం చేతుల్లో పట్టుకొంటుంది.) నేనే ఎప్పుడూ ముందు ముద్దెట్టుకోవాలనా ?

లాచీ — (మృదువుగా ముద్దెట్టుకొంటాడు.) ఆ. నాప్రియమైన మాగే !

మార్గరెట్ — (నవ్వుతుంది) ఓ డియర్—మాగే కాదు.

లాచీ — నీకిష్టం లేని దేదీ: చేయను.

(ఇద్దరూ ఒకమంచంచివర కూచుంటారు )

మార్గరెట్ — వాగ్దానాలేమీ అక్కర్లేదు.

లాచీ — (హఠాత్తుగా) మరి నామీద నువ్వేం శ్రద్ధ తీసుకో గలవు ?

మార్గరెట్ — మరి ఏమీ సందేహాలుకూడా లేవు.

లాచీ — ఏమీలేవు. ఉత్తగా 'నిన్ను ప్రేమిస్తున్నా' నని చెప్పు. 'నిన్ను ప్రేమిస్తున్నా' నని చెప్పు. అంతే.

(ఎవరో తలుపు తట్టుతారు. తలుపు తెరుచుకుంటుంది.)

టామీ — (బాత్‌స్టూలు ఒక కొన పట్టుకొని లోపలికి వస్తుంటాడు.) జాగర్త. పాకంతా పడగొట్టెయ్యగలవు !

డిగ్గర్ — (రెండో పక్క పట్టుకొని లోపలికి వస్తాడు. ఆటబ్బు పెట్రోలు డబ్బా రేకులతో రాయల్ ఇంజినీర్లు చేసిం దనడంలో సందేహం లేదు.) వాళ్ళిందులోనే టీ చేసుకుంటారని పందెం వేస్తాను.

కివీ — (ఒక కొన పట్టుకొని వస్తూ) ఇది మంచి పందెమే. నేనొప్పుకొన్నాను.

(అందరూ స్నానాల గది వైపు వెళ్తారు.)

టామీ — నేను టబ్బులో కూచొని బట్ట లుతుక్కుంటాను.

కివీ — దీనిలో నువ్వు కూచొన్నావా, దీన్ని అరగ్గొట్టేస్తావు.

(టబ్బు స్నానాలగదిలోకి తీసుకు వెళ్తారు )

మార్గరెట్ — (లేచి లాచీని మృదువుగా ముద్దెట్టుకొంటుంది.) మాట్రన్ నాకోసం ఎదురు చూస్తుంటుంది.

లాచీ — నీకోసం జీవితమంతా ఎదురు చూశాను. వెళ్ళకు, ప్రియతమా !

మార్గరెట్ — లాచీ ! నీతో ఎన్నో సంగతులు చెప్పవలసి ఉన్నాయి. కాని ఎప్పుడూ చెప్పననుకొంటాను. ఎన్నో నదులు హఠాత్తుగా దాటిపోయాం మనం. వెనక్కి తిరిగి చూస్తూ కాలం వ్యర్థం చెయ్యవద్దు మనం.

(యాంక్ రంగం వెన కాలనించి ఈలవేస్తాడు. మార్గరెట్ తిన్నగా నిలబడి ముందుకు నడుస్తుంది. యాంక్ ప్రవేశిస్తాడు. ఆమె వెన కాలే తలుపు లేసేస్తాడు. లాచీ నిలబడతాడు. టోపీ తో డు కుంటాడు. వెనక్కీ ముందుకీ సగర్వంగా నడుస్తాడు. కిల్టుగల గల ధ్వని చేస్తుంది.)

యాంక్ — ఏమైంది ?

లాచీ — నువ్వసహ్యించుకోకపోతే బ్యాగ్పైప్ వాయిస్తాను.

యాంక్ — జవాబు న....న....నాకు తెలుసు.

లాచీ — ఆమె నన్ను ప్రేమిస్తుంది, యాంక్.

యాంక్ — పెళ్ళి ఎప్పుడు ?

లాచీ — తేదీ నిర్ణయం కాలేదు. నువ్వు నా పక్షాన నిలబడాలి.

యాంక్ — నీ బెస్టుమాన్ కమ్మంటావా ? తప్పకుండా.

లాచీ — థాంక్యూ, యాంక్ ! (చెయ్యి పట్టుకొని షేక్హాండ్ చేస్తాడు.) నీ దయకు కృతజ్ఞుణ్ణి. ఇప్పుడు నువ్వు క్షమిస్తే కిల్టు తీసేస్తాను. (స్క్రీన్ లోకి వెళ్తాడు.)

యాంక్ — (అతని వెనకాలే వెళ్ళి) నీతో ఇక్కడ కు....కు....కూచుంటాను.

లాచీ — నేను కొంచెం విశ్రమిస్తాను. నువ్వు అన్యథా భావించవుకదా ? (యాంక్ తల ఊపుతాడు.) థాంక్యూ.

(లాచీ స్క్రీన్ మూసేస్తాడు. డిగ్గర్, టామీ, కివీ స్నానాల గదిలోంచి వస్తారు.)

డిగ్గర్ — (టామీతో) నువ్వు స్నానానికి వెళ్ళేటప్పుడు ఒక వాసనసబ్బూ, తువాలూ, ఒక కాన్ ఓపెనరూ తీసుకువెళ్ళు.

(స్క్రీన్ ప్రక్కగా వెళ్ళుతూ, టామీ యాంక్ను చూస్తాడు.)

టామీ — అతను బట్టలు మారుస్తాడా ?

(యాంక్ తల ఊపుతాడు. టామీ తక్కినవాళ్ళకి సంజ్ఞ చేస్తాడు. డిగ్గర్, కివీ. టామీ వెనకాల చేర్తారు. బ్లాసమ్ ప్రవేశించి అందరిలో చేర్తాడు. టామీ మోకాళ్ళమీద నిలబడి స్క్రీనులోని పగుళ్ళలోంచి తొంగిచూస్తాడు. డిగ్గర్ టామీ భుజంతట్టి ఏమౌతుందని సంజ్ఞ చేస్తాడు చొక్కా తీస్తున్నాడని టామీ సంజ్ఞ చేస్తాడు. కివీ వంగి టామీ వీపు తట్టుతాడు. లాచీ గోక్కుంటున్నాడని టామీ సంజ్ఞతో చూపిస్తాడు. కర్నల్ ప్రవేశిస్తాడు. అందరూ స్క్రీనువద్ద చేరి ఉండడం చూచి గేటు దగ్గిర నిలబడతాడు. గొంతు సవరించుకొంటున్నట్టు దగ్గుతాడు.)

కర్నల్ — ఇదంతా ఏమిటి ?

(అందరూ తిన్నగా నిలబడి కంగారు పడుతూ సెల్యూట్ చేసి తను తమ మంచాల దగ్గిరికి వెళతారు.)

టామీ — ఒక పందెం వేశామండి. అది పరిష్కారం చేసుకొంటున్నామండి. కిల్ట్ అండి. కిల్టు.

కర్నల్ — ఆర్డర్లీ ఎక్కడ ? సిస్టర్ ఎక్కడ ?

యాంక్ — నాకు తెలియదండి. ఇప్పుడే సిస్టర్ బైటికి వెళ్ళిందండి.

కర్నల్ — సార్జెంట్ మెక్లాక్లెన్ ఏడి ?

కివీ — (స్క్రీన్‌వైపు చూపిస్తూ) అందులో ఉన్నాడండి.

కర్నల్ — (యాంకుతో) స్క్రీనులు తొలగించండి. అతనితో మాట్లాడవలసి ఉంది.

యాంక్ — చిత్తం. (కివీతో కలిసి స్క్రీన్ తొలగిస్తాడు. లాచీ తిరిగి యాంకుకు అభిముఖుడౌతాడు. ఇప్పుడు నీలిదుస్తుల్లో ఉన్నారు.) కర్నల్ నిన్ను చూడ్డానికి వచ్చారు, లాచీ !

లాచీ — (గబగబా జాకెట్టు గుండీలు పెట్టుకుంటూ) బట్టలు మార్చుకుంటున్నానండి.

కర్నల్ — సరే, సరే, (లాచీ వద్దకు వెళ్ళి) నేను పంపించిన మాత్రలు తీసుకొన్నావా ?

లాచీ — (అయిష్టంగా) తీసుకొన్నానండి. కాని ఇంకా మాత్రలు తినుకోడానికి మీరు నన్ను బలవంతపెట్టలేరు.

కర్నల్ — ఏమిటీ ?

లాచీ — (తన మాటమీద నిలబడి) బ్రిటిష్ సోల్జర్లకున్న హక్కులప్రకారం నేను ఆ మందులు తీసుకోడానికి నిరాకరించవచ్చునని చెప్పడానికి సాహసించ వచ్చునాండి ?

కర్నల్ — (తక్కినవాళ్ళవైపు తిరిగి) మీరందరూ కొంచెం బైటికి వెళ్ళండి. (అందరూ త్వరగా తలుపులు వేసుకొని బైటికి వెళతారు. కర్నల్ లాచీని పరిశీలిస్తాడు) నీగురించి డి. ఎమ్. ఎస్. తో ఇప్పుడే మాట్లాడి వస్తున్నాను.

లాచీ — నామీద నేరం మోపుతున్నారా ?

కర్నల్ — కూచో (లాచీ తనమంచంచివర కూచుంటాడు.) ఇక్కడికి నిన్ను తీసుకువచ్చేముందు నిన్ను విమానంలో వెనక్కి పంపించే అవకాశం ఏదైనా ఉందా చూడవలసిందని హెడ్ క్వార్టర్సును అడిగాను.

లాచీ — (కంగారుగా) వెనక్కంటే ఎక్కడికండి?

కర్నల్ — స్కాట్లండుకు తిరిగిపోవాలని నీ కుందనుకొన్నాను. అక్కడ ఏమైనా నీవ్యవహారాలు పరిష్కారం చేసుకోవలసినవి ఉన్నాయేమో అనుకున్నాను. కాని హెడ్క్వార్టర్సువాళ్ళు ఇదెంతమాత్రమూ సాధ్యంకాదన్నారు. ఎన్నాళ్ళనించో వేచుకొని ఉన్నవాళ్ళు కావలసినంతమంది ఉన్నారన్నారు. నూటా ఎనమండుగురు బ్రిగేడియర్లు వెయిటింగులిస్టులో ఉన్నారన్నారు.

లాచీ — ఎందు కిదంతా మీరు నాకోసం చేస్తున్నారో నాకర్థం కాలేదు.

కర్నల్ — వాళ్ళు అలా నిరాకరించినతర్వాత నిన్ను ఇక్కడ ఉంచడానికి నిశ్చయించాను. (ముక్కు లాక్కుంటాడు) వీళ్ళందరితో బాగా స్నేహం కుదిరిందా ? సంతృప్తికరంగా ఉందా ?

లాచీ — ఇక్కడ మంచివాళ్ళున్నారండి.

కర్నల్ — (యాంక్ మంచంచివర లాచీకి అభిముఖుడై కూచుంటాడు.) ఇప్పుడే నాకు ఆర్మీనించి పిలుపువచ్చింది. జనరల్ హెడ్క్వార్టర్స్లో ఎవరో తీర్మానించారు, ఆ బ్రిగేడియర్లకంటే నువ్వే ముఖ్యుడవని.

లాచీ — పరిహాసానికంటున్నారు, సర్. నే నుత్త సార్జంటుసు. (సగర్వంగా) కామరూన్సులో అనుకోండి.

కర్నల్ — సార్జంటుకానీ బ్రిగేడియర్ కాని, నువ్వు నాతో కలిసి వింగ్కమాండర్ వద్దకి వచ్చావా రేపు నీప్రయాణం స్థిరపడిపోయిం దనుకో. నీకు A.1 ప్రయారిటీ ఇస్తున్నారు, మూడురోజుల్లో స్కాట్లండు చేరిపోతావు. మరివెళ్తావా ?

లాచీ — ఆకర్షకంగానే ఉంది. కాని మళ్ళా తిరిగి రావడ మెప్పుతండి ?

కర్నల్ — (సంకోచిస్తూ) నువ్వింక తిరిగిరావు.

లాచీ — నా రెజిమెంటుకు తిరిగి వచ్చే అనుమతి ఇవ్వరంటారా ?

కర్నల్ — నాకు ఇలాగే ఆజ్ఞ దొరికింది. నేను ఆ ఆజ్ఞతో ఏకీభవించను. కాని నేను సోల్జరును. అరగంటసేపటివరకు దానికి వ్యతిరేకంగా వాదించాను. ఇప్పుడు నేను చేయదగిం దేమీ లేదు. ఎక్కడో ఒక నియమం ఉందట. అది ఏ బోయర్ యుద్ధకాలంనించో వస్తుంది డి.ఎమ్.ఎస్.కు అది ఎలాగో జ్ఞాపకం ఉంది. నీకేసు పూర్తివివరాలు నీకు తెలియజేయాలంటాడు.

లాచీ — పూర్తి వివరా లిచ్చారు కదా ?

కర్నల్ — నీ మూత్రకోశంలో తుపాకిగుండుముక్క గుచ్చుకొని నువ్విక్కడకు వచ్చినప్పుడు నువ్వు బతికే అవకాశా లుండేవి.

లాచీ — అవును. నా కవకాశం ఉంది.

కర్నల్ — అపరేషన్‌చేశాను. దానినించి కోలుకొన్నావు. కాని నీకు ఒకే మూత్రకోశం ఉండిపోయింది. అదికూడా మంచిది కాదు. నువ్వు ఆరోగ్యం గానే ఉన్నావనిపిస్తుంది నీకు. కాని నీ ఆమూత్రకోశం ఒకటిన్నీ కూలిపో తుంది.

లాచీ — అప్పుడు మీరేమి చేస్తారు ?

కర్నల్ — ఏమీలేదు. ఎవరికీ కొత్త మూత్రకోశం ఇవ్వలేము. సర్జరీకాని, ఔష ధాలుకాని చేసేసహాయం ఏమీలేదు. అర్థమైందా ?

లాచీ — (ఆగి) అవును. మరి మనిషో ?

కర్నల్ — అంతవరకు వేచుకొని ఉండాలి.

లాచీ — (శాంతంగా) ఎన్నాళ్ళు ?

కర్నల్ — ఇంకా ఒకటి రెండు వారా లుంది.

లాచీ — (ఒక్కక్షణం నిశ్శబ్దంగా ఉండి.) ఇంక నాకెక్కువ వ్యవధిలేదు.

కర్నల్ — ఇన్నాళ్ళు నీ కీసంగతి చెప్పలేదు. చెప్పినా దానివల్ల ప్రయోజనం లేదు. ఇప్పుడు నీతో ఇదంతా చెప్పవలసిందని ఆజ్ఞ అయింది.

లాచీ — (బిత్తరపోయి) నామీద మీకు కసిగా ఉందేమో అనుకున్నాను ఇన్నా ళ్ళున్నూ.

కర్నల్ — అలాంటి దెప్పుడూ లేదు. నామూత్రకోశం ఒకటి నీకిద్దును. నాకు రెండెందుకు ? చెప్పు, వెళ్తావా ?

లాచీ — నామెదడు స్తంభించిపోయింది. నేను కొంచెం ఆలోచించుకోవాలి.

కర్నల్ — G. H. Q. వాళ్ళు నువ్వు దేశానికి మరొక్క సేవ చేయవచ్చు నంటున్నారు. నిన్ను వాళ్ళు వీరుణ్ణి చేస్తారు. నిన్ను పెద్ద అట్టహాసంగా విమానంలో పంపిస్తారు. దానివల్ల నీకు వచ్చే దేమీ లేదని నాకు తెలుసు. కాని నువ్వు మరొకసారి స్కాట్లండు చూస్తావు. అలా కాదంటావా—ఇక్కడ నీస్నేహితులతో ఉండిపో.

(స్నేహితు లన్న మాటతో ఒక కొత్త తెలివిడివస్తుంది లాచీకి. మెల్లగా తల యెత్తుతాడు. తనప్రశ్నకు జవాబు వినడానికి భయపడుతూ మాట్లాడతాడు.)

లాచీ — వార్డులో ఉన్నవాళ్ళందరికీ నాసంగతి తెలుసునాండి ?

కర్నల్ — తెలుసు. సాధ్యమైనంతవరకు పరిసరాలూ, పరిస్థితులూ అన్నీ నీకోసం కులాసాగా ఉండాలని ఏర్పాటుచేశాను. నీకు సహాయం చెయ్యమని వాళ్ళతో చెప్పాను.

లాచీ — (గొంతుకు బొంగురుపడుతుంది) సిస్టర్‌కో ?

కర్నల్ — సహజంగా ఆమెకు తెలియవలిసే ఉంది.

లాచీ — (లేచి కిటికీవద్దకు వెళ్తాడు. కిటికీలోంచి దూరంగా బైటికి చూస్తాడు) నేను స్కాట్లండుకు తిరిగిపోతాను, సర్ !

కర్నల్ — (లేచి) రేపు ఉదయమే కలకత్తా చేర్చేస్తాను, అదే నీ అభిమతమైతే.

లాచీ — ఇదే నా అభిమతం.

కర్నల్ — ఈలోగా ?

లాచీ — నన్ను ఏకాంతంగా విడిచిపెట్టవలసిందని కోరుతున్నాను.

కర్నల్ — తప్పక....తప్పక. (లాచీవద్దకు వెళ్తాడు.) నీకు ఏదైనా వివేకవంతమూ ధైర్యప్రదమూఅయిన మాటలు చెపుదా మనుకొన్నాను.

లాచీ — (గిర్రున తిరిగి) నన్నుక్షమించండి. నామీద చాలామంది జాలిపడ్డారు. థాంక్ యూ.

కర్నల్ — నావల్ల నీకేమైనా అయ్యేదుంటే, వచ్చి నన్ను చూడు. (తిరుగుతాడు) నీకాగితాలూ అవీ సరిచూచి నువ్వెళ్లే ఏర్పాట్లు చేస్తాను. (బైటికి వెళ్తాడు. లాచీ గిర్రున తిరిగి స్క్రీను లాగి తనమంచంచుట్టూ అమర్చుకొంటాడు. డిగ్గర్, టామీ, కివీ, యాంక్ అందరూ ప్రవేశిస్తారు.)

డిగ్గర్ — మన ముసలికర్నల్ ఏమంటాడు, లాచీ ?

టామీ — (నవ్వుతూ) అమాత్రలు తినక్కరలేదని చెప్పింటాడు.

కివీ — మనలాటి ధైర్యంగా అతనిముందు నిలబడి వాదించడం నాకు నచ్చింది.

యాంక్ — (తనమంచం దగ్గిరికి వెళ్ళి, కెమెరా పట్టుకొని, ఫిల్ము బైటికితీస్తాడు.) లాచీ! ముసలికర్నలు మాటలు ఖరవాచేయకు. తనగొప్ప చూపించాలని ఉంటుం దతనికి. (పిల్ములు పట్టుకొని) వీటిని డెవలప్ చేయించుకొని వస్తాను.

(లాచీ ఒక ఇనుము ముంచుకు వేసి ఫిల్ములాక్కుంటాడు. ఫిల్ము విప్పి చెడగొట్టేస్తాడు.)

డిగ్గర్ — (తెల్లపోయి) అయ్యయ్యో! ఏంచేస్తున్నావు?

యాంక్ — ఏయ్, లాచీ! వాటిని చెడగొట్టకు.

లాచీ — (అగ్రహావేశంతో) నువ్వు నీమంచం దగ్గిరికి వెళ్ళిపోతావా లేదా?

యాంక్ — ఏమైంది నీకు, లాచీ!

లాచీ — మరోసారి నిన్నడగను. (స్క్రీనులోకి వెళతాడు. అందరూ ఒకళ్ళ మొహం ఒకళ్ళు చూచుకొంటారు. మార్గరెట్ ప్రవేశిస్తుంది. యాంక్ ఆమె దిక్కు తిరుగుతాడు.)

మార్గరెట్ — (ఆవేగంతో) అతనితో మాట్లాడారా మీరు?

యాంక్ — బొమ్మలన్నీ చెడగొట్టేశాడు. ఏం జరిగింది, సిస్టర్!

మార్గరెట్ — (స్క్రీనుకేసి చూస్తూ) కర్నల్ అతనితో అంతా చెప్పేశాడు.

యాంక్ — ఎందుకు చెప్పాడు?

మార్గరెట్ — డి. ఎమ్. ఎస్. ఆజ్ఞ. (స్క్రీన్‌దగ్గిరికి వెళ్ళి బైట నిలబడుతుంది.) అలాచెప్పడం తప్పని నాఅభిప్రాయం.

డిగ్గర్ — దానివల్ల అతనికేం ప్రయోజనం!

(లాచీ స్క్రీనులోంచి బైటికి వస్తాడు. కిల్టూ ఇతరబహుమానాలూ ఉన్నపెట్టె తీసుకువచ్చి యాంకు మంచంమీద ఉంచుతాడు.)

లాచీ — ఇవన్నీ ఎవరివి వాళ్ళ కిచ్చేస్తాను.

మార్గరెట్ — అతనిముందుకి వెళ్ళి, లాచీ!

లాచీ — (ఆమెవంక తిరిగి) రేపు ఉదయం వెళ్ళిపోతున్నాను. నీలో ఏమైనా మానమర్యాద లుంటే దయచేసి నాతో మాటాడవద్దు. నన్ను నామానానికి విడిచిపెట్టెయ్యండి. (స్క్రీనువెనకాల. తక్కినవాళ్ళవంక తిరిగి) నేనెవ్వరినీ చూడదలచుకోలేదు—మీలో ఎవ్వరినీకూడా.

యాంక్ — ఒక్కనిమిషం ఆగు లాచీ !

లాచీ — నామీద చెయ్యివేశావంటే నీమొహం పగలగొట్టేస్తాను.

మార్గరెట్ — (బాధతో కూడిన గొంతుతో) లాచీ, నీకు మాఅవసరం పడుతుంది; మాఅవసరం పడుతుంది.

లాచీ — నాకెవ్వరూ అక్కరలేదు. (వాళ్ళవంక అతను చూచేటప్పటికి ద్వేషంతో నిండిఉంది అతనిమొహం) మీరూ అందరిలాంటివాళ్ళేనని నేను తెలుసుకోవలసింది. సరే, మీరు నాస్నేహం సులభంగా కొనుక్కొన్నారు—కిల్లుధరతోను (స్క్రీనులోకి వెళ్తాడు) నాఆత్మగౌరవంమీద ఇంకా పెద్దవిలువ పెట్టవలసింది నేను. మీరు నామీదజాలీ, మంచితనం చూపించి మహాపుణ్యాత్ములనుకొన్నారు కదూ! (స్క్రీనులోపల అడుగుపెడ్తాడు. అందరూ నిశ్శబ్దంగా నిర్ఘాంతపోయి నిలబడతారు.)

తెర వాలుతుంది

---

## రెండో రంగం

మరునాడు ఉదయం

స్క్రీనులు తీసేసి ఉన్నాయి. లాచీ తనసంచి సర్దుకొంటున్నాడు.

ఎక్కడివాళ్ళక్కడ తమతమ మంచాలమీద నిశ్శబ్దంగా కూర్చొని ఉన్నారు. యాంకూ, లాచీ బ్రిటిష యుద్ధ దుస్తుల్లో ఉన్నారు. మార్గరెట్ ప్రవేశిస్తుంది.

మార్గరెట్ — యాంక్, ఆఫీసర్ కమాండింగ్ నీకాగితాలమీద సంతకంపెట్టాడు. (కాగితా లిస్తుంది.)

యాంక్ — నేనెప్పుడు వెళ్ళవచ్చు ?

మార్గరెట్ — సాయంకాలానికి ముందుమాత్రం కాదు.

యాంక్ — (లాచీ పరుపూ అదీ చూపిస్తూ) ఇత నెప్పుడు వెళ్తాడు ?

మార్గరెట్ — కొన్ని నిమిషాలలో. (బైటికి వెళుతూ) టిఫిన్ ప్లేట్లన్నీ పోగు చేస్తావా ? (బైటికెళ్ళుతుంది.)

(యాంక్ తన కాగితాలు బల్లమీద ఉంచుతాడు. ప్లేట్లు అన్నీ పోగుచేసుకుంటూ తిరుగుతాడు.)

టామీ — సిస్టరుకు పడిశం పట్టినట్టుంది, కదూ ?

యాంక్ — నేను కనిపెట్టలేదు. (డిగ్గర్ దగ్గిరికి వెళతాడు.)

డిగ్గర్ — నేను ఇంతకంటె రుచైన టీ చేస్తాను.

(యాంక్ డిగ్గర్ ప్లేటు తీసుకొని కివీదగ్గిరికి వెళ్తాడు.)

కివీ — నువ్వెళ్ళిపోయాక ఈపని నాకు వస్తుందను కొంటాను.

యాంక్ — అది సాధ్యమే. (కివీ ప్లేటుతీసుకొని, లాచీ డిష్‌కోసం వెళ్తాడు. లాచీ అతనికేసి చూడడు.) నీప్లేటుకోసం వచ్చాను. (లాచీ తనసంచిలో తువాలు కుక్కుతాడు.) నీటిఫిన్ చల్లారిపోతుంది. (లాచీ మాటాడడు) టిఫిన్ అక్కరలేదా ? (లాచీ జవాబివ్వడు. యాంక్ ప్లేటు తీసుకొంటాడు.) నువ్వు కొన్నినిమిషాల్లో వెళ్ళిపోతావని సి....సి....సిస్టర్ అంటుంది.

లాచీ — అవును.

యాంక్ — ఏదైనా సహాయం కావాలా !

లాచీ — ఏమీ అక్కరలేదు.

యాంక్ — నేనూ ఈవేళ సాయంకాలం వెళ్ళిపోతున్నాను. కాని నువ్విక్కడ ఉండిపోయావా నా రెండువారాల సెలవా ఇక్కడే గడుపుతాను. నువ్విష్టపడితేనే. (జవాబులేదు) నువ్వు వెళ్ళిపోవడం నాకు చాలా దుఃఖంగా ఉంది. (ఇంకా జవాబులేదు) వ్యవహారా లేమీ అంత చెడిపోవని ఆశిస్తాను. (చెయ్యిస్తాడు.) సెలవు తీసుకుంటాను. (ఆగుతాడు.)

లాచీ — చెప్పవలసింది చెప్పావు కదా ?

(యాంక్ వెళ్ళిపోతాడు. ప్లేట్లు తీసుకు వెళ్తూ తలుపుదగ్గిర మార్గరెట్‌ను కలుస్తాడు. మీది డిష్‌లో టిఫిన్ తినకుండా అలాగే ఉన్నది చూస్తుందామె. యాంక్ తలపంకిస్తాడు. ట్రేతీసుకు బైటికి వెళ్ళిపోతాడు. మార్గరెట్ లాచీమంచం దగ్గిరికి వచ్చి నిలబడుతుంది.)

మార్గరెట్ — ఇవిగో నీకాగితాలు, లాచీ! (లాచీ తీసుకోడు. ఆమె పరుపుమీద పెట్టేస్తుంది.) బండి సిద్ధంకాగానే కబురంపిస్తా రిక్కడికి.

లాచీ — (ఆమెకేసి చూడకుండా) ఒక్కక్షణంలో తయారైపోతుంది నాకిట్లు.

మాంక్ — (తువా లొకటి పట్టుకొని ప్రవేశిస్తాడు. కొంచెం సహాయం చేస్తారా ?
(బైటికి వెళ్తాడు.)

శివీ — (లేచి తలుపుదగ్గిర నిలబడి) కొంచెం సహాయం చేస్తారా ?

టామీ — (అతనివెనకాలే వెళ్ళి నిలబడి) కొంచెం సహాయం చేస్తారా ?

(డిగ్గర్ లేచి వాళ్ళతో కలుస్తాడు తలుపు వేసుకుపోతారు.)

మార్గరెట్ — (ఏకాంతంగా ఉండటం చూసుకొని) ఇక్కడ కొంచెం ఆగి నీతో మాట్లాడవచ్చునా ?

లాచీ — చెప్పవలసిం దేమీలేదు.

మార్గరెట్ — (మాంక్ పరుపుమీద కూరుచుంటుంది.) నామొండి ప్రియుడా ! నామాట విను నీతో మాట్లాడ్డానికి నాకు మరో అవకాశం దొరకదు.

లాచీ — (ప్రశాంతంగా) మాట్లాడవలసింది ఏమీ లేదు.

మార్గరెట్ — నీకు ఈఅశాంతి, ఈఅసుఖం లేకుండా చేద్దామని పాటుపడ్డాము. ఇది ద్రోహం అంటావా ?

లాచీ — నేను కోల్పోయినన్ని సంగతి మరచిపోయావా ? నేను ఎన్నిసార్లు చావు నెదుర్కొన్నానో మీరు తెలియదా ?

మార్గరెట్ — మిమ్మల్ని ద్వేషిస్తూ నువ్విక్కడనించి వెళ్ళిపోడానికి వీలులేదు.

లాచీ — (తనసంచి కట్టి పక్కమీద పెడతాడు.) నన్ను మీ రాపుచెయ్యలేరు.

మార్గరెట్ — మా కీసంగతి మొదట తెలిసినంతమాత్రాన నిన్నుగురించి మాభావా లేవీ నిజం కావని, ఇదంతా కపట నాటకమనీ అనుకొంటున్నావా ?

లాచీ — ఈ ప్రశ్నకు సత్యంతోకూడిన జవాబు నువ్విప్వడానికి సాహసిస్తావా ? (ఆమెవైపు చూస్తాడు. అతని కళ్ళల్లో కోపం కనిపిస్తుంది. గుండె గాయ పడ్డవాడిలా ఉంటాడు.)

మార్గరెట్ — మాకు తెలుసు కాబట్టి మేము ఎక్కువ శ్రద్ధ తీసుకొన్నాము. నువ్వంటే, అశ్రద్ధే చూపిస్తే మేం ఎలాంటి వాళ్ళమై ఉండుం ?

లాచీ — మీరెలాంటి వాళ్ళయి ఉంటారో నేనే ఊహించవలసింది. ప్రపంచంలో ఎక్కడైనా సులభంగా దొరుకుతారు మీలాంటి వాళ్ళు. వీళ్లైతే మీదపడి కొట్టేవాళ్ళు, దోచుకొనేవాళ్ళు, వెంటాడేవాళ్ళు, అపవాదాలు వేసేవాళ్ళు, ద్రోహంచేసేవాళ్ళు — ఇదంతా మంచి అనుకొనేవాళ్ళు—అతను చచ్చిపోతూ ఉంటేతప్పు. అప్పుడు మీరు భయపడిపోతారు. మీఅంతరాత్మ మంచివైపు మిమ్మల్ని తోలుతుంది. మీ ఈ పుణ్యకార్యాలు ఒకపశువుకు కూడా

అర్హమైనవి కావనుకొంటాను. మీరు నాకు చేసిన దానికి మీకు కృతజ్ఞతకూడా చూపదలచుకోలేదు.

మార్గరెట్ — నువ్వు మమ్మల్ని ఎలాభావించినా, లాచీ! మేము నీస్నేహితులమే. ప్రపంచంలో నీకు స్నేహితులం కేవలం మేమే సుమా! మమ్మల్ని చులాగ్గా చూడకు. మాతో ఉండిపో.

లాచీ — నేను నాతోటిమానవులను సరిగ్గా అర్థంచేసుకో లేదని కొంచెంసేపటివరకూ నాచేత అనిపించావు. చచ్చిపోవడానికి నాకు ఒకమూర్ఖుడిమతం ఇచ్చావు. నాలో నువ్వెంతదోషం రగుల్కొల్పావో నీకు తెలిస్తే బాగుండేది.

మార్గరెట్ — నీమీద మేమింత దయగా ఉండడానికి ఒకే కారణం మాకిది మొదట తెలియడమే అనుకుంటావా?

లాచీ — మీరు చేసినదానికి అది కొంతవరకైనా కారణమని ఒప్పుకొంటావా? (ముందుకు నడిచి మళ్ళా వెనక్కి వస్తాడు) అదే మిమ్మల్ని పురికొల్పలేదా?

మార్గరెట్ — లేదు. అది నేను నిరాకరించను.

లాచీ — నేనంటే ఇష్టపడడం సాధ్యమా?

మార్గరెట్ — కాదు. సాధ్యంకాదు.

లాచీ— (కేకలు వేస్తూ) నేను చచ్చిపోతున్నా ననే కారణంచేత మీరందరూ నామీద దయ తలిచారని నేను గర్వించేదా?

మార్గరెట్ — అదొక్కటే కారణమైతే వద్దు.

లాచీ — ఒకపుస్తకం రాస్తాను నేను. బైబుల్ బోధిస్తాను. నాఇల్లు నాఅన్న దమ్ముల కిస్తాను. ఇవన్నీ నేను అంటూవుంటే మీరు ఎంతసరదాగా నవ్వుకొందురో!

మార్గరెట్ — (లేచి) లాచీ, లాచీ, నామాట శ్రద్ధగావిను. ఇదొక్కటి తప్ప తక్కిందంతా మరచిపో. కొద్ది సెపటివరకు స్నేహం అంటే ఏమిటో తెలుసుకొన్నావు. నువ్వనలేదూ, రాజులతో సమానమైన ఆనందం ఒక్కనిమిషంపాటు అనుభవించానని.

లాచీ — నాతోటి మానవుల్ని ప్రేమించడం నేర్చుకో నేను చావవలసేవస్తే వాళ్ళు లేకుండానే ఉంటాను. దానికోసం ఇది చాలా పెద్దధర.

మార్గరెట్ — ప్రియుడా! మనుష్యులు దయతో ఏకారణంవల్ల ఉంటారో మన కెందుకు? దానివల్ల సౌహార్దంలో కలిగే భేద మేముంది?

లాచీ — (తనమంచందగ్గిరికి వచ్చి తిన్నగా నిలబడతాడు.) నాసర్దుకోడం అయిపోయింది.

మార్గరెట్ —నిన్ను ముద్దెట్టుకొని సెలవుతీసుకొంటే నువ్వుయిష్టపడతావా ? నువ్వు నన్ను భార్య ఏవుతావా అని అడిగావు తెలుసా ?

లాచీ — దయచేసి నన్నిలా ఎడిపించెట్టు. (గిర్రున తిరిగి కిటికీ దగ్గిరికి వెళ్తాడు. ఆమెవైపు వీపుచేసి నిలబడతాడు.)

మార్గరెట్ — నీమీద జాలిచేతనే నిన్ను పెళ్ళిచేసుకుంటానని చెప్పా నంటావా ?

లాచీ — నామీద నీకు జాలికలగలేదా ?

మార్గరెట్ — హృదయపూర్వకంగా. ప్రతిస్త్రీ ప్రేమలోనూ జాలిఉంయింది.

లాచీ — (తిరస్కారంగా) ని న్నేమనాలో నాకు మాటలుకూడా రావడంలేదు.

మార్గరెట్ — (నిస్పృహతో) నీకిట్లుపట్టుకు వెళ్లమని యాంకుతో చెపుతాను. (తలుపుదగ్గిరికి వెళ్లబోతుంది ) యాంక్ ! (మళ్ళా కొన్ని అడుగులు లాచీ వైపు వస్తుంది.) ఇప్పుడు — నువ్వువెళ్ళేముందు — నిన్ను పెళ్ళిచేసుకుంటే నీకేమైనా మనశ్శాంతి కలుగుతుందా ?

లాచీ — కలగదు.

(యాంక్ మెల్లగా వస్తాడు. అతను తనపక్కనించి వెళ్లుతుంటే మార్గరెట్ మాట్లాడుతుంది.)

మార్గరెట్ — నేను అతనికోసం బండి ఏర్పాటు చేసేంతదాక అతని కిట్లూ అవీ బండిలో చేర్చడానికి నువ్వు సహాయపడాలి. (బైటికి వెళ్ళిపోతుంది. యాంక్ లాచీ సంచి పట్టుకోడానికి వెళ్తూ ఉంటే డిగ్గర్ వస్తాడు.)

లాచీ — నాకేమీ సహాయం అక్కరలేదు.

(యాంక్ నిశ్శబ్దంగా అతని వంక చూస్తాడు. తిరిగి మంచం మీద కూచుంటాడు. కెమెరాలో కొత్తఫిల్ము వేస్తూ ఉంటాడు.)

యాంక్ — కెమెరాలో ఫిల్ము బిగిస్తాను.

డిగ్గర్ — దాన్ని ఉపయోగించేవేళ నీకెలాగా ఉండదు.

(టామీ, కిపీ ప్రవేశించి తమ పరుపులమీద నిర్విణ్ణులై కూచుంటారు.)

యాంక్ — మన గాంగ్ బొమ్మలు తీసుకొంచాము—నేను వెళ్ళేముందు అను కొన్నాను.

డిగ్గర్ — నన్ను వొదిలెయ్యండి. నాకు ఫోటోలు తీసుకోవాలని ఇప్పుడు లేదు.

(బ్లాసమ్ లాచీ ఉన్న చోటికి వస్తాడు. కిట్లూ అవన్నీ ప్యాక్

కాషాయం చూచి వెళ్ళిపోతున్నాడనుకొని పెడ్తాడు. తన జేబులోంచి ఫ్రాంకుల సంచి తీసి లాచీకి ఇవ్వబోతాడు.)

బస్టర్ — బ్లాసమ్. (లాచీ అతనివైపు చూడడు. బ్లాసమ్ కొంచెం ఆగి ఫుల్ఫా తన బహుమానం ఇవ్వడానికి చెయ్యి చాస్తాడు.) బస్టర్ (మృదువుగా లాచీ చెయ్యిపట్టుకుని, చేతిలో పూస ఉంచబోతాడు. బ్లాసమ్ మొహంమీద లాచీ తిప్పికొడ్తాడు. బ్లాసమ్ నిర్ఘాంతపోయి, వెనక్కి వెళ్తాడు. అవమానం, ఆశ్చర్యం పెనగులాడతాయి అతనిలో.)

లాచీ — నన్నిలా విడిచిపెట్టండి!

(అందరూ లేస్తారు. యాంక్ ఒక్క ఎగురు ఎగిరి లాచీని ఆపుతాడు. అతని కళ్ళల్లో క్రోధం మండుతుంది.)

యాంక్ — (అపాదమస్తకం కంపిస్తూ ఆగ్రహావేశంతో) నువ్వు వెళ్ళేముందు నేనొక మాట చెప్పదలచుకొన్నాను. నీలో నీచమైన అంశ ఉంది. దానికి మందు తుపాకీగుండే. నీజీవితమంతా దారుణంగా ఉన్నావు. దాని కారణం నీకు ప్రతిదీ సులభంగా దొరకలేదని. ఆ కోపం అంతా నీకు కనిపించిన వాళ్ళందరిమీదా తీస్తున్నావు. నీకు మా స్నేహం అక్కరలేదు. నువ్వు మా స్నేహం ఏమైనా ధరఇచ్చి కొనుక్కున్నావా? ఉత్తుత్తనే మా స్నేహం లభించింది. మరి, ఈ గడబిడంతా ఏమిటి? నువ్వు ఎప్పుడు చస్తావో నీకు తెలియదని ఆక్రోశిస్తున్నావు. ఆ సంగతి అలా విడిచిపెట్టు. ఎవరెప్పుడు చస్తారో ఎవరికైనా తెలుసా? లేదు. కాని నీకు తెలుపవలసివచ్చింది. బాగా తెలిసినదాన్ని గురించి పందెం వేసే మొగాడివి నువ్వు. ధైర్యమంటే ఏమిటో నీకు తెలియదు. నువ్వు పుట్టిన నాటినుంచి బతకడానికి భయపడుతున్నావు. జీవితం అంటే ఏమనుకొన్నావు? బస్టర్!—

లాచీ — మీరు నన్ను మోసంచేశారు. నేను మీతో స్నేహం చేశాను. మీరు నాకు చూపింది స్నేహంకాదు; జాలి.

యాంక్ — బ్లాసమ్‌కూడా నువ్వంటే జాలిపడ్డాడా? నువ్వు చస్తానన్న సంగతి వాడికి తెలుసా? నువ్వంటే అతడు ఇష్టపడ్డాడు, నీకేదో ఇవ్వాలనుకొన్నాడు. నువ్వేం చేశావు? అతని స్నేహం అతని మొహంమీద వేసి కొట్టావు. నువ్వు చచ్చిపోతూ ఉండటం చాలా మంచిపనైంది. నీలాంటివాడు ప్రపంచంలో చాలా దుఃఖం వ్యాపింపజేస్తాడు. నాచేతనైతే ఈచావునుంచి నిన్ను ఎప్పుడూ తప్పించను. నాభావాలు దాచకుండా చెప్పేశాను. (తనమంచంకేసి దూసుకు

పోతాడు. కెమెరాతో ఏవో కిందా మీదా పడుతుంటాడు. లాచీ మెల్లగా లేచి గ్లాసమ్ వైపు తిరుగుతాడు. అతని మంచంకింద కూలిపోతాడు. పెదవులు విసుపుగా మూసుకొని ఉంటాయి.

డిగ్గర్ — (మృదువుగా) అతని విషయంలో కొంచెం కఠినంగా ప్రవర్తించావుకదూ!

(మార్గరెట్ తొందరగా ప్రవేశించి, తిన్నగా యాంక్ దగ్గరికి వెళ్తుంది.)

మార్గరెట్ — యాంక్! ఏమిటా కేకలు?

యాంక్ — అపిచ్చివాడు గ్లాసమ్‌ను కొట్టాడు.

మార్గరెట్ — ఎందుకు?

యాంక్ — అతడు వెళ్ళిపోతున్నాడని చూచి గ్లాసమ్ ఫ్లూట వాయించబోయినందుకు.

మార్గరెట్ — మరేం పరవాలేదులే. (లాచీవైపు వస్తుంది.) లాచీ! సమయం వచ్చింది. సిద్ధంగా ఉన్నావా? (లాచీ మాట్లాడకుండా కూచుంటాడు.) వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నావా?

లాచీ — ఆఁ!

మార్గరెట్ — యాంక్! అతని కిట్టు కొంచెం పట్టుకుంటావా?

యాంక్ — పట్టుకోను. వాడికి ఎవడి సహాయమూ అక్కరలేదు. వాడే చేసుకోమను అదంతా.

మార్గరెట్ — అతనికి సహాయంచేసే చివరిఅవకాశం ఇదే.

యాంక్ — వాడు వెళ్ళడు. తాను తప్పు చేశానని తెలుసతనికి. కాని వాడెంత పెంకి ఘటం అంటే ఒంటరిగా వెళ్లి చస్తాడు కాని తాను తప్పు చేశానని ఒప్పుకోడు. నేను రాను.

మార్గరెట్ — (డిగ్గర్‌వైపు తిరుగుతుంది.) డిగ్గర్? (డిగ్గర్ కదలడు.) సరే, బసుదాకా నడుగుతాను.

లాచీ — (లేస్తాడు) నాకు సహాయం అక్కరలేదు. ఒంటరిగానే వెళతాను. (కిట్టు పట్టుకొని బయలుదేర్తాడు. తల వంచుకొని మెల్లగా నడుస్తూ ఉంటాడు. మార్గరెట్ అతణ్ణి ఒక్కక్షణంకోసం ఆపుతుంది.)

మార్గరెట్ — లాచ్లెన్! గుడ్‌బై!

(ఒక్కక్షణం ఆగి తలుపువైపు నడుస్తాడు.)

యాంక్ — (తటాలున లేచి నిలబడి బిగ్గరగా గబగబా మాట్లాడ్తాడు.) ఇప్పుడు వీడు వెళ్లిపోయాడు కాబట్టి రండి, మనం ఫోటోలు తీసుకుందాం రండి.

కివి! టామి! డిగ్గర్! బ్లాసమ్! (మార్గరెట్ చేతిలో బలవంతంగా కెమెరా పెడ్తాడు.) ఇదిగో, సిస్టర్! మాఫోటోలు తియ్యి. (అందరినీ ఒకచోట చేరుస్తాడు.) రండి. అందరూ ఇక్కడ కూడండి.

(అందరూ ఒకచోట చేరి మార్గరెట్‌కు అభిముఖు లౌతారు. వెనక్కి తిరిగి లాచీ వాళ్ళను చూచి గొంతు సవరించు కుంటాడు.)

లాచీ — మీరు నావిషయంలో అపచారం చేశారని ఒప్పుకుంటే నే నుండిపోవడం గురించి ఆలోచిస్తాను.

యాంక్ — చూడూ, నిన్నిక్కడ ఉండమని మేం బతిమాల్తా మనుకున్నావా? ఉత్త నీకాలం వ్యర్థ మనుకో. (మార్గరెట్‌తో) సిస్టర్, ఫోటో తీసుకో.

లాచీ — మీకు మరో అవకాశ మివ్వను.

యాంక్ — (వినిపించుకోకుండా) మేం సిద్ధంగా ఉన్నాం, కాని సిస్టర్!

లాచీ — (కిట్ కిందపారేసి డిగ్గర్ పరుపుమీద బ్యాగ్‌పైప్ ఉంచుతాడు. మార్గరెట్ వైపు దూసుకువెళ్తాడు.) నా అనుజ్ఞ లేకుండా ఆఫిల్ము ఉపయోగించడానికి వీల్లేదు.

యాంక్ — (అతనివెనకాలే వెళ్లి) చూడు. మేం నిన్నేమీ అడగడంలేదు : సహా పణగాని, ఫిల్ముగాని.

లాచీ — (యాంక్‌కు అభిముఖుడై—ముక్కూ ముక్కూ కలిపి) నీకు జ్ఞాపక ముండే ఉంటుంది—నువ్వు ఉపయోగిస్తున్న ఫిల్మ్ నా స్వంత ఆస్తి. దాని కోసం నీకు డబ్బిచ్చాను.

యాంక్ — నీడబ్బు నీకిచ్చేస్తాను.

లాచీ — అది నాహక్కు. నేను డబ్బు తీసుకోను.

యాంక్ — జెనెసెస్, ఎక్సోడస్, లెవెటికస్...............

కివీ — యాంక్!

మార్గరెట్ — లాచీ! అంత కసి పడకు. నామాట విను.

యాంక్ — (మార్గరెట్ చేతిలోంచి కెమెరాతీసుకొని విప్పడ మారంభిస్తాడు.) ఆహా! వాణ్ణి తీసుకోనీ. నరకంలో పడ్డీవాడు. (లాచీవైపు తిరిగి) కాని ఒక్కటి తెలుసుకోవాలని ఉంది : ప్రపంచంఅంతా అసహ్యించుకొంటూ ఉండగా స్నేహితులొక్కరూ లేకుండా చావడానికి సిద్ధపరిచా రేమిటి?

లాచీ — (యాంక్‌వైపూ, మార్గరెట్‌వైపూ, తక్కినవాళ్లవైపూ చూస్తాడు. వాళ్ల కళ్లల్లో ఎక్కడా లొంగిపోయే సూచనలు కనిపించవు. తన పక్క చివర

కుంగిపోయి, చేతులతో కళ్లుమూసుకుంటాడు. ఒక్కక్షణం తర్వాత మాట్లాడతాడు.) నేను ఏకాకిగా చావదలచుకోలేదు.

మార్గరెట్ — (అతనిపక్క మోకరిల్లి, అతనిభుజంమీద చెయ్యిపెడుతుంది) లాచ్లెన్ ! నువ్వు చెప్పగోరిందేదో చెప్పరాదూ ! (అతనిచుట్టూ చెయ్యి పెనవేస్తుంది) నువ్వనుకోని మాటలు చెప్పడం మానేయి.

లాచీ — (మెల్లగా లేచి కిటికీదగ్గిరికి వెళ్తాడు. అందరివైపూ వీపుచేసి మాట్లాడతాడు.) మిమ్మల్ని చూడ్డం నాకు సులువుకాదు. నాకు దొరకని ప్రతివస్తువునీ జీవితమంతా ద్వేషించాను. అది నాఆత్మాభిమానం నిలబెట్టింది. ఇప్పుడు నాఆత్మాభిమానం కోసం సద్భావం పోగొట్టుకోడానికి తీరికలేదు. (అందరికీ ఎదురుగా తిరుగుతాడు. జీవితంలో మొదటిసారి నమ్రుడౌతాడు.) నేను ఇక్కడే ఉండిపోదలుచుకున్నాను. నన్ను మళ్లా పరిగ్రహించమని మిమ్మల్ని బతిమాలవలసివస్తే బతిమాల్తాను. నాపరుపు నాకిస్తారా ?

యాంక్ — (నిష్ఠురంగా) బస్టర్ ! నీలిదుస్తు లెందుకు తొడుక్కోవు ?

మార్గరెట్ — నాఆఫీసులో పోయి మార్చుకో.

(లాచీ మెల్లగా తన పరుపు దగ్గిరికి వెళ్తాడు. నీలిదుస్తులు తీసి మార్గరెట్ ఆఫీసులోకి వెళ్తాడు. అతను వెళ్ళేవరకూ ఎవ్వరూ లేవరు. తర్వాత యాంక్ కూచుంటాడు.)

యాంక్ — నాతల్లి ఉంటే బాగుండేది. ఆమెను ఒక్కతాపు తన్ని పళ్లూడగొట్టాలని ఉంది.

డిగ్గర్ — (లాచీ బ్యాగ్‌పైపు చూపిస్తూ) బ్యాగ్‌పైపు వాయిస్తే అతనికి ఇంకా బాగుంటుందనుకుంటావా ?

టామీ — బ్యాగ్‌పైప్ వాయించలే దనుకుంటాను. అతనిలో ఏమీ ఊపిరి ఉన్నట్టులేదు.

డిగ్గర్ — కొంచెం పాలిపోయినట్టు కనిపిస్తాడు.

కివీ — సిస్టర్, కొంచెం లోపలికి చూచిరా.

మార్గరెట్ — అక్కరలేదు. (దీర్ఘంగా ఊపిరితీస్తుంది.) అతను తనఆత్మాభిమానం మింగేశాడు. దాన్ని అరిగించుకోడానికి ఒకటి రెండు నిమిషాలు పడుతుంది.

యాంక్ — ఫోటోలు తీసుకొనే పని పూర్తిచేద్దాం.

మార్గరెట్ — కానివ్వండి. ఈపని పూర్తి చేద్దాం.

యాంక్ — (మార్గరెట్ చేతికి కెమేరా ఇస్తాడు.) తెల్లటి పెదగడ్డాలు వచ్చేముందే.

(అందరూ ఫోటో కోసం తమతమ స్థానాల్లో నిలబడతారు. బ్లాసమ్ పూసలు. మార్గరెట్ ఏరి. లాచీపరుపుమీద వేస్తుంది.)

మార్గరెట్ — (కెమెరాలో చూస్తూ) దగ్గరగా నిలబడండి.

టామీ — సిస్టర్, మేమందరం చాలా అందంగా ఉన్నాంకదూ.

మార్గరెట్ — నిన్ను చూడలేకపోతున్నాను. (మరోసారి చూస్తుంది.) అంత అందంగా కాదు, కాని ఎంతో అద్భుతంగా ఉన్నారు.

కివీ — సరే, నీ కెంతకనిపిస్తుందో అంతే తీ. నాకాళ్లు నొప్పెడుతున్నాయి.

మార్గరెట్ — ఒకటి....రెండు....(మూడు అనకముందే లాచీ తలుపుతీసి వాళ్లకి ఎదురుగ్గా నిలబడతాడు. కిల్టుతొడుక్కొని ఉంటాడు. అందరినీ చూస్తూ నిలబడతాడు. అందరూ అతడు మాట్లాడతాడని నిరీక్షిస్తారు.)

లాచీ — మీతో ఫోటోలో నన్నుకూడా ఉండనిస్తారా? (ఎవ్వరూ మాట్లాడరు.) ఆఫిల్ము నాది. (చప్పున) అది మీరు యోచించనక్కరలేదనుకోండి.

యాంక్ — (తనపక్క నుంచోమని సంజ్ఞచేస్తూ) నీస్థాన మిది. (లాచీ తనమంచం మీద ఉన్న పూసలు ఎత్తుకుంటాడు. బ్లాసమ్ చిరునవ్వు నవ్వుతాడు. లాచీ చేతిలో ఉన్నటోపీ తొడుక్కుంటూ, యాంక్ పక్క తనస్థానంలో నిలబడతాడు.)

మార్గరెట్ — స్థిరంగా ఉండండి....(ఆమె కెమెరాలో చూస్తూ ఉండగా యాంక్ లాచీ భుజంమీద చెయ్యిపెడతాడు. లాచీ తన తల యాంక్ వైపు వంచుతాడు. ఎవ్వరూ చిరునవ్వు నవ్వడంలేదు. లాచీమాత్రం మెల్లగా, అప్రయత్నంగా చిరునవ్వు నవ్వుతాడు—తన జీవితకాల మంతా దాచి ఉంచుకున్న చిరునవ్వది. తన ముందు చేతులు క్రాసుగాగుంచి నిలబడతాడు. సంతృప్తిగా నిట్టూరుస్తాడు.) ఒకటి....రెండు....మూడు. ఐపోయింది.

(లాచీ యాంక్ వైపు చూస్తాడు. తర్వాత అకస్మికంగా ఒక్క కేక వేసి గాలిలోకి ఎగురుతాడు. గిర్రున తిరిగి టామీకి ఎదురుగా తన కిల్టు వెనక్కి రెండు చేతులతోనూ నొక్కుతాడు.)

లాచీ — సహాయం చెయ్యండి! అలా చెయ్యకండి మరోసారి.

(అందరూ ఎక్కడి వాళ్ళక్కడికి వెళ్ళిపోతారు. టామీ మాత్రం మంచంపై మోకాళ్ళమీద పడుకుని ఉన్నట్లు కనిపిస్తుంది.)

టామీ — పిల్లి కానరీపిచ్చికను తినేసింది. నేను కనిపెట్టాను. దాన్ని పొడిచాను. నేను కనిపెట్టాను.

తెరపడుతుంది.

---

# దేశభక్తులు

రచన

సి డిస్సా కింగ్స్లి

# పాత్రలు

కెప్టెన్
థామస్ జెఫర్సన్
ప్యాట్సీ
మార్తా
జేమ్సు మాడిసన్
అలెగ్జాండర్ హామిల్టన్
జార్జి వాషింగ్టన్
సార్జంట్
కల్నల్ హంఫ్రీస్
జాకబ్
నెడ్
మేట్
జేమ్సు మన్రో
మిసెస్ హామిల్టన్
హెన్రీ నాక్సు
బట్లర్
మిస్టర్ ఫెనో
జ్యూపిటర్
మిసెస్ కన్‌రాడ్
ఫ్రాంటియర్స్‌మన్
థామస్ జెఫర్సన్ రాండాల్ఫు
ఆనీ రాండాల్ఫు
జార్జి వాషింగ్‌టన్ లఫాటే

# దే శ భ క్తు లు

## ప్ర వే శి క

1790 ఓడలో డెక్కు పైభాగం. నక్షత్రాల వెలుగుతో నిండిన రాత్రి. తెరచాపల్లో గాలినిండి ఉంది. ప్రవాహం వేగంగా ఉంది తెరచాపత్రాళ్ళు కిర్రుమంటున్నాయి.

ఒక మధ్యవయస్కుడూ, ఒక బాలికా ఓడ కటకటాలకు ఆని నిలబడి సముద్రంవైపు చూస్తున్నారు. జెఫర్‌సన్, అతని కూతురు ప్యాట్సీ. అతను పొడుగ్గా సన్నంగా ఉన్నాడు. మొహం మృదు ప్రకృతిని సూచిస్తుంది: సౌమ్యత ఉట్టి పడుతూ ఉంది ఆ కాలంలో అందరూ సామాన్యంగా తొడిగే విగ్గు లేకుండానే ఉన్నాడు. ఎర్రని అతని జుత్తు గాలికి చిందరవందర అయి ఉన్నది. అక్కడక్కడ ఒక తెల్ల వెంట్రుక కనిపిస్తుంది. బాలిక మంచి యవ్వనంలో ఉంది. అందంగానూ, చురుకుగానూ ఉంది. నాన్నకు కొంచెం దూరాన చుక్కానిమనిషి నీడలో చుక్కాని తిప్పుతున్నాడు.

(కెప్టెన్ వస్తాడు.)

కెప్టెన్ — నమస్కారమండి.

జెఫర్సన్ — నమస్కారం, కెప్టెన్ !

ప్యాట్సీ — నేల సమీపిస్తున్నామా, కెప్టెన్ ?

కెప్టెన్ — ఇలాగే సరిగ్గా నడిస్తే, మనస్సు తొందరపడుతుందా ?

(ప్యాట్సీ నవ్వుతుంది)

జెఫర్సన్ — ఇంటివైపు ప్రయాణంలో తోవ గడవనట్టే ఉంటుంది, ఎప్పుడూ అంతే కదూ ?

కెప్టెన్ — అప్పుడప్పుడు మామూలుకంటే దూరంగానే కనిపిస్తుంది. (ఆకాశం వైపు చూస్తాడు.) కొంచెం దుడుకు గాలివీస్తుందేమోనండి. లోపలికి వెళ్ళడం

మంచిదనుకుంటాను. (సెల్యూట్ చేసి వెళ్ళిపోతాడు. ప్యాట్సీ, జెఫర్సన్ సముద్రంకేసి చూస్తూ నిలబడతారు.)

ప్యాట్సీ — ఇల్లు నాజ్ఞాపకంలో ఉన్నట్టే ఉంటుందా అని ఆలోచిస్తున్నాను.

జెఫ — అంత పెద్దదిగా ఉండదనుకుంటాను. మేము ఇల్లు విడిచిపోయినప్పుడు నువ్వు చిట్టితల్లివి.

ప్యాట్సీ — అబ్బ! ఎన్నాళ్ళలా అనిపిస్తుంది!

జెఫ — అవును కదూ?

ప్యాట్సీ — ఆశ్చర్యం! మనం ఇప్పుడు ఇంటికి వస్తుంటే ప్యారిస్‌లో మనం గడిపిన సంవత్సరాలన్నీ ఒక్కసారి మాయ అనిపిస్తున్నాయి. కదూ, నాన్నా?

జెఫ — అవును.

(ఆమె నిట్టూరుస్తుంది. జెఫర్సన్ ఆమెవైపు చూస్తాడు—చిరునవ్వుతాడు).

ప్యాట్సీ — మనం మొదట న్యూయార్క్ వెళుతున్నాముకదూ?

జెఫ — (తల ఊపుతాడు) తిన్నగా మాంటిసెల్లోకు.

ప్యాట్సీ — మొదట నువ్వు ప్రెసిడెంట్ వాషింగ్టన్‌ను చూస్తావనుకున్నాను.

జెఫ — ముందు ఇంటికిపోయి నీపెళ్ళి సన్నాహాలు చేద్దాము.

ప్యాట్సీ — ప్రెసిడెంట్ నీప్రత్యుత్తరం కోసం నిరీక్షిస్తూ ఉండడూ?

జెఫ — అలా అనుకోను.

(కొంచెం ఆగి)

ప్యాట్సీ — నాన్నా?

జెఫ — ఏమమ్మా?

ప్యాట్సీ — నేనొకటి అనుకొంటున్నాను.

జెఫ — ఏమిటమ్మా?

ప్యాట్సీ — కొన్నాళ్ళవరకు ఆగితేనో? నాపెళ్ళి?

జెఫ — ఆగడమా?

ప్యాట్సీ — నువ్వు ప్రెసిడెంట్ నియామకమే ఒప్పుకొంటే న్యూయార్కులో ఉండవలసి వస్తుంది. నీజీవితంలో మొట్టమొదటిసారి ఒంటరిగా ఉండాలి. నువ్వు చాలా బాధపడతావు. నీసంగతి నాకు బాగా తెలుసుగా.

జెఫ — కాని ప్రెసిడెంట్ నియమిస్తానంటున్న ఉద్యోగం స్వీకరించదలుచుకోలేదు.

ప్యాట్సీ — నువ్వంగీకరించలేదా?

జెఫ – నిరాకరించే స్వేచ్ఛ నాకిచ్చాడు. దానివల్ల పూర్తిలాభం పొందదలచు కున్నాను.

ప్యాట్సీ – (ఒక పెద్దసమస్య తీరినట్టు) ఐతే నాతో చెప్పావుకాదేమి ?

జెఫ – నీకు చెప్పాలని నాకు తోచలేదు. (ఆగి) అమ్మా! విన్నావా ? ఉద్యోగానికి ప్రకృతి నన్నర్హుడిగా చేయలేదని నేనెన్నాళ్లక్రిందనో కనిపెట్టాను. అప్పుడు ఆ ట్రైంచి ఉద్యోగము స్వీకరించానంటే ఆ సమయంలో మీతల్లి చావు నా జీవితంలో ఒక వెలితి కలిగించింది.....స్థలమూ, పరిసరాలూ మారితే....(ఇక మాట్లాడలేడు.)

ప్యాట్సీ – నాకు తెలుసు, నాన్నా! (ఇద్దరూ పలకరు. ఉత్త ఆకాశమువైపు చూస్తుంటారు) అక్కడ ఎంత ఏంతగా ఉంది !

జెఫ – కాలమూ అవకాశమూ అక్కడ మాయమవుతున్నట్టుంది.

ప్యాట్సీ – ఆమె మనకోసం ఇంట్లో ఎదురు చూస్తూఉంటాలని నా కోరిక.

జెఫ – మీ అమ్మా ?

ప్యాట్సీ – అవును. ఆమెను తలచుకోకుండా మాంటిసెల్లీని తలచుకోలేను. నీ పెళ్ళి రాత్రిని గూర్చి నాతో చెప్పుతూ మురిసిపోయేది.

జెఫ – అట్లానా ?

ప్రాట్సీ – తోటలో ఆచిన్న ఇంట్లో నీ చిత్ర రచనలూ, పుస్తకాలూ, నువ్వు కనిపెట్టిన యంత్రాలూ మొదలైనవి చిందర వందరగా పడిఉంటే మీకు కదలడానికి స్థలముండేది కాదటగా ?

జెఫ – (చిరునవ్వుతో) అది నిజమే.

ప్యాట్సీ – నువ్వొకసారి నిప్పు వెలిగించావు. ఏవో పుస్తకాల వెనకాల పనివాళ్లు సగం తాగివిడిచిపెట్టిన ఒకసీసా దొరికింది. అమ్మ పియానో వాయించింది. నువ్వు వయలిన్ వాయించావు. పాతపాటలు పాడావు.

(గాలికొంచెం తీవ్రమైంది. జెఫర్సన్ తన ఒంటిపై గుడ్డబాగాకి ప్పుకుంటాడు)

జెఫ – గాలి బాగా వీస్తుంది. ఇప్పుడే వస్తాను. (బయలు దేర్తాడు).

ప్యాట్సీ – ఎక్కడికి వెళ్ళుతున్నావు, నాన్నా ?

జెఫ – మీ చెల్లెల్ని చూచివస్తాను.

ప్యాట్సీ – ఆమె పడుకొని ఉంది, నాన్నా !

జెప – బ్లాంకెట్ తన్నేసిఉంటుంది. పడిశం పట్టుతుంది. తుమ్ముతూ దగ్గుతూ ఇంటికి వెళ్ళడం నా కిష్టంలేదు. (వెళ్తాడు).

ప్యాట్సీ – (పిలుస్తుంది) నాన్నా !

జెఫ – (తెరఅవతలనుండి) ఆఁ ?

ప్యాట్సీ – నేను వెళ్ళివస్తాను, నువ్విక్కడే ఉండు.

జెఫ – సరేనమ్మా ! (మళ్లా ప్రవేశిస్తాడు).

ప్యాట్సీ – ఇప్పుడే వచ్చేస్తాను.

(ప్యాట్సీ వెళుతుంది. జెఫర్సన్ ఆకాశం సముద్రం కలిసే చోటు చూస్తూవుంటాడు. నీళ్లపొంగు ... ... వెన్నెల జారి పోతుంది. అతనూ ఓడా ఒకేనీడ అయిపోతారు. మృదువైన సంగీతం దూరంనుంచి వినిపిస్తూవుంటుంది ... ... మెల్లగా, సముద్రం అలలపై నృత్యంచేస్తూ వస్తుందాఅన్నట్లు ఒక ఇల్లు ఇంద్రజాలికంగా ప్రత్యక్షమౌతుంది. మాంటిసెల్లో ! మంచు కురుస్తూ ఉంటుంది. ఆ ఇంటి చుట్టూ మంచు తెప్పలుగా చేరుతుంది.)

స్టేజి అవతలనుంచి నవ్వు వినిపిస్తుంది. పడుచువాడైన టామ్ జెఫర్సన్, యువతి మార్తా తమ దుస్తులపైపడ్డ మంచు దులుపుకుంటూ ప్రత్యక్షమవుతారు. మార్తా ఆనందంతో మెరిసిపోతూంటుంది.)

మార్తా – ఇట్లాంటి పెళ్లి రాత్రి ఎన్నడైనా ఉండేనా ? టామ్ జెఫర్సన్ ! ఆ చివరి కొద్దిమైళ్ళు గుర్రాలు మంచులో ఎగిరి వచ్చేయనుకో.

జెఫ – (ఇల్లు చూపిస్తూ) అదేను, మార్తా !

(మార్తా తిరిగి చూస్తుంది. దీర్ఘ నిశ్వాసం విడుస్తు ...)

మార్తా – ఓ, టామ్ !

జెఫ – నీకు నచ్చిందా ?

మార్తా – ఇంత ఇదిగా ఉంటుందని నేను కలలోనైనా అనుకోలేదు. నువ్వే దీనికి రూపం ఇచ్చావా ? నువ్వేనా ?

జెఫ – నీకోసమే, మార్తా ? (ఆమెచెయ్యి గ్రహిస్తాడు)

మార్తా – నాకళ్లను నేనే నమ్మలేకపోతున్నాను. అంత అందంగా ఉంది.

జెఫ – నీ చెయ్యి మంచులాఉంది, రా.

మార్తా – ఒక్కనిమిషం ఇక్కడే నిలబడి చూడనీ.

జెఫ – ఏప్రిల్‌నెలనాటికి పని పూర్తి అవుతుంది. గృహప్రవేశం చేద్దాం. అంత వరకూ తోటలో ఉన్న కుటీరంలో ఉందాము (క్షమాపణ కోరుతున్నట్టుగా) అందులో ఒకేగది ఉంది.

మార్తా — (నవ్వుతుంది) డార్మిస్ జతలా చలికాలం అంతా ముడుచుకొని ఉండి వసంతంలో బయటికి వచ్చాము. (మంత్రముగ్ధవలె అటూఇటూ చూస్తుంది. రంగం అవతలవు చూపించి) నీ బ్లూరిజ్‌పర్వతాలు అవే అక్కడ ఉన్నాయా?

జెఫ — (తల ఊపుతాడు) ఒకశిఖరం ఉంది, మార్తా! సూర్యుడు ఆశిఖరాగ్రానికి స్వచ్ఛమైన బంగారు మలాము చేస్తాడు. అక్కడినుంచి ప్రకృతి ఒక ఇంద్ర జాల తివాసీ కిందివరకూ పరుస్తుంది - శిలలూ, నదులూ, పర్వతాలూ, అరణ్యాలూ........

మార్తా — నేనింక ఉదయాన్ని ఎదురుచూడలేను.

జెఫ — తుఫాను వాతావరణం తయారవుతూ ఉండగా ఆపర్వత శిఖరంనుండి చూస్తూ ఉంటే మేఘాలూ, వడగళ్ళూ, మంచూ, మెరుపులూ నీకాళ్లక్రింద కలగాబులగంగా కనిపిస్తూ ఉంటాయి.

మార్తా — ప్రియతమా! టామ్!

జెఫ — మార్తా!

మార్తా — నాకోసం నువ్వెంతచేశావో చెప్పలేను.

జెప — ఏంచేశాను నీకోసం?

మార్తా — నీదర్శనం కాకపూర్వం పరిస్థితులు, నీచుల అసహనం నాఆత్మవిశ్వాసం పోగొట్టాయి. భూమి నాకోసం ముడుచుకుపోయినట్టయింది. బ్రతుకు అప్రధానం అనిపించింది. తర్వాత అనాటి రాత్రి మనం కలుసుకొన్నతర్వాత, సరదాగా మనం కబుర్లు చెప్పుకున్నతర్వాత నువ్వు గంభీరంగా మాట్లాడావు. నేను ప్రేమించాను. నిన్నే కాదు. మానవజాతి ఉజ్జ్వలభవిష్యత్తునే ప్రేమించాను. (ఆగుతుంది. అతడు నవ్వుతూ తదేకదృష్టితో చూస్తున్నాడు) అయితే దేనికోసం నవ్వుతున్నట్టు, జెఫర్సన్!

జెఫ — నేను వెయ్యేళ్ళు బతికి నిన్నెప్పుడు చూచినా ఇలాగే చూస్తాను. ప్రియా! నీమొహంమీద మంచు మెరుస్తున్న నీకళ్ళూ—

మార్తా — ఓ, టామ్! నేను చాలా ఆనందంగా ఉన్నానని చెప్పడానికి యత్నిస్తున్నాను.

జెఫ — ఆనందంగా ఉన్నావా?

మార్తా — ముద్దెట్టుకో నన్ను.

(కోమలంగా ముద్దెట్టుకుంటాడు).

జెఫ — ప్రేయసి మధురాధరాలనాను
ప్రియున కానందమేమి కొదువ ?
చుంబనస్రష్ట కమరత్వప్రాప్తి
కల్గ నాశీర్వదింతు నేను.

(ఆమె నవ్వుతుంది. ఇద్దరూ కౌగిలించుకుంటారు.)

మార్తా — టామ్ ! నన్నెప్పుడూ ఇలాగే ప్రేమిస్తావా ?

జెఫ — ఎప్పుడూ, ఎప్పుడూ—శాశ్వతంగా ! (ఆమె వణుకుతుంది) వణుకుతున్నావా ? చలిగా ఉంది.

(వెలుగు మందగిస్తుంది.)

మార్తా — కొద్దిగా.

జెఫ — రా, జెఫర్సన్ సతీ ! (ఒక్క ఊపుతో చేతుల్లో ఎత్తుకుంటాడు.) నిన్ను శాశ్వతంగా వెచ్చగా ఉంచేనిప్పు రాజేద్దాము (ఆమెను ఎత్తుకొని పోతాడు. హటాత్తుగా ఝుంఝూమారుతధ్వని వినిపిస్తుంది. దూరాన మనుష్యుల ధ్వనులు)

కెప్టెన్ — ధ్వని (తెరవెనకనుండి). పోర్ట్ క్వార్టర్ ! (మాంటిసెల్లో మాయ మౌతుంది. కెప్టెన్ ప్రవేశించి స్వప్నాలుకంటున్న జెఫర్సన్‌ను సమీపిస్తాడు.)

కెప్టెన్ — గాలి కొంచెం దుడుకుగా ఉందండి. కిందికి వెళ్ళడం మంచిదండి. (హటాత్తుగా గాలిరొద వినిపిస్తుంది, చక్రం గిర్రున తిరుగుతుంది.) హిగ్గిన్స్ ! చుక్కాని చూడు.

(రంగం అవతల నించి ధ్వని. "సరేనండి". రంగం అవతలనించి కోలాహలం. కెప్టెన్ నిష్క్రమిస్తాడు. ఏదో వాద ప్రతివాదాలు జరుపుతున్నట్లు ధ్వనులు)

(మరొక స్వప్నదృశ్యం ప్రత్యక్షమవుతుంది. యువకుడైన జెఫర్సన్ ఒక వ్రాతప్రతి ముందుపెట్టుకుని బల్లదగ్గిర కూర్చొని ఉన్నాడు ధ్వనులు వినిపిస్తున్న కొద్దీ అతడు ఒకప్రతిపక్షినుండి మరొక ప్రతిపక్షి వైపు చూస్తాడు)

మొదటికంఠం — జార్జియా కాదని వోటు చేసింది.

రెండవకంఠం — పైకిమాత్రం మెరుస్తున్న సామాన్య వచనాలతో నిండిఉందండి ఈపత్రం.

మూడవకంఠం — కెరోలినా కాదని వోటుచేస్తుంది. బానిస వ్యాపారాన్ని నిషే ధిస్తుందన్న క్లాజు తీసివేయాలని ప్రతిపాదిస్తున్నాను. చేతులు! అనుకూలం గానా? (కంగారుపడుతూ జెఫర్సన్ చుట్టూ చూస్తూ వోట్లు లెక్కపెడతాడు) వ్యతిరేకంగా? (జెఫర్సన్ చెయ్యి ఎత్తుతాడు) ప్రతిపాదన గెలిచింది. దయ చేసి ఆ క్లాజు కొట్టిపారేయండి.

(జెఫర్సన్ కోపంతో ఆ క్లాజు కొట్టి పారేస్తాడు.)

రీడ్‌గొంతు — ఆ రెంతవవాక్యం. నా కది ఇష్టం లేదు.

జెఫ — ఏమయ్యా! ఇది దాని హృదయం. అంగుళం అంగుళం నే నీ స్వాతంత్ర్యంకేసి పాక్కుంటూ వెళ్ళమంటావా?

రీడ్‌గొంతు — ఇది ఎక్కడికో తీసుకుపోతుంది మన్ని? మన ఆస్తిపరుల నంద రినీ లాయలిస్టులపక్షం చేరుస్తుంది.

జెఫ — డిక్లరేషన్ నన్ను వ్రాయమన్నారు. వ్రాశాను—అంతా స్వంతభావాలుతో నిండి ఉండాలని ప్రయత్నం చేయలేదు. ఇది అమెరికన్ మనస్సును ప్రతి ఫలించే సరళ రచన. మన ప్రజల కిది కావాలి.

రీడ్‌గొంతు — న్యాయశాస్త్రరీత్యనా?

జెఫ — అమెరికాకు వలసవచ్చిన మనుష్యులు, తమ రక్తస్వేదాలతో ఈదేశాన్ని నిర్మించిన ప్రజలు, కార్మికులు కాని లాయర్లు కాదు.

రీడ్‌గొంతు — పోనీవయ్యా అదంతాను. సంప్రదాయం కావాలి నీకు. కాని చరి త్రలో ఇలాంటిది జరిగింది మరొకటి చూపించు.

జెఫ — చరిత్రలో ఇలాంటి క్రొత్తప్రపంచం మరొకటి ఏది? ఇలాంటి కొత్త ప్రపంచపు మానవుడు మరొకడు ఏడి? మానవ హక్కుల ఆధారంపై ఒక క్రొత్త స్వతంత్ర సంఘాన్ని నిర్మించే అదృష్టం ఎవ్వరికి కలిగింది? సంప్ర దాయమా? ఒక సంప్రదాయం మనమే నెలకొల్పుదాం. ఒక చెడ్డ ఉదాహర ణను అనుసరించడంకంటె ఒక మంచి సంప్రదాయం నెలకొల్పడం ఉత్తమం.

రీడ్‌గొంతు — దీని పర్యవసానం మీకు తెలుసాఅండీ?

జెఫ — (తన ఆవేశాన్ని అణుచుకుంటూ, లేచి నిలబడి, సమావేశానికి అపీలు చేస్తాడు.) సామ్రాజ్యంలో నాకంటె ఎక్కువగా రాజీ కావాలన్నవాడు మరొకడు లేడు. కాని ప్రమాణం చేసి చెపుతున్నాను. స్వాతంత్ర్యం కోల్పోవడం కంటె చావు మేలనుకొంటాను. ఈ విషయంలో నేను అమెరికా తరఫున మాట్లాడుతున్నానని నాకు తెలుసు. రక్తపాతంతో కూడిన యుద్ధం నిశ్చ యించారని విని చాలా దుఃఖిస్తున్నాను. బలవంతంగా మాపై ఇది రుద్ద బడింది. కాబట్టి మేము శత్రువుతో పోరాడుతాం. మమ్మల్ని పీడించే చేతిని ముద్దుపెట్టుకునేటంత పశుప్రాయులం కామని నిరంకుశుడికి బుద్ధివచ్చేట్టు పాఠం

చెప్పాలి. అంతమాత్రం సరిపోదు. శాశ్వతంగా మనం మనభావినీ, మన ముందువచ్చే తరాల భావినీ నిర్ణయిస్తున్నాము. మనప్రజ లప్పుడే ఒకసంవత్సరంనుంచి పోరాడుతూఉన్నారు—ఎందుకూ ? (బల్లపైఉన్న పత్ర మెత్తుకుంటాడు) దీనికోసం. ఇప్పుడు వాళ్ళకిది ఇద్దాం—వ్రాతమూలకంగా. మనం ఏస్వాతంత్ర్యంకోసం పోరాడుతున్నామో దాని కిప్పుడే బలం కలిగిద్దాము. ఇప్పుడే, ఇంకా మన స్వాతంత్ర్యయోధులు తమరక్తం చిందించుతూ తమ ప్రాణాలు బలిఇస్తూ ఉన్నప్పుడే. రేపు వాళ్ళు అలసి, విసిగి అశ్రద్ధ వహించవచ్చు. పోనీ, మనకెందుకని నిర్లక్ష్యం చూపవచ్చు. ఎవడయినా ఒకకొత్త నిరంకుశుడు బయలుదేరి స్వాతంత్ర్యాన్ని హరించడానికి పాత నియమావళినే ఆయుధంగా ఉపయోగించవచ్చు. ఒకస్వతంత్ర సంఘాన్ని నిర్మించడానికి ఇదే అదను. ఇప్పుడే ! తరువాత కాదు.

రీడ్‌గొంతు — ఈవిషయం ఒక్కరోజంతా వాదిస్తాను.

జెఫ — (భయంకరంగా) ఈవ్యవహారంఅంతా తేల్చుకొని ఇంటికివెళ్లాలనే ఆతురత నాకంటె ఎక్కువ ఈకాంగ్రెసు సభ్యులకెవ్వరికీ లేదు. నాభార్య జబ్బుగా ఉంది. ఆమె ప్రసవించే రోజులివి. నే నిక్కడున్నప్పుడు ఇంటిదగ్గర కార్యభారమంతా ఆమెపైపడిఉంది. నాకు ఈమనస్తాపంవల్ల సగం పిచ్చెక్కినట్టుంది. అయినా అవసరమైతే ఈవేసవిఅంతా ఇక్కడే గడుపుతాను—ఈఒక్కవాక్యంకోసం పోరాడ్డానికి.

(విరామం)

రీడ్‌గొంతు — సరే, చదవండి మరొకసారి. దాన్ని చర్చిద్దాం ఇంకొకసారి.

జెఫ — (కూర్చుంటాడు. ఆవేశంతో కూడుకొన్నకంఠంతో బల్లమీది పత్రంనుండి చదువుతాడు.) ఈసత్యాలు స్వయంసిద్ధమని నమ్ముతాను. సర్వమానవులు సమానంగా సృష్టింపబడ్డారు. సృష్టికర్త వాళ్లకు కొన్ని అవిచ్ఛేదమైన హక్కులిచ్చాడు. ఈహక్కులలో ప్రాణం, స్వాతంత్ర్యం, సౌఖ్యంకోసం ప్రయత్నించే హక్కులు ఉన్నాయి. ఈహక్కులను భద్రపరచడానికి మానవ సంఘాలలో ప్రభుత్వాలు నెలకొల్పబడ్డాయి. ఈప్రభుత్వాలు తమ న్యాయమైన అధికారాలు ప్రజల సమ్మతినుండి గ్రహిస్తాయి.

(లిబర్టీ గంట మ్రోగనారంభిస్తుంది. యువకుడైన జెఫర్సన్ ముఖం ఒక దివ్యజ్యోతిచల్లనా రిన్నట్టు మారి పోతుంది. కాంతి ఒక్కసారి ఎక్కువై, తర్వాత తగ్గి, తుదకు మాయమౌతుంది. నీడలా ఉన్న ఓపెను అంధకారం కప్పేస్తుంది. కలగంటున్న జెఫర్సన్ కూడా అందులో మునిగిపోతాడు. చీకటిలో లిబర్టీగంట ఇంకా బిగ్గరగా మ్రోగుతూ ఉంటుంది. క్రమంగా అది తగ్గుతుంది. మ్రోగుతున్న మధురమైన అతిలోక సంగీతం మూర్తావిగ్రహం

ప్రత్యక్షమౌతుంది. దుఃఖంతో కూడిన చిరునవ్వు ఆమె పెదవులపై చిందులాడుతుంది. ఓషెమీద కిలకిల గింటున్న జెఫర్సన్ మళ్లా కనిపిస్తాడు. చెయ్యిచూస్తాడు.)

జెఫ — (గొణుగుతూ) మార్తా! నన్ను క్షమించు. నన్ను క్షమించు. ఎంత బలిదానం నీవద్దకోరాను! నేనొక సుఖప్రపంచం కావాలని కోరాను—మనకోసం. దాన్నందుకోబోయి నిన్ను పోగొట్టుకున్నాను. (మార్తావిగ్రహం దుఃఖంతో చిరునవ్వుతో తలఊపుతుంది.) నాప్రేయసీ! భావికి సంబంధించిన ఏబొమ్మ వేసినా నువ్వే దానికి అగ్రభూమిగా ఉండేదానివి. నువ్వు లేకుండా బొమ్మే లేదు...........

ప్యాట్సీగొంతు — (రంగం అవతలనించి) నాన్నా!

(మార్తా విగ్రహం చెయ్యి చాస్తుంది. క్రమంగా మాయమౌతుంది ప్యాట్సీ ప్రవేశిస్తుంది)

ప్యాట్సీ — నాన్నా! (మెల్లగా వెలుతురు పడుతుంది. మళ్ళా ఓడ. అతనిపక్కని ప్యాట్సీ నిలిచి ఉంటుంది.) మేరియా బాగానే ఉంది, నాన్నా!

జెఫ — మ్! మ్!

ప్యాట్సీ — గాఢంగా నిద్రపోతూంది, మేరియా.

జెఫ — బ్లాంకెట్ తన్నేసిందా ?

ప్యాట్సీ — అవును. అంతా మళ్ళా సర్దేశాను.

జెఫ — మంచిది.

ప్యాట్సీ — ఏదో ఆలోచనలో మునిగి ఉన్నావు. ఏం ఆలోచిస్తున్నావు, నాన్నా?

జెఫ — ఏమీ లేదమ్మా! ఊరికే ఆలోచిస్తున్నాను.

(పైనుండి మనిషి కేక వేస్తాడు. 'నేల కనిపిస్తుంది.' అదే కేక కిందినుండి కూడాను.)

ప్యాట్సీ — నాన్నా! అదిగో అక్కడ, చూచావా ? నాన్నా!

జెఫ — లేదు. ఎక్కడమ్మా! ప్యాట్సీ! ఎక్కడ ?

ప్యాట్సీ — అదిగో ఆ దీపం! అక్కడ!

జెఫ — (జాగ్రత్తగా చూచి, ఆవేశంతో) అవు నవును. అదె నేలే. ప్యాట్సీ! అది అమెరికాయే.

ప్యాట్సీ — మళ్లా ఇల్లు చేరుకున్నాం మనం.

## మొదటి అంకం

### మొదటి రంగం

రంగం: న్యూయార్క్, 1790 వసంతం లోవర్ బ్రాడ్వేలో అధ్యక్షనివాసం, పక్కరూమ్ మ్యాన్షన్. అధ్యక్షుడు వాషింగ్టన్ పెదవులు బిగించి, గంభీరముద్ర వహించి మ్యాడిసన్, అలెగ్జాండర్ హామిల్టనుల మాటలు శ్రద్ధగా వింటున్నాడు. మ్యాడిసన్ పండితుడు. వయస్సుకు మించిన వివేకం కలవాడు. హామిల్టన్ కొంతపొట్టిగా ఉన్నా అందమైనవాడు. మంచి వ్యక్తిత్వం కల యువకుడు. ఠీవిగా హుందాగా ఉంటాడు. కర్నల్ హాంఫ్రీస్ నిలబడి ఉంటాడు. అతడు డాంబికుడు. హామిల్టన్ మనోనైశిత క్షణప్రభలా మెరుస్తూ ఉంటుంది. ఆ నవ్వులు హాంఫ్రీస్ ముఖంపై ప్రతిబింబిస్తూ ఉంటాయి.

మ్యాడి — (గట్టిగా) కర్నల్ హామిల్టన్ ట్రెజరీ బిల్లు మరొకసారి ప్రవేశపెట్టితే కాంగ్రెసు మళ్లా దాన్ని చంపేస్తుంది.

హామి — నిర్లక్ష్యంగా) మ్యాడిసన్‌గారూ ? మీకాంగ్రెసులోని తలకాయలను వేరు వేరుగా పట్టుకొని వాటిని ఒకదానితో ఒకటి ఢీకొల్పి పచ్చడిచేయాలని ఉంది.

మాడి — దానివల్ల వచ్చే ప్రయోజన మేమిటి ?

హామి — ఏదో ఒక విధమైన ఐకమత్యం.

మాడి — అవును. కాని ఏవిధమైన ఐకమత్యం అన్నదే ప్రశ్న.

హామి — నువ్వు 'స్పెక్యులేషన్' అంటావు. అది ప్రశ్నకాదు. అది నీకూ తెలుసు.

మాడి — నాకదేమీ తెలియదు, దానికి వ్యతిరేకంగా....

హామి — ఉత్తరాదికి కొంచెం ఎక్కువ లాభమౌతుందని దక్షిణాది భయపడు తున్న విషయం కాదంటారా ?

మాడి — కాని ఉత్తరాదికి దీనివల్ల లాభముందంటారా ?

హామి — అవును తప్పక. దానికేమంటారు ? (వాషింగ్టన్ వంకకు తిరిగి) మన ప్రభుత్వం ఇంకా శైశవావస్థలో ఉంది. దాని ఆర్థిక విధానంలో నమ్మకం దానిమొదటి అవసరం.

మాడి — కాని నమ్మకం పుట్టించడానికి ఇదా మార్గం ?

హామి — అవునండి. విద్యావంతుడూ, వివేకవంతుడూ అయిన వర్జీనియాప్రతినిధి ఇంతకంటె మంచిప్రణాళిక మరొకటి ప్రతిపాదించగలరా ?

మాడి — కర్నల్ హామిల్టన్ ! వ్యక్తిత్వాలు ఇక్కడ....

వాషిం — అయ్యా ! అయ్యా ! మ్యాడిసన్ ! మీఅభిప్రాయాలకు కృతజ్ఞుణ్ణి. ప్రజల శాసనాధికారంలో జోక్యం కలగజేసుకోడం నాధర్మంకాదు.

మాడి — థాంక్ యు.

హామి — కాని ప్రెసిడెంటు మహాశయా! మీరు....

వాషిం — మీబిల్లు గుణాగుణాలను కాంగ్రెస్ నిశ్చయించవలసిందే.

మాడి — గుడ్ డే ! ప్రెసిడెంట్ మహాశయా ! (హామిల్టన్‌కు వంగి నమస్కరిస్తాడు. హామిల్టన్ కోపంతో మండిపడుతున్నాడు.) కర్నల్ హామిల్టన్ !

హామి — మిమ్మల్ని అభినందిస్తున్నాను. ఐకమత్యగౌరవాలపై మంచివిజయం సాధించారు (మ్యాడిసన్ చిరునవ్వునవ్వి, తలఊపి వెళ్లిపోతాడు. హామిల్టన్ వాషింగ్టన్‌వైపు తిరుగుతాడు.) అయ్యా ! మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను....

వాషిం — మెల్లగా, కర్నల్ ! 'తాపీగా కాని తప్పకుండా' మన రాజకీయనీతి అది.

హామి — నేను రాజీనామా ఇవ్వవలసివస్తుందేమోనని భయంగా ఉంది.

వాషిం — ఇప్పుడటోయ్, అబ్బాయ్ ?

హామి — గాలి పోగుచేసి ధనాగారం నింపలేను.

వాషిం — నాకుతెలుసునోయ్ అబ్బాయ్ ! నాకు తెలుసు. (హామిల్టనుకు ఏవో కాగితా లిస్తాడు.) ఈఅంకెలు కొంచెం సరిచేసి పెట్టు నాకోసం. (వేరేకాగితాలు పొదిపెడతాడు.) ఇవి సాయంకాలం చూద్దాము. నువ్వూ, మీఆవిడా వస్తారనుకొంటుందే మిసెస్ వాషింగ్టన్?

హామి — మిసెస్ హామిల్టన్ మంచంపట్టి ఉంది.

వాషిం — అట్లానా ! ఏమి ? ఆరోగ్యంబాగాలేదా ఏమి ?

హామి — అదేంకాదు.

వాషిం — ఒహో ! అదా ?

హామి — అవును.

వాషిం — అభినందిస్తున్నాను.

హామి — కృతజ్ఞుణ్ణి. అయితే ఇవి సరిచూసుకొంటాను. ఇప్పు డింకేమైనా ఉందా?

వాషిం — లేదు. (హామిల్టన్ వెళ్లడానికి ఉద్యమిస్తాడు. ఒక సార్జంటు ప్రవేశిస్తాడు.)

సార్జంట్ — ఫ్రాన్సులో హిజ్ఎక్సెలెన్సీ యొక్క రాయబారి, మిష్టర్ జెఫర్సన్.

వాషిం — చాలా మంచిది. అయన్ని లోపలికి రానీ.

సార్జంట్ — చిత్తం. (సార్జంట్ నిష్క్రమిస్తాడు. హామిల్టన్ వెళ్లబోతూ ఆగిపోతాడు.)

హామి — మిష్టర్ జెఫర్సన్ న్యూయార్క్‌లో ఉన్నారా?

హంఫ్రీస్ — నిన్నరాత్రే వచ్చారు. (హామిల్టన్ అతనివైపు తేరిపార చూస్తాడు. హంఫ్రీస్ నక్కి పోతాడు.) మీకు తెలుసు ననుకొన్నాను....నేను........

హామి — (హఠాత్తుగా ఆవేశంతో) విధి మనపక్షాన ఉంది. మిష్టర్ జెఫర్సన్ దక్షిణాది సభ్యులు నాట్రెజరీబిల్లుకు అనుకూలంగా వోటుచేసేటట్టు చేయగలడు. నే నాయ న్నెప్పుడూ కలవలేదు. మీరతనితో మాట్లాడాలి........

వాషిం — ఆపని నేను చేయలేను.

హామి — ఎందుచేత?

వాషిం — (గుర్రుమంటూ) మళ్ళా చెప్పాలనా? మళ్ళా, మళ్ళా, మళ్ళా. ఎన్ని సార్లు అంతా చెప్పడం? ఇక చెప్పడానికి అంతంలేదా?

హామి — ఏదో పెద్దప్రమాదం వస్తే తప్ప మీరు దీన్ని గూర్చి పట్టించుకోరు. (మధురంగా) నే నేమంత భయపడ్డంలేదు. కాని త్వరలో పెద్ద సంకటం కలుగుతుందని మాత్రం చెప్పగలను. (వికటంగా చిరునవ్వునవ్వుతాడు. వంగి నమస్కారంచేసి నిష్క్రమిస్తాడు. కర్నల్ హంఫ్రీస్ అతని వెనకాలే వెళ్తాడు. వాషింగ్టన్ అతన్ని చురచురా చూస్తాడు. చిరునవ్వు ఛాయ లతనిముఖంపై వెలుగుతుంటాయి. జెఫర్సన్ ప్రవేశిస్తాడు.)

జెఫ — జనరల్ వాషింగ్టన్!

వాషిం — (లేచి) మిష్టర్ జెఫర్సన్! స్వదేశానికి స్వాగతం. ఏదీ....నిన్ను బాగా చూడనీ. (ఇద్దరూ ఒకళ్ళనొకళ్ళు శ్రద్ధగా పరిశీలనగా చూసుకొంటారు.) ఆరేళ్ళు!

జెఫ — ఆరేళ్ళు! పెద్దకాలం.

వాషిం — (నిట్టూర్చి) అవును. ప్యాట్సీ పెళ్ళి బాగా జరిగిందా?

జెఫ — దివ్యంగా. (కొన్నిబంగీలు వాషింగ్టనుకు అందిస్తాడు.) మిసెస్ వాషింగ్టన్ కోసం, మీకోసం.

వాషిం — ఓహో ! ఎందుకీ శ్రమ ? (తన బల్లవద్దకు వెళ్ళి చాకు తెచ్చి బంగీలు విప్పుతాడు.)

హంఫ్రీస్ — (ప్రవేశించి) జెఫర్సన్ ! మిత్రమా !

జెఫ — బిల్లీ హంఫ్రీస్ ! అంతా క్షేమమేనా ?

హంఫ్రీస్ — ఓహో ! దివ్యంగా, దివ్యంగా. ప్యారిస్ అందం ఇప్పు డెట్టాఉంది ? ఏమిటి విశేషాలు ?

జెఫ — బాగా మారిపోయింది. ప్యారిస్‌లో ఇప్పు డందరూ రాజకీయాలే మాటాడు తున్నారు. మాటలంటే ఫ్రెంచివాళ్ళకు ఎంత ఇష్టమో మీకు తెలుసు.

హంఫ్రీస్ — అహా ! (బిగ్గరగా వచ్చీరానీ నవ్వు నవ్వుతాడు.) ఎట్టాఉన్నారు ప్రజలు ? ఎట్టా ఉన్నాడు రాజు ? (నాజూకుగా పొడుం పీలుస్తాడు.)

జెప — రాజు సగంరోజు వేటలోను, సగంరోజు తాగుడులోను గడుపుతున్నాడు.

హంఫ్రీస్ — (ధూర్తతతో) అలానా ? అలానా ?

జెఫ — రాణీ ఏడుస్తూనూ ఉంటుంది, పాపం చేస్తూనూ ఉంటుంది.

హంఫ్రీస్ — ఓహో ?........

వాషిం — (తన ప్యాకేజి విప్పుతాడు. కలువదుంపలు తీస్తాడు.) దైవసాక్షిగా ! కలువదుంపలు కదూ ?

జెఫ — చాలా అందమైన జాతి. అలాంటివి నేనెక్కడా చూడలేదు. అద్భుతమైన పువ్వు. దక్షిణఫ్రాన్సునించి తెప్పించాను.

వాషిం — ఇవి వడ్లు.

జెఫ — ఇటలీవి.

వాషిం — అందమైన గింజలు.

జెఫ — గింజ ఎంతుందో చూడండి.

వాషిం — అద్భుతం! కూర్చో. (అతనికోసం కుర్చీ లాగుతాడు.)

జెఫ — కృతజ్ఞుణ్ణి. (కూర్చుంటాడు.)

వాషిం — (బల్లవద్దకు వెళ్లి ఒకసీసా తీసి గ్లాసుల్లో మధువు నింపుతాడు.) వర్జీనియా వెళ్లి వచ్చారుకదూ ?

జెఫ — అహా !

వాషిం — మ్మ్ !

జెఫ — అవును.

వాషిం — పంట లెట్టాఉన్నాయి ?

జెఫ — రైమాత్రం అద్భుతంగా ఉంది, గోధుమ కూడా బాగానేఉంది. మొత్తం మీద ఈయేడు పంటలు బాగానే ఉన్నాయి.

వాషిం — నేనూ అదే విన్నాను.

జెఫ — అయితే నా స్వంత భూములు మాత్రం చాలా మట్టుకు నాశనమై పోయాయి.

వాషిం — ఈపాడు ఓవర్‌సీయర్లు. వాళ్లకేమీ తెలియనూ తెలియదు. పైనించి అశ్రద్ధకూడాను. (మధువుపోసి గ్లాసు అందిస్తాడు.)

జెఫ — క్యాబేజీల బైటవరస కుందేళ్లు తినిపోతున్నాయంటాడు. మా ఓవర్‌సీయరు.

వాషిం — దానికి నువ్వేమన్నావు ?

జెఫ — బైటివరసలు తీసేయన్నాను.

వాషిం — (నవ్వుతాడు) చాలమంచిది. (కుర్చీ లాక్కొని జెఫర్సన్నుకు దగ్గిరిగా కూర్చుంటాడు.)

హంఫ్రీస్ — యువర్ ఎక్సలెన్సీ ? తమరొక చోటికి వెళ్లవలసి ఉందను కొంటాను.

వాషిం — (సైగచేసి హంఫ్రీసును పొమ్మంటాడు.) అలాగేనయ్యా, కర్నల్ హంఫ్రీస్ ! కొంచెంసేపటి తర్వాత!

హంఫ్రీస్ — చిత్తం (వంగి వంగి నమస్కారాలు చేస్తూ వెనక్కి నడుస్తూ నిష్క్ర మిస్తాడు.)

జెఫ — (అతన్ని తదేకదృష్టితో చూస్తూ) వీధుల్లో చిన్నపిల్లలు ఇతన్ని వెంబ డించరూ ? చెప్పండి.

(వాషింగ్టన్ హంఫ్రీస్ వైపు చూస్తాడు. జెఫర్సన్ వంక తిరిగి తల ఊపుతాడు. జెఫర్సన్ నవ్వుతాడు. గ్లాసులెత్తుతారు.)

వాషిం — రిపబ్లిక్ ! (ఇద్దరూ తాగుతారు. జెఫర్సన్ మధువు చప్పరిస్తాడు చాలా రుచిగా ఉన్నదన్నట్టు. గ్లాసు ఎత్తి దాని రంగు చూస్తాడు.) ఇదేమిటో గుర్తు పట్టావా ? (జెఫర్సన్ తల ఊపుతాడు.) ప్రశస్తమైన మెడీరా!

జెఫ — నేనూ, ప్యాట్సీ ప్యారిసంతా తిరిగాము దీనికోసం.

వాషిం — నువ్వు పంపించిన ద్రాక్షాసవాలకు మిష్టర్ ఆడమ్స్ చాలా సంతో షించాడు. కాని.... కాని.... (జెఫర్సన్ వైపు తీక్ష్ణంగా చూస్తాడు.) వాళ్ళమ్మాయి మాత్రం నువ్వు కొని పంపించినదానికి చాలా నిస్పృహ చెందింది.

జెఫ — మిసెస్ స్మిత్తా ? అయితే ఆమె ఏది ?.........ఓహో! అప్యారిస్ కోర్సెటా ? (వాషింగ్టన్ అప్రసన్నంగా తల ఊపుతాడు.) అది ఆమెకు సరిపోలేదా ?

వాషిం — లేదు, (చేతితో సంజ్ఞ చేస్తూ పెద్ద బొమ్మ ఉన్నట్టుగా సూచిస్తాడు.)

జెఫ — ఎంత పొరపాటైంది ?

వాషిం — అది చాలా అందమైందే. మిసెస్ ఆడమ్స్ దాన్ని మిసెస్ వాషింగ్టన్కు చూపించింది. ఎర్రటి రిబ్బన్లు అవీన్నూ. మన ఆడవాళ్ళ గుండె పగిలేటట్టుంది.

జెఫ — వాళ్ళు దాని కంతగా నిస్పృహ చెందవలసిన పనిలేదు. దాన్ని అలాగే ఉంచేయమని మిసెస్ స్మిత్‌తో చెప్పండి. ప్రపంచంలో పోటు పాట్లు ఉండనే ఉంటాయి. మొహమ్మద్ దగ్గిరికి పర్వతం వెళ్ళకపోతే మొహమ్మదే పర్వతం దగ్గిరికి వెళ్ళాడు. (వాషింగ్టన్ చిరునవ్వునవ్వుతాడు. గ్లాసు ఖాళీచేస్తాడు, ఖాళీ గ్లాసు బల్లపై ఉంచుతాడు.) అయితే లాఫాయిత్ ఫ్రాన్సులో రిపబ్లిక్ స్థాపించడానికి ప్రయత్నిస్తున్నాడన్నమాట.

జెఫ — మెల్లగా. రాజ్యాంగసంబంధమైన సంస్కరణలద్వారా ప్యారిస్‌లో నా గదిలో కూర్చొని అతడు ఫ్రెంచిప్రజల హక్కుల బిల్లు వ్రాశాడు. మనం చేస్తున్న ప్రయోగాన్ని ప్రజలందరూ వెయ్యికళ్ళు పెట్టుకొని చూస్తున్నారు. మనదేశం సౌఖ్యంకోసం మనం తయారు చేస్తున్న రాజ్యాంగం, అనుకోకుండానే తక్కిన దేశాల పీడితప్రజల సౌఖ్యానికి కారణమౌతుందనే భావం ఎంతో సంతృప్తి కలగజేస్తుంది. అక్కడింకా అపాయం పూర్తిగా తొలగలేదు. నేను ఫ్రాన్సంతా ప్రచ్ఛన్నంగా పర్యటించాను. రైతులను వాళ్ళగుడిసెల్లో కలిశాను. వాళ్ళ దారిద్ర్యం, అజ్ఞానం భయంకరంగా ఉంది. ఒకసారి వాళ్ళు లాఫాయత్‌ను పోగొట్టుకొన్నారా..................(తల ఊపుతాడు. గ్లాసు ఖాళీ చేస్తాడు.)

వాషిం — అరాజకమా ?

జెప — అవును.

వాషిం — (దీర్ఘంగా నిట్టూర్చి) అవును.

జెఫ — (వాషింగ్టనును జాగ్రత్తగా చూచి) మీరు అలసిపోయినట్టున్నారు.

వాషిం — (లేచి నిలబడి) ఇంట్లో ఉండి పనిచేయడానికి నేను అలవడి ఉండలేదు. నాకు వ్యాయామం కావాలి.

జెఫ — దూరంగా నడవడం. అది మంచి వ్యాయామం.

హాషిం — దానికి అనుజ్ఞ ఏది ? అధ్యక్షుడి హోదాకు నడవడం అనుచితమట. మేము ప్రెసిడెన్షియల్‌లో ఉంటగా వీధిలోకి రావాలంటే పెద్దపరివారం, ఉత్సవం లేకుండా వీల్లేకుండా ఉండేది. బ్రాడ్వేకు మారిన తర్వాత కొంతనయమనుకో. ఇప్పుడు తరచు వొడ్డిగుమ్మంలోంచి మెల్లగా జారి మైదానం దాటి నదిఒడ్డునే నడిచి పోతుంటాను.

జెఫ — నదివద్దకు పోయి ఏం చేస్తారు ?

హాషిం — చేపలవేట.

జెఫ — ఆహా !

హాషిం — (లేచి, బిస్కట్లపళ్లెం ఒకటి తెస్తాడు.) ఈఏడు రెండుసార్లు జ్వరం వచ్చింది. మరొకసారి జ్వరం వస్తే బతుకుతానో లేదో అన్న సందేహం కలిగింది. సరే. దానికేమిలే ? రేపో, మరో ఇరవైఏళ్ల తర్వాతనో—మన మంతా దేవుడి చేతుల్లో ఉన్నాము. ఈ బిస్కట్ ఒకటి తినిచూడు.

జెఫ — కృతజ్ఞుణ్ణి.

హాషిం — (కెన్నెదగ్గిరికి వెళ్తాడు.) నేను వివిధశాఖల మంత్రుల్ని ఒక క్యాబి నెట్టుగా సంఘటిత పరుస్తున్నాను. మా సెక్రటరీ ఆఫ్ స్టేట్‌గా నువ్వు....

జెఫ — జనరల్ వాషింగ్టన్.

హాషిం — మ్మ్ !

జెఫ — మీ ఉత్తరంలో నిరాకరించే హక్కు నా కిచ్చారు.

హాషిం — అయితే నువ్వు నిరాకరించవని నా నమ్మకం.

జెఫ — నేను తప్పకుండా నిరాకరించవలసివస్తుంది.

హాషిం — ఎందుకు ?

జెఫ — ఇన్నాళ్లు విదేశాల్లో ఉన్నాను. నాకీ పదవి విధు లేమిటో కూడా తెలియదు. నేను సరిగ్గా నిర్వహించ లేకపోవచ్చు. నాకు భయంగాఉంది.

హాషిం — మేమూ తడుముకొంటూనే ఉన్నాము. ఈ ప్రభుత్వం సర్దుకుపోయే ప్రభుత్వం కాని మరొకటి కాదు.

జెఫ — (తల ఊపుతాడు) నన్ను అపార్థం చేసుకోవద్దు. నన్నుకూడా అర్థం చేసుకొమ్మని ప్రార్థిస్తున్నాను. యువకుడిగా నాలో ఏపాటి రాజకీయ ఆశ లున్నా ఇప్పుడవి ఇగిరిపోయేయి. (లేస్తాడు, సగం కొరికిన బిస్కటు పళ్ళెంలో ఉంచుతాడు.) ప్రతివాడు తనవంతు పనిచేయాలని నా నమ్మకం. నావంతు పని నేను చేశానని విశ్వసిస్తున్నాను. ఇప్పుడు ఇంటికి వెళ్లాలని నా కోరిక, ఇంటిపని పూర్తిచెయ్యాలి. ప్యాట్సీ, ఆమె భర్తా నాతో ఉండడానికి మాంటి

సెల్లీ వచ్చాను. ఇన్నాళ్ళూ పిల్లలతో ఉన్నాను. వాళ్ల ప్రేమయే నాకు ఆలంబనంగా ఉంది. అదీ వాస్తవమైన సంగతి.

వాషిం — టామ్ ? మళ్లా పెళ్లిచేసుకోవాలని ఎప్పుడైనా ఆలోచించావా ?

జెఫ — లేదు.

వాషిం — మీ ఆవిడ మాత్రా చాలా అద్భుతమైన మనిషి.

జెఫ — అవును. (ఆగుతాడు) నేనింటికి వస్తే ప్రతిగదిలోను ఆమె ఉండేది. (ఆగుతాడు) ఒక్క విషయం మాత్రం నేను చెప్పుకొన్నాను. ఒక్క మాంట సెల్లీలో తప్ప ప్రపంచంలో నాకెక్కడా శాంతి అన్నదిలేదు. ఈ పదవి నే నెందుకు నిరాకరించవలసి వచ్చిందో ఇప్పు డర్థమైందా ?

(హంఫ్రీస్ ప్రవేశిస్తాడు)

హంఫ్రీస్ — క్షమించండి, ప్రభూ !

వాషిం — లోపలికి రండి, హంఫ్రీస్ !

హంఫ్రీస్ — నాటకంలో ప్రత్యేక ఏర్పాట్లన్నీ చేశాను. అంగరక్షకులూ సిద్ధంగా ఉన్నారు.

వాషిం — (ముఖ్యంగా) మంచిది.

హంఫ్రీస్ — టర్కీసుల్తాన్ రాయబారికూడా వస్తున్నాడని తెలిసింది.

వాషిం — (తనకేమీ అభినివేశం లేనట్టు) మ్మ్ మ్మ్.

హంఫ్రీస్ — ఒక సూచన ఇవ్వనా, యువర్ ఎక్సెలెన్సీ !

వాషిం — ఆహా !

హంఫ్రీస్ — బండికి ఆరు గుర్రాలు పూన్చితే మంచిది.

వాషిం — నాల్గు గుర్రాలపై మనం రాజీ పడ్డామనుకొన్నాను.

హంఫ్రీస్ — నేను లూయీ ఆస్థానంలో ఉన్నప్పుడు ........

వాషిం — (మెల్లగా) కర్నల్ హంఫ్రీస్ ! ఒక రాజ్యరివిశేషం—ప్రత్యేకంగా శైశవావస్థలో ఉన్న మన రాజ్యంలాంటిదానికోసం—ఈ మర్యాదలన్నీ అవసరమేనని ఒప్పుకుంటాను. అర్థమైందా ? నా కేవీయూ యాలేమీ తెలియవు. నే నెప్పుడూ యూరప్‌రాజాస్థానాలకు వెళ్ళలేదు. ఒక ముసలి సిపాయిని నేను—ఈ మర్యాదలన్నీ నీ చేతుల్లో విడిచిపెడ్తాను. (ఒపిక సన్నగిల్లుతుంది.) నాలుగు గుర్రాలూ, గిల్టుదేవదూతలున్న కోచీ టర్కీసుల్తాను రాయబారినైనా ఖేష్ అనిపించడానికి చాలుననుకొంటాను.

హంఫ్రీస్ — కాని................

వాషిం — నాల్గు చాలును. ఇది నా చివరి మాట. (చేతి కాగితాలు అటూ ఇటూ కలుపుతాడు. చీదరించుకొంటాడు.) ఈవేళ నాటకానికి వెళ్లడానికి తీరికలేదు.

హంఫ్రీస్ — చిత్తం. ఒక్కమనవి, ప్రభూ ?

వాషిం — (లేచి గర్జిస్తాడు.) అలా సంబోధించ నక్కరలేదు. ఎన్నిసార్లు మీతో చెప్పేది. దైవసాక్షిగా చెపుతున్నాను, నేను రాజును కాను. నేను ప్రజలచే ఎన్నుకోబడిన అధ్యక్షుణ్ణి. ఇది రిపబ్లిక్. ఈ విషయం మీ బుర్ర కెక్కుతుందా ? (సంయమించుకొని అలసటతో) సరే. వెళ్లండి.

హంఫ్రీస్ — మిస్టర్ ప్రెసిడెంట్! (వెళ్లిపోతాడు. వాషింగ్టన్ నిట్టూర్చుతాడు.)

వాషిం — నాకు కిరీటం సమర్పించారు.

జెఫ — కిరీటమా ?

వాషిం — రెండుసార్లు. (ఆగి) నేను రాజు కాదలచుకోలేదు, టామ్! (అల్మారీ వద్దకు వెళ్లి పైపు తీసుకుంటాడు. ఒక సంచిలోంచి పొగాకు తీసి నింపుతాడు.)

జెఫ — నాకు తెలుసు మీరు ఒప్పుకోరని, ప్రెసిడెంట్!

వాషిం — నీకు తెలియదు. (మండుతున్న కొవ్వొత్తికి ఒకపుల్ల వెలిగిస్తాడు.) ప్రతికన్నూ ఈ పదవిపై ఉంటుంది. మన ప్రజల్లో చాలామంది ఏ స్వప్నమూ నిస్తారు. దైవసాక్షిగా చెపుతున్నాను. ప్రపంచం అంతటికీ సామ్రాట్టును కావటంకంటె నా పొలంలోనే బతికి అందులోనే చావటానికి ఇష్టపడతాను. (పైపు ముట్టించి ఆవేశంతో పీలుస్తాడు.)

జెఫ — (ఆగి) నాకుతెలుసు. అయినా, ఇప్పుడు నేను తిరిగి వచ్చేశాను కాబట్టి—ప్రత్యేకంగా న్యూయార్కుకు—నా కిక్కడ భయంకరమైన కోరికలు పొడచూపుతున్నాయి. మన విలాసపురుషులు కొందరు ఒక రాజూ ఒక ఆస్థానమూ కావాలని కోరుతున్నారు.

వాషిం — అవును. నాకు తెలుసు. (నిట్టూర్చుతాడు. పైపు దీర్ఘంగా పీలుస్తాడు. పుల్ల ఆర్పేస్తాడు.) మరొకవంక అరాజక పరిస్థితులు కలిగే అపాయంకూడా ఉంది. నువ్విక్కడ లేనప్పుడు ఆ పరిస్థితులకు దగ్గరగా వచ్చాము. (పైపు పీలుస్తాడు.) ఈ రెండు గోతులమధ్య మనం నడుస్తున్నాము. మన ప్రజలకు క్రమశిక్షణఅంటూ లేదు—క్రమశిక్షణ లేకపోతే మన కధోగతే. స్వాతంత్ర్యం ఎంత మోతాదులో ఇచ్చి మనవాళ్ళను నమ్మగలమో ఇంకా చూడవలసి ఉంది. టామ్! మొదటినుంచీ వర్జీనియాలో నువ్వు వాళ్లకు సన్నిహితంగా ఉన్నావు. వాళ్లనెప్పుడూ నువ్వు అర్థం చేసుకొంటూనే ఉన్నావు. ఈ పదవిలో ఉండి నేను వాళ్లకు చాలా దూరమైపోయాను. వాళ్లతో సన్నిహిత సంబంధం

లేకుండా పోయింది నాకు. నేను నీద్వారా పనిచేయవలసి ఉంది. నీయందు వాళ్లకుగల విశ్వాసం నాకు కావాలి. మానవసౌఖ్యాన్ని పెంపొందించడానికి ఇది చివరి గొప్పప్రయోగం. "సర్వమానవులూ సమానులుగా సృష్టింప బడ్డారు" అని వ్రాసిన చెయ్యి నాకాలంబనం కావాలి. నిన్నిప్పుడే ఇంటికి వెళ్లనివ్వను. నువ్విక్కడ కావాలి నాకు.

(ప్రశ్నావిరామం. జెఫర్సన్ డెస్కు దగ్గరికి వెళతాడు. ఇంతసేపూ చేతుల్లో ఆడిస్తున్న ఫాన్సీపు గిలాసల్ని దానిపై పెట్టి వాషింగ్టన్ దిక్కు చూస్తాడు.)

జెఫ — ఎలా సమంజసమని తోస్తే అలా మమ్మల్ని తీర్చిదిద్దే పని మీది.

వాషిం — (అతనివద్దకు వెళ్లి భుజం పట్టుకుంటాడు) చాలా మంచిది. బేష్ !

జెఫ — ఇది గొప్ప గౌరవం. దీనికి నేను అర్హుణ్ణి కావాలని నాకోరిక.

(హంఫ్రీస్ ప్రవేశిస్తాడు.)

హంఫ్రీస్ — మిస్టర్ ప్రెసిడెంట్ !

వాషిం — నేను పనిలో ఉన్నాను.

హంఫ్రీస్ — హిజ్ ఎక్సెలెన్సీ ! స్పైన్ రాయబారి దర్శించుకోడానికి వచ్చాడు. అతను ఈవేళకు రావడం కొంచెంసేపటి ముందే నిర్ణయమైంది, ఉత్త మర్యాదలు మాత్రమే.

వాషిం — సరే. (నిట్టూర్పుతాడు. రిసెప్షన్ రూములోకి తీసుకురమ్మని సైగ చేస్తాడు.) అతన్ని చూస్తాను. (జెఫర్సన్‌తో) క్షమిస్తావా ? కొద్దినిమిషాలు మాత్రమే. ఇవిగో అక్కడ పత్రికలున్నాయి.

జెఫ — (తన చేతిసంచి ఎత్తి) నాటారిఫ్‌రిపోర్టు ఇంకా చదవవలసి ఉంది.

(హంఫ్రీస్ ముందు నడుస్తూ ఉండగా వాషింగ్టన్ నడవలోకి నిష్క్రమిస్తాడు. హ్యామిల్టన్ లోపలికి వస్తాడు. అతని చేతిలో ఏవో కాగితాలుంటాయి. ఇద్దరూ ఒకళ్లనొకళ్లు చూసుకుంటారు.)

హామి — మీరు జెఫర్సన్‌గారు కదూ ?

జెఫ — అవును.

హామి — నేను హామిల్టనును.

జెఫ — హ్యామిల్టన్ ?

హామి — (వంగి నమస్కరించి) అలెగ్జాండర్ !

జెఫ — మీ సేవకుణ్ణి.

హామి — మీ సేవకుణ్ణి.

జెఫ — నేను ఫ్రాన్సులో ఉండగా మీ ఫెడరలిస్టు పేపర్సు చదివాను. అద్భుతంగా ఉన్నాయి. చాలా ఆనందం కలిగించేయి.

హామి — ధన్యుణ్ణి. (హామిల్టన్ తన కాగితాలు చూసి బాధ ప్రకటిస్తారు. తలఊపి వాటిని ప్రెసిడెంటు బల్లపై పారేస్తాడు)

జెఫ — బాధలా ?

హామి — అవును. సుఖంగా ప్రయాణం సాగిందా ?

జెఫ — అహా ! దారి తరగనట్టే అనిపించింది

హామి — (చిరునవ్వుతూ) అది సహజమే. (బల్లమీద కాగితాలు పేరుస్తాడు.) సెక్రెటరీ ఆఫ్ స్టేట్ పదవి స్వీకరించారా ?

జెఫ — అవును.

హామి — అభినందనాలు. మనం అందరం కలిసి పనిచెయ్యాలి.

జెఫ — నేనిక్కడికి కొత్తవాణ్ణి. నేను మీపై ఆధారపడతాను.

హామి — కాదు. నేనే మీ సహాయం వాంఛిస్తున్నాను. (హఠాత్తుగా ఆవేశ పూరితుడై) మిస్టర్ జెఫర్సన్ ! అమెరికాని ప్రేమించే ఏమనిషినైనా ఏడ్పించడానికి ఇది చాలు. క్షమించండి. దీనితో మీపై ఏమీ భారం వేయదలచుకోలేదు. ఇది నాడిపార్టుమెంటు గొడవ.

జెఫ — నే నేవిధంగానైనా సహాయం చేయగలిగితే........

హామి — ప్రజలు తమకు తాము బుద్ధి బలంవల్ల పరిపాలించుకోగలరా లేక ఎప్పుడూ నిరంకుశాధికారం కిందనే ఉండాలా అన్న విషయం మనదేశం నిర్ణయించాలని అందరూ అంటున్నారు, మిస్టర్ జెఫర్సన్ ! ఇది మంచి భావం కదూ ?

జెఫ — నిజం. ప్రపంచ చరిత్రలో చాలా ముఖ్యమైన కాలంలో మనం ఉంటున్నామని నా అభిప్రాయం.

హామి — ఇది మంచిభావమే. భయంకరమైన భావం. ఎందుకంటారా ? అది నిజమే అయితే మనం పరాజితులు కావడానికి సాహసించలేము.

జెఫ — అవును.

హామి — కాని మనం ఓడిపోతున్నాం. యంత్రాంగం అప్పుడే తుత్తునియలైపోతుంది. (వేళ్ల విరుస్తాడు.) విదేశాలలో మనకంత పరువు లేదు. యునైటెడ్ స్టేట్సువేసిన కాగితం డబ్బు ఏమీ విలువలేకుండా పోయింది. మనం

ఆర్థికంగా అరాజక పరిస్థితుల్లో ఉన్నామిప్పుడు. (అటు నుండి ఇటు, ఇటు నుండి అటూ పచారు చేస్తారు) నావద్ద దీనికొక మందు ఉంది. అది చాలా సులభమైన మందు. వర్తకుని పరపతివలె ఒక దేశం పరపతి కూడా దాని ప్రామిసరీ నోట్లు పూర్తిగా చెల్లించివేయడంపై ఆధారపడి ఉంటుంది. మనం అచ్చువేసిన నోట్లన్నిటికీ నూటికి నూరు చొప్పున ఇచ్చేద్దామని నా అభిప్రాయం. మన పరపతి దానితో వెంటనే స్థిరంగా నెలకొంటుంది.

జెఫ — (చిరాకుతో) నిన్నరాత్రి మాడిసన్ గారు మీ బిల్లును గూర్చి క్లుప్తంగా చెప్పారు. దీనిలో కొంత స్పెక్యులేషన్ ఉన్నదనీ, అందుకోసంఅతనికి....

హామి — మాడిసనా? అతనంటే నాకు పరమప్రీతి. అతను చాలా గొప్పవాడని నా అభిప్రాయం. అతని సహాయం నాకు లేకపోతే ఈ పదవి స్వీకరించే వాణ్ణికానని ప్రమాణంచేసి చెబుతాను. ఇప్పుడా .... ఇప్పుడతడు నాకు వ్యతిరేకుడై పోయాడు.

జెఫ — మ్యాడిసన్ గారికి మీరంటే మంచి అభిప్రాయమే ఉంది. కాని ఈ స్పెక్యులేషన్....

హామి — ఆయన సదభిప్రాయం నాకక్కరలేదు. నాకు కావలసింది ఆయన సహాయం. మీ పలుకుబడి నాకోసం ఉపయోగించగలరా?

జెఫ — మీకు తెలుసుగదా ఆరు సంవత్సరాలనించి నేను విదేశాలలో ఉన్నాను. ఇక్కడి పరిస్థితులలో స్వంత పరిచయంలేదు. ఈ విషయాలు పఠించడానికి కొంత వ్యవధి కావాలి.

హామి — వ్యవధి లేదు.

జెఫ — మూడు నాలుగు వారాలు.

హామి — మూడు నాలుగు వారాలా? నేను చెప్పింది అర్థం చేసుకోండి. ఉత్తరాది చీలిపోవడానికి సిద్ధంగాఉంది.

జెఫ — వేరు పడిపోవడానికే?

హామి — ప్రెసిడెంట్ మీతో చెప్పలేదూ?

జెఫ — లేదు.

హామి — నా బిల్లుపాసు కాకపోతే యూనియన్ చీలిపోయే అవకాశా లున్నాయి.

జెఫ — చాలా ఆందోళనకరమైన పరిస్థితులున్నాయని తెలుసుకొని....

హామి — కాంగ్రెసు సమావేశానికి రేపు రారాదా?

జెఫ — రెండుపక్షాలా వాదాలున్నాయి. (దీర్ఘ విరామం.) యూనియన్‌కే భంగం కలిగేటట్టయితే కాంగ్రెసులో వివేకవంతులు నలుగురూ కూర్చొని, శాంత వాతావరణంలో ఈ విషయం చర్చించి, సమాధానం కుదుర్చుకోడం మంచిది. ఇది నా అభిప్రాయం. (ఏదో ఒక నిర్ణయానికి వచ్చి) రేపురాత్రి మా ఇంటికి భోజనానికి రండి.

హామి — సంతోషం.

జెఫ — ఒకళ్లిద్దరు స్నేహితుల్ని కూడా పిలుస్తాను.

హామి — మాడిసన్నునా ?

జెఫ — ఇప్పుడేమీ చెప్పలేను. మాడిసన్ మీ ప్లానుకు చాలా వ్యతిరేకంగా ఉన్నాడు కదూ ?

హామి — ఆ ప్రతికూల తీవ్రతను తియ్యపరుస్తాను. న్యూయార్కులో జీవితవ్యయం ఎక్కువైపోయింది. అందుచేత రాజధానిని ఇక్కడినించి మార్చివేయాలనే ఒక ఉద్యమం ఉంది.

జెఫ — అవును.

హామి — తాత్కాలికంగా ఫిలడల్ఫియాలో పెడతామని వాగ్దానంకూడా జరిగింది. నా బిల్లు ప్యాస్ చేయమనండి. రాజధాని దక్షిణాదిని పెట్టిస్తానని మాడిసనుకు వాగ్దానమిస్తాను. శాశ్వతంగా. నేను వెస్ట్ఇండీస్‌లో పుట్టాను. రాజధాని ఎక్కడున్నా నాకొకటే. ఏప్రత్యేకప్రాంతమన్నా నాకభిమానంలేదు. మహా మహుడు వాషింగ్టన్ కోసం రాజధాని వర్జీనియాలో ఉంటే మంచిదనిపిస్తుంది.

జెఫ — (ఆగి) మీఇద్దరినీ ఒకచోటుకు తెస్తాను. మీరిద్దరూ పరస్పరం తుపాకులతో కాల్చుకొని చావకుండా నేనుంటాను.

హామి — (నవ్వుతాడు) ఇది న్యాయంగానే ఉంది.

జెఫ —(నోటుబుక్కుతీసి దానిలో వ్రాసుకుంటాడు.) చూశారా కర్నల్‌హామిల్టన్ ! రిపబ్లిక్ అంటే మనం నిస్పృహ పొందకూడదు.

హామి — అయ్యా, జెఫర్సన్‌గారూ ! నేనింతవరకు నిస్పృహ పొందలేదంటే అది నా బుద్ధివల్లకాదు, నా ప్రకృతివల్ల అనుకోండి. (జెఫర్సన్ నవ్వుతాడు.) మీ అడ్రసు ?

జెఫ — 23, మైడెన్‌లేన్.

హామి — 23, మైడెన్‌లేన్, ఏడింటికా ?

జెఫ — ఏడున్నరకు పెట్టండి.

(వాషింగ్టన్ ప్రవేశిస్తాడు.)

వాషిం — మీ ఇద్దరికీ పరిచయమైందా ?

హామి — ఐంది. స్పానిష్ రాయబారి ఏమంటాడు ?

వాషిం — అందరిలాగే మనమంటే వాళ్లందరికీ వేళాకోళంగా ఉంది.

హామి — సరే....(జెఫర్సన్ వైపు చూస్తాడు. చిరునవ్వునవ్వుతాడు.) మనం నిస్పృహ చెందనక్కరలేదు. ఏడున్నరా ? (వాషింగ్టనుకు వంగి నమస్కారంచేసి) ఎక్సెలెన్సీ ! (నిష్క్రమిస్తాడు.)

జెఫ — మహా తెలివితేటలైనవాడు.

వాషిం — అతన్ని చిన్నసింహం అని పిలుస్తారు.

జెఫ — చిన్న సింహమా ? కనిపిస్తూనే ఉంది. (తనతోలుసంచి ఎత్తుకుంటాడు.) ఫ్రెంచిటారిఫ్ స్థితిగతులమీద నారిపోర్టునివేదించేదా ?

వాషిం — తప్పక.

జెఫ — ఫ్రాన్సు నించి బయలుదేరేముందు చేపలుపట్టే హక్కును గూర్చి మోషె నెక్కార్‌తో మాట్లాడాను. గతసంవత్సరం 23వేలఫ్రాంకుల .... (వాషింగ్టన్ దీర్ఘనిశ్వాసం విడుస్తాడు. జెఫర్సన్ తలఎత్తి చూస్తాడు. ప్రెసిడెంట్ కిటికీ బైటికి చూస్తాడు.) ఇవాళ బైట చాలా బాగుంది కదూ ?

వాషిం — (బాధపడుతూ) హ్మా ! .... అవును. అవును.

జెఫ — నాకోసం చేపలకఱ్ర ఒకటి ఉందా ?

వాషిం — (జెఫర్సన్‌వైపు చూచి, అల్మారీవద్దకు పోయి రెండు చేపలకఱ్రలు తీస్తాడు.) నీకెలా తెలిసింది. (ఒక జువ్వ జెఫర్సన్‌కు అందిస్తాడు.) ఇప్పుడు బాగుందా ?

జెఫ — (నవ్వుతాడు.) రిపబ్లిక్‌యొక్క సంగతి సందర్భాలు చర్చించడానికి ఇంత కంటె మంచిపద్ధతినాకు మరొకటి కనిపించదు.

(వాషింగ్టన్ జాకెట్టుతీసివేసి, అల్మారీ లోంచి పాతదాన్ని కట్టి బైటికి తీసి నౌకరును పిలుస్తాడు.)

వాషిం — సార్జెంట్ ! (జాకెట్టు తొడగడంలో జెఫర్సన్ సహాయం చేస్తాడు.) సార్జెంట్ !

(సార్జెంట్ ప్రవేశిస్తాడు.)

సార్జెంట్ — చిత్తం !

వాషిం — ఎవ్వరిని లోపలికి రానియ్యవద్దు. సెక్రెటరీ ఆఫ్ స్టేట్‌తో నేను సంప్రతిస్తున్నాను. తెలిసిందా ?

సార్జెంట్ – (గ్రహించి) చిత్తం. (నిష్క్రమిస్తాడు.)

వాషిం – (జెఫర్సన్ చెవిలో ఏదో ఊదుతాడు.) హంఫ్రీస్ నన్ను దుస్తుల్లో పట్టుకొన్నాడా అతని సాదింపు కిక అంతం ఉండదు. (వాషింగ్టన్ విగ్గుతీసి స్టాండుమీద పెడతాడు. పాత హ్యాటొకటి తలమీద పెట్టుకుంటాడు. చేపలకర్ర పట్టుకుంటాడు, తలుపు విప్పి ముందు తాను బైటికి పోయి ఎవరినో పంపించేసి వెనక్కి ఆగమని జెఫర్సన్‌కు సంజ్ఞ చేస్తాడు.) నౌకర్లలో ఒకడు.

జెఫ – ప్రజాస్వామ్యాన్ని వీళ్లామోదించారా ?

వాషిం – (జెఫర్సన్‌వంక చూచి దుఃఖంతో తలపంకించి) ఆమోదించరు. (మరోసారి బైటికి తొంగిచూస్తాడు. నదీతీరం స్వచ్ఛంగా ఉంది, నడువుమన్నట్టుగా జెఫర్సన్‌కు సైగచేస్తాడు.) రా ! (ఇద్దరూ దొంగతనంగా బైటికి వెళ్తున్నట్టు నిష్క్రమిస్తారు.)

## రెండవ రంగం

రంగం: న్యూయార్కులో ఒక హోటలు. దాని ఆవరణలో ఒక కమ్మరి దుకాణం. పెద్దద్వారం. హోటలువాకిలి అంగు లోంచి కనిపిస్తూ ఉంటుంది. కమ్మరి జాకబ్ ఒక గుర్రపునాడాన్ని సుత్తెతో కొట్టుతూ ఉంటాడు. అతని చేతికింద పనిచేసే మేట్ కొలిమికి పంపుకొట్టుతున్నాడు. వాకిలిలో నిలబడి అందరూ ఒక్కసారి నవ్వినట్టు ధ్వని. మనుష్యులు మాట్లాడు కుంటున్న చప్పుడు కూడా వినిపిస్తుంది. నురగతో నిండిఉన్న చిన్న తొట్లను చేతపట్టుకొని పాట్ బాయ్ తలుపుదాటి వస్తాడు.)

జాకబ్ – మ్యాట్ ! బాగా పంపుకొట్టు.

(ఖంగున వచ్చి పడుతుంది అతని సుత్తి మేట్ కొలిమితిత్తి ఊదుతుంటాడు. నిప్పు మోగిస్తూ ఉంటుంది. పాట్ బాయ్ నెడ్ ప్రవేశిస్తాడు.)

పాట్ — గుఱ్ఱానికి వెంటనే జీను వేయమంటున్నారు కర్నల్ హేమిల్టన్.

జాకబ్ — తొందరలో ఉన్నారా ?

(ఖంగున ధ్వని)

పాట్ — అవును

జాకబ్ — తనపార్టీ విడిచిపెడ్తున్నాడా ? ఇంత త్వరగానా ?

పాట్ — అవును.

మేట్ — ఇంకా వాళ్లు త్రేన్పు నారంభించనైనా లేదు.

జాకబ్ — మేట్ ! నిప్పు చల్లారుతుంది.

మేట్ — నేను పంపు చేస్తూనే ఉన్నాను.

పాట్ — త్వరగా జీను వేయమంటున్నా రాయన.

మేట్ — విన్నాము.

పాట్ — (విసుక్కుంటూ) ఆయన చెప్పమన్నది..................

మేట్ — (మాట తెగగోస్తూ) అట్లానే.

జాకబ్ — ఇల్లా వినండయ్యా ! కిందా, మీరిద్దరూ, ఈవేళ. కాదూ ?

(ఆగి ఇద్దరివైపు చూస్తాడు. తెల ఫ్లోకి మళ్ళా సుత్తితో గుఱ్ఱపు నాడంపై కొడుతాడు.)

పాట్ — (క్షమించమంటున్నట్టుగా అక్కడ నిలబడి నోరీల మాటల్లాంటివి ఏంటున్నారు. నాకు పిచ్చెక్కి నట్టుంది.

జాకబ్ — మేట్ ! పోయి గుఱ్ఱానికి కళ్లెం వెయ్యి.

మేట్ — సరే. (పోయి కళ్లెం జీనూ తెస్తాడు.)

పాట్ — కాగితంనోట్లతో లక్షలు సంపాదించిన దాన్నిగూర్చి గొప్ప చెప్పుకుంటున్నారు. నేను మాఅక్కయ్య సంగతి ఆలోచిస్తున్నాను.

మేట్ — నేనో ? నన్ను మరచిపోకు. మూడువందల డాలర్లు. నాజేబులోవి (నవ్వి ఊస్తాడు.)

పాట్ — ఒకాయన ఏంచెపుతున్నాడో తెలుసా ? సంయుక్తరాష్ట్రాల అధిపతికి అధ్యక్షుడన్న పేరు సరిపోదట. దానిలో ఠీవి లేదట.

మాట్ — ఏదైనా ఫ్రెంచిపేరు పెట్టమంటాడా ?

పాట్ — అదే అతను చెప్పింది. క్రికెట్ క్లబ్బులకూ, ఫైర్ కంపెనీలకు కూడా అధ్యక్షు లుంటారట.

మేట్ — ఏం కావాలంటారు వాళ్లు ? రాయల్ హైనెస్ అనమంటారా ?
పాట్ — అవును. అదే.

(జాకబ్ తలెత్తి చూస్తాడు. అతని మొహంపై విసుగుదల కనిపి స్తుంది )

జాకబ్ — అదా నువ్వంటోంది ?
పాట్ — అలాగని వాళ్లంటున్నారు.
మేట్ — అంతా పేరుకు.

(అతను నిష్క్రమిస్తాడు తలుపుదాటి కొత్తగావచ్చిన వాళ్లకు నమస్కరిస్తాడు. జెఫర్సన్ గొంతు : "గుడ్ ఆఫ్టర్ నూన్, మాట్ !" మన్రో, మాడిసన్ లతో జెఫర్సన్ ప్రవేశిస్తాడు.)

జెఫ — (మాడిసన్‌తో) ఇంకా తరచుగా ఉత్తరాలు వ్రాస్తూఉండమని మాపిల్లలతో చెపుతావు కదూ ?
మాడి — తప్పక చెపుతాను.
జెఫ — మాంటిసెల్లోలో ప్రతిదాన్నిగూర్చి తెలుసుకోవాలని ఉంది — ప్యాట్సీ మొదలు గ్రిజిల్ వరకూ.
మన్రో — గ్రిజిల్ ఎవరు ?
జెఫ — మాపెంపుడు పంది.

(మన్రో మాడిసన్లు నవ్వుతారు.)

జాకబ్ — నమస్కారం, జెఫర్సన్‌గారూ !
జెఫ — బాగున్నావా, జాకబ్ ?
జాకబ్ — ఓమోస్తరుగా. మీ రాజ్ఞాపించినట్లు అవి చేశాను. అవిగో ఆ టూల్ బెంచి మీద ఉన్నాయి.
జెఫ — బేష్ !
మన్రో — ఏమయ్యా ! నాగుర్రం ముందుకాలు కుంటుతోంది.
జాకబ్ — ఏదైనా కంకరరాయి గుచ్చుకుందేమో నండి.
మన్రో — కావచ్చు.
జెఫ — జేమ్స్ ! తననాడంపోయిందని చెప్పుతుందా అన్నట్లు నావైపు చూస్తుంది.
మన్రో — అదనుకుంటారా ?
జాకబ్ — ఇప్పుడే ఒక్కనిమిషంలో చూసి చెపుతాను.

మాడి — జాగ్రత్తగా అంతా చూసిపెట్టు. దీర్ఘప్రయాణం మీద వెళుతున్నాను.

జాకబ్ — ఎక్కడికండి ఎడిసన్‌గారూ ?

మాడి — ఇంటికి.

జెఫ — (ఫిట్టింగులు చూస్తూ కూర్చుంటాడు.) వర్జీనియా

జాకబ్ — ఇవాళ వాతావరణం బాగుందండి.

మాడి — ఆదర్శప్రాయంగా ఉంది.

జెఫ — లిలాకులు బాగా పుష్పించి ఉంటాయి. గోల్డెన్ విల్లోలూ బాదాముచెట్లూ కూడా చక్కగాపూచిఉంటాయి.

జాకబ్ — ఇంత త్వరగానా ?

జెఫ — వర్జీనియాలో అంతే.

జాకబ్ — అలానా ?

(స్టేజి వెనకాల పక్కన నవ్వుతున్న ధ్వని.)

మాడి — సర్దాఅయిన విందుందే అక్కడ ?

జాకబ్ — కర్నల్ హామిల్టన్ స్నేహితులు కొంద రతనికి విందిచ్చారు.

మన్రో — అతని బిల్లు ప్యాసైందని ఆనందిస్తున్నారు కాబోలు.

జాకబ్ — అవునండి. (బైటికి వెళతాడు )

మన్రో — (కోపంతో) అవునా ?

జెఫ — జేమ్స్ ! ఇప్పుడు................

మన్రో — పోనీ లెద్దురూ, జెఫర్సన్‌గారూ !

జెఫ — తప్పనిసరి అయిపోయింది నాకు. హామిల్టన్‌తో ఏకీభవించక తప్పిందికాదు

మన్రో — నువ్వు లాటిన్లో ఎన్ని పేర్లు పెట్టినా పంది పందే.

మాడి — రెండు చెడుగుల్లోకి ఇదే మంచి దనిపించింది.

మన్రో — నువ్వు నిజంగా అలా అనుకుంటావా ?

మాడి — (పైపైకి) అవును. అలానే అనుకుంటాను.

మన్రో — జెఫర్సన్‌గారూ ! మీరో ?

జెఫ — (సందేహాస్పదంగా) నాకు తెలియదు. నే........ఆశిస్తాను. నేను ....

(తెరవెనకనించి నవ్వు. మన్రో చికాకు పడతాడు. జెఫర్సన్ అతని వైపు చూస్తాడు మాడిసన్ వైపు తిరిగి చిరునవ్వు నవ్వుతాడు. ఫిట్టింగులు చేత్తో ఎత్తి వాటిని పరీక్షిస్తాడు.)

మన్రో — మీ రీవేళ పత్రిక చూసే ఉంటారు.

జెఫ — చూశాను.

మేట్ — (ప్రవేశించి మాడిసన్‌తో) మీ గుర్రానికి దానావెయ్యాలండి. అది అడుగుతుంది.

మాడి — సరే. కొన్ని ఓట్లు వెయ్యి.

(మేట్ ఒక సంచిలో ఇన్ని ఓట్లు పోసుకుంటాడు ;)

మేట్ — సెనేటర్ మన్రోగారూ ! మీగుర్రమో ?

మన్రో — (గడియారం చూచి) అవును. ఇది దానిభోజనం వేళ.

మేట్ — జెఫర్సన్‌గారూ !

జెఫ — (లేస్తూ) నాగుర్రానికి ఇప్పుడే దానా వేశాను, మేట్ ! నీకు కృతజ్ఞుణ్ణి. అయినా ఒక్క క్యారెట్ జత ఉంటే వేయి—అదంటే మనకు నిర్లక్ష్యంగా ఉందని అనుకోకుండా.

మెట్ — (నవ్వుతాడు) వంటింట్లో క్యారెట్లున్నాయి. (మాడిసనుకూ మన్రోకి ఓట్లు సంచు లిసాడు. మాడిసన్ తనఓట్లసంచి పట్టుకొని నిష్క్రమిస్తాడు. జాకబ్ ప్రవేశిస్తాడు. ఒకగుర్రపు నాడం అతని చేతిలో ఉంటుంది.)

జాకబ్ — సరిగ్గా తయారైంది.

మన్రో — బాగుంది. వెంటనే కొట్టేయించేస్తావా ?

జాకబ్ — అలానేనండి.

(మన్రో ఓట్లసంచి తీసుకువెళ్లిపోతాడు. నాడం కొలిమిలో పెట్టి జాకబ్ కొలిమి తిత్తి ఊదుతాడు. జాకబ్ తనకోసం చేసిన ఫిట్టింగులను పరీక్షిస్తుంటాడు, జెఫర్సన్.)

జెఫ — చాలా బాగా చేశావు.

జాకబ్ — బాగున్నాయండి ?

జెఫ — చాలా బాగున్నాయి. నువ్వు మంచి పనివాడివి.

జాకబ్ — నా పని నాకు తెలియకపోతే ఎలానండి ? ఇరవై ఏళ్లఅనుభవం. (జెఫర్సన్ ఇనపముక్కల్ని అతుకుతాడు.) మళ్లా కొత్తవి ఏమైనా కనిపెడు తున్నారండి?

జెఫ — ఒక్క సదుపాయం కనిపెట్టాను.

జాకబ్ — ఈసారి ఏమిటండి.

జెఫ — (జాకబ్ దగ్గిరికి వచ్చి) వంటింటిలోంచి భోజనాలగదిలోకి భోజనం వేడిగాను ద్రాక్షాసవం చల్లగాను తెచ్చి ఇచ్చే ఒక జారుడుసదుపాయంచేశాను. అవి పట్టుకొని మనుష్యులు కిందనించి పైకి, పైనించి కిందికి పరుగెత్త నక్కరలేదు

జాకబ్ — ఇది చాలా మంచిదే కనిపెట్టారు.

జెఫ — అలా అనుకొంటున్నావా నువ్వు ?

జాకబ్ — మీరు చేసిన బగ్గీల మరమ్మతులాపును గూర్చి నాభార్యతో చెప్పాను. ఏదో పనికివచ్చేదే కనిపెట్టారంది ఆమె. ఈసదుపాయం ఆమెకు బాగా నచ్చుతుంది. ఐతే దీనికేమని పేరు పెడుతున్నారు ?

జెఫ — డంబ్ వైటర్.

జాకబ్ — డంబ్‌వైటర్ ? (మెల్లగా ఒక్కొక్క అక్షరమే చెబుతాడు.) ఓహో ! ఓహో ! (పొట్ట చెక్కలయ్యేలట్టు నవ్వుతాడు.) డంబ్ వైటర్ ! చాలా బాగుంది. జాకబ్ కొలిమిలోంచి ఒక గుర్రపునాడం తీస్తాడు. దిమ్మమీద పెట్టి దానిరూపం దిద్దుతాడు.)

జెఫ — జాకబ్ !

జాకబ్ — (తన పని చేస్తూనే) అఁ ?

జెఫ — నాకు నీసలహా కావాలి.

జాకబ్ — దేన్ని గూర్చి ?

జెఫ — ఇప్పుడు మేము ఆమోదించిన డబ్బుశాసనాన్ని గూర్చి.

జాకబ్ — ఓహో ! (ఒక్కక్షణం పైకి చూస్తాడు.)

జెఫ — దాన్ని గూర్చి నీఅభిప్రాయం ఏమిటి ?

జాకబ్ — మీకు అదంటే ఎక్కువ ఇష్టం లేదా ?

జెఫ — నీ కిష్టంలేదా ?

జాకబ్ — లేదు. (రుసరుస లాడ్తాడు. నాడాన్ని సుత్తితో కొడ్తాడు.)

జెఫ — స్పెక్యులేటర్ల మూలాన్నా ?

జాకబ్ — అవును.

జెఫ — అదా ? అయినా దేశానికి దాని వల్ల మంచి ఉపకారమైంది.

జాకబ్ — కావచ్చు.

జెఫ — నీమిత్రులు సామాన్యంగా దీన్నిగూర్చి ఏమనుకొంటున్నారు ?

జాకబ్ — వాళ్ల కదంటే ఇష్టం లేదండి.

జెఫ — అట్లానా ?

(పాట్ బాయ్ తలుపులో తల కాయ దూర్చి చూస్తాడు.)

నెడ్ — జీనూ అదీ వేసేశారా ? అతను ఎదురుచూస్తున్నాడు.

జాకబ్ — నెడ్! జెఫర్సన్‌గారు డబ్బుశాసనాన్ని (మనీబిల్లును) గూర్చి అడుగుతున్నారు. ఆయన చెప్పుకో.

నెడ్ — మారక్తంపీల్చే మోసాల వలఅది. జెఫర్సన్‌గారూ? (హఠాత్తుగా అతనికి ప్రళయకోపం వస్తుంది.) నా అక్కయ్యని చూడండి. ఆమె భర్త సారటోగా యుద్ధంలో చనిపోయాడు. ఇద్దరు పిల్లలూ కొంత కాగితం డబ్బూ విడిచిపెట్టి వెళ్లాడామెకు. ఎన్నో సంవత్సరాలనించి ఆడబ్బు భద్రపరచి ఉంచిందామె. రెండు నెల్లక్రిందిట ఆమెతో స్పెక్యులేటర్లు ఏమన్నారంటే "ఆనోట్లమీద అసలు డబ్బనేదే వస్తే కొన్ని సంవత్సరాలు పట్టుతుంది. అందుకోసం పంతో ఒకంతకు అమ్మేయడమే మంచిది" ఇలా అని ఆరువందలడాలర్లకు నలభైడాలర్లు ఇప్పించారు. తర్వాత జాకబ్ కూడబెట్టినదానిమీదా పట్టించారు.

(మేట్ ప్రవేశిస్తాడు.)

జెఫ — అట్లానా?

జాకబ్ — తొమ్మిదివందలు.

నెడ్ — రెవల్యూషన్ నాటి దాడబ్బు—అతని జీతం.

జాకబ్ — రెవల్యూషనును చివరికిందుకు తయారుచేశాము!

జెఫ — (లేచి నిలబడతాడు) కాదు.

మేట్ — వేళ అవుతూఉంది. మనం............

(హామిల్టన్ ప్రవేశిస్తాడు.)

హామి — నా గుర్రం సిద్ధంగా ఉందా, జాకబ్! జెఫర్సన్‌గారూ? మిమ్మల్ని ఇందాక వాకిలిలో చూచినట్టుంది. మంచి వర్తమాన మొకటి ఉంది మీతో చెప్పడానికి.

(నెడ్ నిష్క్రమిస్తాడు.)

జెఫ — భేష్!

జాకబ్ — మేట్! సిద్ధంగా ఉందా?

మేట్ — సిద్ధంగా ఉంది. (వెళ్ళిపోతాడు.)

జాకబ్ — కర్నల్ హామిల్టన్! మీ గుర్రం సిద్ధంగా ఉంది.

హామి — జాకబ్! కృతజ్ఞుణ్ణి. ఈవేళ రోజు చాలా బాగుంది.

జాకబ్ — (గుర్రుమంటాడు) అవును. (వెళ్ళిపోతాడు.)

హామి — (జెఫర్సన్) ఏదో కోపంగా ఉన్నా డీవేళ. కాదూ? అజీర్ణమైఉంటుంది

జెఫ — (తల ఊపుతూ) స్పెక్యులేటర్లు.

హామి — జేకబా ? (జెఫర్సన్ తల ఊపుతాడు.) సిగ్గు !

జెఫ — మేట్, పాట్‌బాయ్ కూడాను.

హామి — తమ కాగితపునోట్లు అట్టేపెట్టుకోవలసింది. ఎందు కమ్మారు ?

జెఫ — వా ళ్లలా చేయకపోలేదు. ఏడు సంవత్సరాలవరకు పట్టిఉంచారు.

హామి — ఛ్! తమ ప్రభుత్వం అంటే వాళ్లకు మరికొంత నమ్మకం ఉండవలసింది.

జెఫ — ఈ బిల్లువల్ల వాళ్లకాగితం నోట్లకు పూర్తి మారకం లభిస్తుందని వాళ్లకు ఎలా తెలుస్తుంది ? దీనివల్ల నాకు చాలా బాధకలిగింది.

హామి — మీరు బాధపడ్డారా ?

జెఫ — చాలా. ఈబిల్లువల్ల కలిగే ప్రయోజనం కొందరు స్పెక్యులేటర్లకు మాత్రమే తెలిసింది. దానివల్ల లాభంపొందే వాళ్లు అనుచితలాభం పొందు తున్నారు.

హామి — ఉన్నదానికంటె దాన్నింకా ఎక్కువచేసి చెప్పవద్దు.

జెఫ — దీన్నిగూర్చి చాలా చెడ్డగా చెప్పుకొంటున్నారు.

హామి — ఉత్త బాతాఖానీ కబుర్లు.

జెఫ — ఎంతమాత్రం కాదు.

హామి — కాగితంనోటుతెచ్చిన ప్రతివాడిని ఈనోటు ఎక్కడనించి వచ్చిందని అడగలేముకదా. ఇంతకీ ఈవిధంగానైనా వీళ్లకు నాలుగుడబ్బులు దొరికేయి.

జెఫ — ఈస్పెక్యులేషన్ రాకుండా చేయడానికి ఏదైనా మార్గం ఉండవలసింది.

హామి — నేను మీవైఖరి తెలుసుకోలేకుండా ఉన్నాను. (రంగం వెనకనించి విరగ బడి నవ్వుతున్నట్టు ధ్వని.) ఈదేశాన్ని అభివృద్ధిపరచాలంటే గొప్పధనికుల్ని కొందరిని సృష్టించాలి. వాళ్లక్కడ పెద్ద ఫ్యాక్టరీలు పరిశ్రమలూ నిర్మిస్తు న్నారు. వాళ్లు అమెరికాను నిర్మిస్తున్నారు.

జెఫ — అదినరే. వాళ్లను ప్రోత్సహిద్దాము, కాని ప్రజలను నష్టపరచి కాదు.

హామి — మీరూ మాడిసన్నున్నూ—ప్రజలు గుసగుసలాడితే మీరు వణుకుతారు.

(మన్రో, మాడిసన్ ప్రవేశిస్తారు వాళ్ళ సంభాషణ వింటూ నిశ్చలంగా నిలబడతారు.)

జెఫ — అది ఉచితమే కదా ? ఏమంటారు ?

హామి — ఈదేశపు సౌఖ్యం గట్టి పునాదులపై స్థాపింపబడాలని నేను నిశ్చయించు కొన్నాను. బలమైన ధనికవర్గం వల్లనే అది సాధ్యమౌతుందని నాఅభిప్రాయం. ప్రజల తెలివితక్కువలనుండి దేశాన్ని వాళ్లే రక్షిస్తా రని నామతం.

జెఫ — అయితే ఈబిల్లు అవనిక పర్గానికి పుజాములు వేయడానికా ?

హామి — సరిగ్గా అదే.

జెఫ — అది నాకు తెలియదు, దాన్నిగూర్చి నాతో ఎప్పుడూ చెప్పకపోతివి. నిజం చెప్పాలంటే, మీబిల్లు ఆమోదించేటట్టు చేసి ఇప్పుడు చింతిస్తున్నాను

హామి — మిమ్మల్ని బలవంత పెట్టానా ? మీరు ఇరవై ఒక్క సంవత్సరాలపాటు రాజకీయాల్లో ఉన్నారు. ఏమీ ఎరగనట్టు నటిస్తారేమి ? మనం చేసుకొన్న రాజీబేరం మీకు సంతృప్తికరంగా లేదా ? అదేనా ?

జెఫ — బేరమా ?

హామి — రాజ్యం రాజధాని మీస్టేటుకు పోతుంది, కాని నాస్టేటుకు రాదు.

జెఫ — ఓ, ఓ ! ఇక మాట్లాడవద్దు.

హామి — ఇదంతా చూస్తే పయోముఖవిషకుంభత్వంగా ఉంది. ఆర్థిక విషయాలను గూర్చి ఏమీ తెలియదని ఒకనిమిషం అంటారు. మరునిమిషంలో పెద్ద పండితులుగా మాట్లాడతారు. ఇదేంటండీ !

జెఫ — కర్నల్ ! నువ్వేం అనుకొంటున్నావు ? మనరాజ్యాంగ ప్రణాళికను వెంటనే చెరిపివేద్దామా ?

హామి — (తిరుగుతాడు. మన్రోని ఆశ్చర్యంగా చూచి గొణుక్కుంటాడు.) రాజ్యాంగ ప్రణాళికా ?

జెఫ — దాన్ని నువ్వు బలపరిచావు.

హామి — (కోపంతో) నాకు వేరే మార్గం లేకపోయింది దేశం అరాజకంవైపు వెళ్లిపోతూఉంటే ఊరకే చూస్తూ ఉండలేకపోయాను. (క్షణం ఆగుతాడు. తన్నుతాను సంయమించుకోడానికి ప్రయత్నిస్తాడు.) ఈ ప్రభుత్వం అయిదేళ్లకంటె ఎక్కువకాలం నిలవదని నా అభిప్రాయం. అయినా ఈప్రయోగాన్ని నడపడానికి ఎలాగా సమ్మతించాము కాబట్టి దాని కొక అవకాశం ఇస్తున్నాను. కాని ఒక్కవిషయం స్పష్టంగా జ్ఞాపకముంచుకోండి : అది ఉన్నంతకాలం ధనికవర్గపు ప్రజారాజ్యంగానే ఉంటుంది. కేవలం సర్వప్రజారాజ్యం కావాలన్న వాళ్ల కిక్కడ స్థానం లేదు. వాళ్లను మరో ప్రభుత్వంక్రిందికి వెళ్లి ఉండమనండి. నమస్కారం ! (వెళ్లిపోతాడు.)

జెఫ — (మన్రోతో) నన్ను క్షమించమని ప్రార్థిస్తున్నాను. చాలా పొరపాటు చేశాను. (మాడిసన్‌తో) నన్ను క్షమించు, జెమ్మీ ! ఇతనితో రాజీపడమని నిన్ను ప్రార్థించకుండా ఉండవలసింది.

మాడి — టామ్ ! దానినుండి మనం తప్పించుకోనూలేము. మన మనుకోని

వర్గాల మనకాన్స్టిట్యూషన్ నడపాలని అతను ప్రయత్నిస్తున్నాడు.

మన్రో — ప్రభుత్వభాండాగారంనుంచి స్పెక్యులేషన్ చేయటంకోసం హామిల్టనే ఒకడికి డబ్బిచ్చాడని ఒకాయన ప్రమాణంచేసి నాకు వాఙ్మూలం ఇచ్చాడు.

జెఫ — ఇది నేను నమ్మలేను.

మన్రో — హామిల్టన్ చేత్తో వ్రాసిన ఉత్తరా లున్నాయి.

జెఫ — అవంతా నమ్మవద్దు. వ్యక్తిగతంగా అతను నిజాయితీ కలవాడే. అది నేను గట్టిగా చెప్పగలను

మన్రో — ఈ ఉత్తరాలు తీసుకుపోయి అతనిమొహంమీద అడగరాదూ ? ఆ ఉత్తరాల అర్థం ఏమిటో చెప్పమనండి ?

జెఫ — ఆపని నేను చేయలేను.

మన్రో — ఎందుకు చేయలేవు ?

జెఫ — ఓహో ! నాకిలాంటి అర్థప్రశ్నలు వేయకు.

మన్రో — అగ్నిని అగ్నితోనే ఎదుర్కోవాలి.

జెఫ — నాలో అగ్ని లేదు.

మన్రో — అతని బిల్లు ఫెడరలిస్టుపార్టీ ప్రభుత్వంలో సగంమందిని అదృష్టవంతుల్ని శిఖరం ఎక్కించింది. వాళ్లకు మహోపకారం చేసి పార్టీని తనదానిగా చేసుకున్నాడు. ఇదంతా స్పష్టంగానే కనిపిస్తుంది. అతను వాళ్లనెక్కడికి తీసుకు వెళ్లదలచుకొన్నాడో భగవంతుడికే తెలియాలి. ఇది నువ్వు సాగనివ్వకూడదు. అతన్ని ఎదుర్కోవాలి. ఫెడరలిస్టుపార్టీ నాయకత్వం అతని చేతిలోంచి నువ్వు లాక్కోవాలి.

జెఫ — (విముఖభావం ఉప్పొంగుతుంది) పార్టీరాజకీయాలంటే నాకు అసహ్యం. జేమ్స్ ! ఒక రాజకీయపక్షం వీపు మీద ఎక్కి స్వర్గానికి వెళ్లమన్నా వెళ్లను. దానిబదులు నరకంలోనే కాలడానికి ఇష్టపడతాను.

(జాకబ్ జీనుసవరిస్తూ వెలుపల గుమ్మంలో కనిపిస్తాడు.)

జాకబ్ — మీగుర్రం సిద్ధంగా ఉందండి. జెఫర్సన్‌గారూ !

జెఫ — (అతనివైపుచూచి అంటాడు.) ఓహో ! థాంక్ యు, జాకబ్ !

జాకబ్ — అయ్యా ! మీగుర్రాలుకూడా సిద్ధంగా ఉన్నాయండి.

మన్రో — సరే.

(జాకబ్ వెళ్లిపోతాడు.)

జెఫ — (జాకబ్‌వంక చూస్తూ నిక్షిప్తమైన బొంగురుగొంతుతో) జేమ్స్ ! ఆ ఉత్తరాలను హెచ్చి పారవేసుకున్నావు. ఇక శక్తిగలవిషయాల్లో అతనిబిల్లు అంత

చెడ్డదికాదు. కాని దానివల్ల మనప్రజలకు నష్టమైంది. ఈబిల్లుద్వారా ఒక మోసకారిదళాన్ని సృష్టించగలిగా డితను. అతను మనరాజ్యాంగ ప్రణాళికనే తిరగవేయ ప్రయత్నించాడా, అతన్ని ఎదిరిసాను — కాని అది నాపద్ధతి ననుసరించే జరగాలి. నే నేమీ తగువులకు పోయేవాణ్ణి కాను — నేను రాజకీయ నాయకుణ్ణికాను. (మాడిసన్‌వద్దకు వెళ్ళి) మా ఇరుగుపొరుగువాళ్ళ నందరినీ అడిగానని చెప్పు. నేను చెప్పిన అవిషయం....(మాడిసన్ చేతిలో ఒకకాగితం పెడ్తాడు.)

మాడి — (తలఊపి) వెళ్ళగానే మొట్టమొదటిపని ఇదే చేస్తాను.

జెఫ — కృతజ్ఞుణ్ణి, జిమ్మీ !

మాడి — నీకిది ఎంతముఖ్యమో నాకు తెలుసు.

జెఫ — జిమ్మీ ! సుఖంగా ప్రయాణంచేసిపో. త్వరగా తిరిగిరా. (మన్రోతో) ఈవేళరాత్రి చదరంగం ఒకఆట ఆడదామా ? (మన్రో తల ఊపుతాడు. జెఫర్సన్ నిష్క్రమిస్తాడు.)

మన్రో — (అతనివైపు చూస్తూ) ఇతను మనం ఎరిగిన జెఫర్సన్ కాదు.

మాడి — కాదు.

మన్రో — దేశం అంతా బాగా ఉడుకెత్తిఉంది. ఇప్పుడు దానికో స్వరూపం ఏర్పడుతుంది. అతన్ని లేపడానికి ఇంకేం కావాలి ?

మాడి — లాజరస్ సమాధిముందు ఏసుక్రీస్తు కన్నీళ్ళు.

మన్రో — టామ్ చచ్చిపోయినట్టే మాటాడుతున్నావు.

మాడి — (జెఫర్సన్ ఇచ్చిపోయిన కాగితం విప్పి చూస్తాడు.) నీకు గ్రీకుభాష అర్థమౌతుందా ?

మన్రో — కాదు. అనువదించి చెప్పు.

మాడి — చూచాయగా అర్థం చెపుతాను.

" ఆనీడలక్రింద స్నేహితుల, ప్రేమికుల
దుఃఖాగ్ని రగలడం మాని
పోవచ్చు. నాదుఃఖాగ్ని—నా ఒక్క
డిదే అమరణాంతం రగులుతూనే ఉంటుంది. "

మన్రో — తొమ్మిదేళ్ళ తర్వాతనా ?

మాడి — తొమ్మిదేళ్ళ తర్వాత !

(జేకబ్, మేక్ ప్రవేశిస్తారు. పొయ్యిదగ్గిరికి వెళ్తారు.)

జాకబ్ — గుర్రాలు సిద్ధంగా ఉన్నాయి.

మన్రో — థాంక్, యు, జేకబ్ !

(నెడ్ ప్రవేశిస్తాడు. మాడిసన్ మన్రోలు వెళ్లిపోతారు.)

నెడ్ — (ప్రచండమైన కోపంతో ఏప్రన్ చింపి పారవేస్తూ) వీళ్ళపని మళ్ళా చేశానా ఒట్టనుకొండి. ఇప్పుడు వీళ్ళేమంటున్నారో తెలుసా ? మనకి డ్యూకులు లార్డులు కావాలట !

మేట్ — డ్యూకులూ లార్డులున్నా ?

నెడ్ — అవును, మన రక్తాలుపీల్చే మోసగాళ్ళు.

జాకబ్ — గాలికొట్టు ; మేట్ ! గాలికొట్టు.

మేట్ — వాళ్ళేమి చేయాలనుకుంటున్నారు ? బానిసరైతులుగా మార్చాలను కుంటున్నారా మనల్ని ?

నేడ్ — లెక్సింగ్టన్ యుద్ధమూ, బంకర్‌హిల్ యుద్ధమూ ఇందుకోసమేనా మేము చేసింది ? నాఅన్నా నాచెల్లెలిమొగుడూ చచ్చింది ఈస్వాతంత్ర్యంకోసమేనా ? మీవిప్లవం ఏమైం దిప్పుడు ?

జాకబ్ — (పళ్ళు బిగించి) గాలికొట్టు, మేట్ ! గాలికొట్టవోయ్ ! (మేట్ కొలిమి తిత్తి గట్టిగా ఉదుతాడు. కొలిమిలో నిప్పు కణకణలాడుతుంది. దాని వెలుతురులో కోపంతోనిండిన ముఖాలు ఇంకా స్పష్టంగా కనిపిస్తున్నాయి. జేకబ్ కాలిన ఇనుమును సుత్తితో కొట్టుతున్నాడు. సుత్తిపోట్లు ఖంగు ఖంగున మోగుతున్నాయి.)

## రెండవ అంకం

### మొదటి రంగం

రంగం : హామిల్టన్ ఇల్లు. కొవ్వొత్తుల వెలుగు. హామిల్టన్, హంఫ్రీస్, నాక్సు కాఫీ తాగుతున్నారు. హామిల్టన్‌సతి కాఫీ పోస్తుంది. హామిల్టన్ ఒక చుట్టలడబ్బా విప్పుతున్నాడు.

హామిల్టన్ సతి — (సోఫాపై కూర్చొని) లూయీ, మేరీ జైల్లో ఉన్నసంగతి తలచు కొన్నప్పుడల్లా !

హంఫ్రీస్ — రాజప్రాసాదం పతనమైనప్పటినించీ ఒక్క నిమిషం నిద్రపోలేదను కోండి. భయంకరం! ఇవాళ గెజెట్‌లో ఫెనో్ వ్రాసింది చదివారా ?

హామి. సతి — ఫెనో వ్రాసింది ఎప్పుడూ విడిచిపెట్టను. అద్భుతంగా వ్రాస్తాడు కదూ ?

హంఫ్రీస్ — ఇది అతని మాస్టర్‌పీస్ !

హామి. సతి — నిస్సందేహంగా.

నాక్స్ — పరిస్థితులు మరీ విషమించి పోతున్నాయి. ఈ ఫ్రెంచి రిపబ్లిక్కును గూర్చి నీ అభిప్రాయం ఏమిటి, అలెక్ ?

హామిల్టన్ — ప్రమాదకరమైంది. చాలా ప్రమాదకరమైంది. మనలో సులభంగా ఉద్రిక్తులయ్యే వాళ్లపై దీని ప్రభావం ఎలా పడుతుందో అని భయపడు తున్నాను. (చుట్టలు పళ్ళెంలో పేరుస్తాడు.)

హంఫ్రీస్ — దానిమీదే జెఫర్సన్‌మీద మంచి దెబ్బతీశారు మీరు. అట్లా! దాని దెబ్బతీశారనుకోండి. దాని కతను తగునుకూడాను.

హామి. సతి — (నాక్స్‌తో) చక్కెర కావాలా ?

నాక్స్ — అవును.

హామి సతి — జెఫర్సన్‌గారు మరీ అసహ్యమైన ప్రజాస్వామ్యవాదుల్లో చేరను పుంటాను.

హామి — ప్రియా! అతను అలాంటివాడే అంటే నమ్ము.

హామి. సతి — ప్రతి మనిషి ప్రతి రెండవ మనిషితో అన్నివిధాల సమానుడని అతను నిజంగా నమ్ముతాడా ?

హామి — ఇంకా ఉత్తముడని కూడాను.

(అందరూ నవ్వుతారు. హంఫ్రీస్ దప్పట్లుకొడ్తాడు.)

హామి. సతి — వెన్న కావాలా ?

నాక్స్ — కానివ్వండి.

హామి — మనప్రజలు దాని కంగీకారం చూపిస్తున్నట్లున్నారు. ఒకళ్ళగొంతు కొకళ్ళు కోసుకొనేదాకా వాళ్ళు వేచి ఉండలేరు. (నాక్స్‌కు చుట్ట ఇస్తాడు ఇదొకటి కాల్చి చూడండి.

నాక్స్ — యుద్ధకాలంలో మీ రిది స్పష్టంగా చూచారుకదా ? సైన్యంలో.

హామి — సైన్యమా ? (హంఫ్రీస్‌కు చుట్ట ఇస్తాడు) కర్నల్ హంఫ్రీస్ ?

హంఫ్రీస్ — (చుట్ట తీసుకొని, ఏదో భయంతో దాన్ని పరీక్షిస్తాడు.) ఓహో ! ఇదా అకొత్తచుట్ట ?

హోమి — (బల్లదగ్గరికి వెళ్ళి చుట్టలు దానిపై పెడతాడు. నిప్పు వెలిగిస్తాడు.)
స్వాభిమాన పదవులనించి.... సైన్యమా ? అది సైన్యంకాదు. అదొక మంద.
ఒక్క మనిషి దాని మాతవేసుకువచ్చాడు. (నాక్స్ చుట్టకు నిప్పంటిస్తాడు.)

నాక్స్ — నాయకుడో ? (పెద్ద దమ్ము తీసి చుట్ట పీలుస్తాడు.)

హోమి — (తలఊపుతూ) వాషింగ్టన్ (హంఫ్రీస్ చుట్ట అంటించి పెడతాడు.)

నాక్స్ — (తనచుట్టను పరీక్షిస్తూ) చాలా రమూషా ఆకు.

హంఫ్రీస్ — (చుట్ట ఊదేస్తూ) మ్మ్ ! బాగుంది ! బాగుంది !

హోమి — (నాక్స్‌తో) హెన్రీ ! నీ కివి ఇష్టమే ననుకుంటాను. నీ కోసం ఒక కట్ట
పంపించమన్నాను.

నాక్స్ — ఎందుకు మీ కిశ్రమ ?

హోమి — దీనికి శ్రమ ఏమిటి ? (చుట్టలు ఏరి ఒకటి తీసుకొని నిప్పంటిస్తాడు.)

నాక్స్ — అవును. నాయకుడు ఒక మందను సైన్యంగా తయారు చేశాడు.
దీనికో సందేహ మేముంది ?

హోమి — అంతేకాదు. ఆ సైన్యం తయారుచేయడానికి చేతిలో కొరడా పట్టుకో
వలసి వచ్చింది. ఉరిస్తంభం కూడా తయారుచేయవలసి వచ్చింది. సైన్యం
కోసం అవలంబించిన పద్ధతే దేశంకోసం కూడా ఉపయోగించాలి. ఒక్క
బలవంతుడైన నాయకుడు కావాలిమనకు.

నాక్స్ — మన నాయకుడు వృద్ధుడై పోతున్నాడు.

హోమి — ఉన్నమాట సరిగ్గా చెప్పావు. అతని తర్వాత ఈ దేశాన్ని ఎలా పట్టి
ఉంచాలా అన్న విషయం ఆలోచిస్తూ ఒక్కొక్కప్పుడు రాత్రంతా
గడిపేస్తాను.

నాక్స్ — ఇంతకీ నన్నడిగితే అతని వ్యక్తిత్వమే ఈదేశాన్ని ఇలా కట్టుదిట్టంగా
పట్టి ఉంచిందనుకోండి. అతను లేకపోతే ఈ రాజ్యాంగ ప్రణాళిక దమ్మి
డీకి చెల్లదు.

హోమి — (కూర్చుంటాడు.) అయితే ప్రథమ సోపానంగా దానికి విలువఉంది.
(చుట్ట పీలుస్తూ) అద్భుతమైన వాసన ?

నాక్స్ — మ్మ్ !

హంఫ్రీస్ — (శుష్కంగా) కొంచెం ఘాటుగావుంది. (అందరూ నవ్వుతారు.
కుర్చీపక్కనున్న పళ్ళెంలో చుట్ట పడేస్తాడు.) నేను అలెక్‌తో ఏకీభవిస్తు
న్నాను. రాజరికం మనకు సర్వవిధాలా మోక్షప్రదంగా ఉండేది.

హామి. సతి — ఈవేళే నేను కొంతమంది మా ఆడవాళ్లతో ఇదేవిషయంపై మాట్లాడాను. మీరందరూ వీధుల్లోకి వెళతారు. ఇదంతా భయంకరంగా ఉంది. నిజమైన రాజు కావలసిన వేళ పరిపక్వమౌతుందని మేమందరం ఒప్పుకున్నాము.

బట్లర్ — (ప్రవేశించి) అయ్యా! సెనేటర్ మన్రోగారు పిలుస్తున్నారండి.

హామి — మన్రో ఆ? అతనెందుకు వచ్చిఉంటాడు ” (లేచి) లోపలికిరానీ.

బట్లర్ — చిత్తమండి (నిష్క్రమిస్తాడు.)

హంఫ్రీస్ — (లేచి) వీకో పల్లిటూరివాడు. జేమ్స్ మన్రో.

నాక్స్ — అతను మంచి సిపాయి. మొన్నటి యుద్ధంలో అతను పోరాడని చోటులేదు.

హామి — అయినా వాడిహృదయం మాత్రం గుమాస్తానే. అదంటే నాకసహ్యం.

హంఫ్రీస్ — గుమాస్తాగా ఉన్నవాడేగా. పదేళ్లకిందట జెఫర్సన్ లా ఆఫీసులో గుమాస్తాగా పనిచేశాడు.

హామి — నామట్టుకు చూస్తే ఇప్పుడూ అలాగే ఉన్నాడు. (ఇద్దరూ నవ్వుతారు. ఏదో జెఫర్సన్ పనిమీదే వచ్చాడని పందెం వేస్తాను. చూడండి. ఇప్పుడు మీకే తెలుస్తుంది.

(బట్లర్ ప్రవేశిస్తాడు.)

బట్లర్ — కర్నల్ మన్రో.

మన్రో — (మన్రో ప్రవేశించి నమస్కరిస్తాడు.) జెంటిల్‌మెన్! కర్నల్ హామిల్టన్!

(నాక్స్ లేచి నమస్కరించి మళ్లీకూర్చుంటాడు.)

హామి — కర్నల్ మన్రో. అనుకోకుండా మాకు ఆనందం కలిగించారు. నాభార్యనెప్పుడైనా కలిశారా ?

మన్రో — మిసెస్ హామిల్టన్. (వంగి నమస్కరిస్తాడు.) ఈవిధంగా మీఅందరి ఆనందానికి అంతరాయం కలిగించడానికి ఇష్టం లేకపోయినా వచ్చేశాను.

హామి — (బల్లదగ్గిరికి చుట్టలపళ్ళెంకోసం వెళ్తూ) మరేం పరవాలేదు.

మన్రో — ఇప్పటికి కొన్ని వారాలనించి మీ ఆఫీసులో కలుసుకొందామని ప్రయత్నిస్తున్నాను.

హామి — (మన్రోవద్దికి వెళ్ళి చుట్ట సమర్పిస్తాడు.) మా ఆఫీసుకు ఊపిరాడ్డం లేదనుకోండి............కొత్తపన్నులూ అవిన్నీ. చుట్ట కావాలా ?

మన్రో — అక్కర్లేదు, థాంక్స్ !

హామి — స్పానిష్‌దీవుల పొగాకు.

మన్రో — అక్కర్లేదు, థాంక్స్ ! వీలైతే మీతో ఏకాంతంగా మాట్లాడాలి.

మిసెస్ హామి — ఇదేదో భయంకరంగా ఉన్నట్టుందే !

నాక్స్ — (నిలబడి) సరే............

హంఫ్రీస్ — నా విగ్‌మేకర్‌తో నాకు పనిఉంది. సెలవు తీసుకొంటాను.

హామి — (వాళ్ల నాపుచేసి) అట్లాకాదు. మీరుండండి. మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. (మన్రోతో) మీ మనస్సులో ఏముందో చెప్పండి.

మన్రో — ఏకాంతంగా అని అన్నానుగా ?

హామి — (తన విసుగుదలను అణచుకొంటూ చిరునవ్వుతో) నేనిప్పుడు ఒక్కడినే మాట్లాడతాను. పగలంతా పనిచేసి అలసిపోయాను. వ్యవహారాలు చర్చించే ఓపికలేదు. ఆఫీసులో మాట్లాడుకుందాము. వీలైతే రేపు నాలుగున్నరకు రండి.

మన్రో — రేపు నాలుగ్గంటలకు నేను అధ్యక్షుణ్ణి చూస్తున్నాను.

హామి — అయితే మళ్లావారం పెట్టండి.

మన్రో — మీకు సంబంధించిన ఒక విషయాన్ని గూర్చే రేపు అధ్యక్షుణ్ణి కలుస్తున్నాను.

హామి — నన్నుగూర్చా ? సరే. మీకు శుభం ! అయితే చుట్ట తీసుకోరన్నమాట— చుట్ట కాల్చుకొంటూ వెళ్ళవచ్చుగా.

మన్రో — అక్కర్లేదు. థాంక్స్ !

హామి — మమ్మల్ని క్షమించాలి. (తలుపు దగ్గిరవేచుకొని ఉన్న బట్లర్‌తో) చాండ్లర్!

బట్లర్ — (ముందుకు వచ్చి) చిత్తం !

మన్రో — అయితే సరి. అధ్యక్షుడికి సమర్పించవలసిన కొన్ని కాగితాలున్నాయి నాదగ్గిర. వాటి సంగతేమిటో మీరు సంజాయిషీ చెప్పుకొనే ఒక అవకాశం ఇద్దామనుకొన్నాను.

హామి — నాకు అవకాశమా ? మీరు మాట్లాడే పద్ధతి నాకు నచ్చలేదు. ఎంత మాత్రం నచ్చలేదు.

మన్రో — మీకిదంతా చెప్పాలనుకొని వచ్చాను. మీపై కొన్నినేరాలు ఆరోపింపబడి ఉన్నాయి.

హామి — నేరాలా ?

మన్రో — ప్రభుత్వ ధనాగారంలోంచి డబ్బు దుర్వినియోగం చేసినట్టు.

హామి — ఏమిటీ ? (మన్రోవైపు జరుగుతాడు.) మా ఇంట్లోకి వచ్చి నాపై నేరారోపణ చేసేధైర్యం................

మన్రో — ఈ నేరారోపణ చేసింది నేను కాదు. నేను విషయాలు కనుక్కోడానికే వచ్చాను.

హామి — జనరల్ నాక్స్ ! మీరు నాకోసం పనిచేస్తారా ?

నాక్స్ — మీసేవకుణ్ణి.

హామి — అయ్యా ! మీ స్నేహితుడెవరో ఈ పెద్దమనిషికి చెప్పండి. వాళ్లిద్దరూ వేళా, స్థలమూ, ఆయుధాలూ ఏర్పాటు చేస్తారు. ఇక సెలవు.

మన్రో — తప్పకుండా అలానే చేస్తాను.

హామి — (నౌకరుతో) ఆయనికి బైటికి పోయేదారి చూపించు.

మన్రో — (జేబులోంచి కొన్ని ఉత్తరాలు తీసి) మొట్టమొదట ఈ ఉత్తరాలనుగూర్చి సంజాయిషీ ఇవ్వాలని కోర్తాను..................

హామి — (ఆగ్రహావేశంతో హామిల్టన్ దగ్గిరికి వచ్చి అతనికి అభిముఖుడై నిలబడతాడు.) నన్ను దొంగ అని పిలవ సాహసించే ఏ మనిషైనా..................

మన్రో — మిష్టర్ రెనాల్డ్సు.

హామి — (ఆగుతాడు.) రెనాల్డ్సా ?

మన్రో — అవును.

హామి — ఆహా ! నేను మరి ........(చెయ్యి చాస్తాడు. మన్రో అతనికొక ఉత్తరం ఇస్తాడు. హామిల్టన్ ఉత్తరంపై ఒక దృష్టి వేసి మళ్ళా ఇచ్చేస్తాడు.)

మన్రో — ఇది మీ దస్తూరీయేనా ?

హామి — అవును. న్యాయమైన విచారణ జరిగితే నాఅభ్యంతరం లేదు. దీనికి దాపరికం లేకుండా జవాబు ఇస్తాను.

నాక్స్ — అలెక్స్ ! ఇక మనం వెళదాము. (నాక్స్ బయలుదేరబోతాడు. హామిల్టన్ అతన్ని నిరోధిస్తాడు.)

హామి — దీనికి నువ్వు సాక్ష్యంగా ఉండాలని కోరుతున్నాను.

నాక్స్ — తప్పక.

హామి — (మన్రోతో) రేపు సాయంకాలం నా ఆఫీసుకు వస్తే నేను........

మన్రో — (పట్టుదలతో) నేను నాలుగ్గంటలకి అధ్యక్షుణ్ణి దర్శించుకోంటున్నాను.

హామి — ఉదయమైతేనో ? ఈ విషయానికి సంబంధించిన ఉత్తరాలూ కాగితాలూ అన్నీ మీకిస్తాను.

మన్రో — మీరు ప్రభుత్వ ధనాగారంనించి రెనాల్డ్సుగారికి డబ్బిచ్చారనీ, ఆ డబ్బుతో మీ పక్షాన స్పెక్యులేట్ చెయ్యమని కోరారనీ రెనాల్డ్సుగాడు మీపై నేరం ఆరోపిస్తున్నారు.

హామి — ఇప్పుడు రెనాల్డ్సుగారు ఎక్కడున్నారు ?

మన్రో — నాకు తెలియదు

హామి — జైల్లో ఉన్నాడు. ఒక మోసం కేసులో పట్టుపడ్డాడు. అలాంటివాడి మాటమీద నాపై నేరం ఆరోపిస్తారా ?

మన్రో — అతనికి మీరే డబ్బు ఇచ్చారా లేదా ?

హామి — ఇచ్చాను. కాని ఆడబ్బు నాదేను.

మన్రో — అయితే అలాంటి మోసగాడికి మీరు డబ్బెందుకిచ్చారు ?

(దీర్ఘ విరామం)

హామి — వాడు నన్ను బెదిరించుతూ ఉండేవాడు

మిసెస్ హామి — అలెక్ !

మన్రో — ఎందుకోసం ?

హామి — నా ఉద్యోగంతో సంబంధంలేని ఒక స్వంతవిషయాన్ని గూర్చి. ఆ మీకు సంతృప్తి కలిగేటట్టు నిరూపిస్తాను

మన్రో — ఏపరిస్థితుల్లోనైనాసరే ఈవిషయం రేపు కాంగ్రెసు ముందు పెడుతున్నాను.

హామి — సెనేటర్ కావడంచేత అది మీధర్మం. నేనూ నావిధి నిర్వహిస్తాను. నాహృదయం శోధించి నా రాజకీయోద్దేశాల పావిత్ర్యాన్ని చూడమని నేను అమెరికా అంతటినీ ఆహ్వానిస్తాను. ప్రభుత్వ ధనాగారంలోంచి ఒక్క దమ్మిడీ నేనెప్పుడూ ముట్టుకోలేదు. సమూలంగా కన్ను పీకేసుకోడానికైనా నేను సిద్ధపడతాను. కాని దీనికి తల ఒగ్గను.

మన్రో రాయిలా చలించకుండా ఉంటాడు. హామిల్టన్ చిరునవ్వులో స్నేహం తొంగిచూస్తుంది.)

మన్రో — మీ ఆఫీసులో — రేపు పదిగంటలకి.

హామి — పదిగంటలకి. సరే

మన్రో — మీరన్నట్టే ఇదంతా అయిఉంటే ఈ విషయం రహస్యంగా ఉంచుతాను.

హామి — (వెటకారంగా) అవును. అలాగే ఉంటుందని నాకు నిశ్చయమే. (మన్రో నమస్కరించి వెళ్లబోతాడు.) కర్నల్ మన్రో ! తాను స్వయంగా ఇక్కడికి వచ్చిఉంటే అది మొగతనంగా ఉండి ఉండేదని చెప్పండి.

మన్రో — ఎవరిని గూర్చి అంటున్నారు మీరు ?
హామి — మిమ్మల్ని పంపించిన వారినిగూర్చి.
మన్రో — కర్నల్ హామిల్టన్ ! నన్నిక్కడికి ఎవ్వరూ పంపించలేదు.
హామి — ఎవ్వరూ పంపించలేదా ?
మన్రో — ఎవ్వరూ పంపించలేదు. (మన్రో వెళ్ళిపోతాడు.)
హంఫ్రీస్ — ఏమిటీ గొడవ ?
హామి — హెన్రీ ! హంఫ్రీస్ ! మీరు దయచేసి....
నాక్స్ — ఇప్పుడే వెళుతున్నాము. మేం చేయదగిందేమైనా ఉంటే చెప్పండి. ఏదైనాసరే. మీ మిత్రులందరూ మీరేమి చేయమంటే అది చేయడానికి సిద్ధంగా ఉంటారు.
హామి — మీకు కృతజ్ఞుణ్ణి. నన్ను నమ్మండి. ఇదంత పెద్ద ప్రమాదకరమైన విషయంకాదు.
హంఫ్రీస్ — సందేహమేముంది ? ఇదంతా హాస్యాస్పదమైన విషయంగా కనిపిస్తుంది. నేను రాజాస్థానంలో ఉన్నప్పుడు ఇలాంటి దొకటి జరిగింది.
నాక్స్ — హంఫ్రీస్ ! ఇలా రా.
హంఫ్రీస్ — హ్మ్ ? ఓ ! అవునవును. (నమస్కరిస్తాడు.) సెలవు తీసుకుంటా నమ్మా ! (హామిల్టన్‌తో) కర్నల్ ! సెలవు.
నాక్స్ — నేనూ సెలవు తీసుకుంటాను.
హామి — బెట్సీ ! ఈ రసాభాస నీముందు జరక్కుండా చేయాలని ప్రయత్నించాను.
హామి. సతి — (లేచి నిలబడుతుంది.) నాన్న దగ్గిరికి వెళదాము. ఆయన మీకు సహాయం చేస్తాడు. నాకు తెలుసు, ఆయన సాయపడతాడు. మీ రేమీ వ్యసనపడవద్దు.
హామి — ఇప్పుడు ప్రశ్న డబ్బుది కాదు. బెట్సీ ! నేనేమి డబ్బపహరించానను కొన్నావా ఏమి ?
హామి. సతి — మీరేదో ఇబ్బందిలో ఉన్నారని మాత్రం తెలుసు. మీకు సహాయం చేద్దామని చెప్పాను. మరేమీలేదు.
హామి — కృతజ్ఞుణ్ణి, ప్రియా ! కృతజ్ఞుణ్ణి. (ఆమెను ముద్దెట్టుకొంటాడు.) బెట్సీ ! నువ్వు అద్భుతమైన భార్యవు. నేను నీకు తగను.
హామి. సతి — వీడు మిమ్మల్నెందుకు జడిపిస్తున్నాడు ? మీరేం చేశారని ?
హామి — నేను చాలా వెర్రిపని చేశాను, బెట్సీ !
హామి. సతి — దయచేసి నాతో చెప్పండి.

హామి — మనకింకా పెళ్ళికానప్పుడు, నీకు జ్ఞాపకముందా నేనన్నమాట? దేవుణ్ణి ప్రేమించి ఒక సామువును ద్వేషించే బార్య కావాలని చెప్పాను.

హామి. సతి — పరిహాసం మాని ఉన్నసంగతి చెపుమరూ ?

హామి — పరిహాసం అర్థం లేదు.

హామి. సతి — అయితే చెప్పండి, ఏసు మిమ్మల్ని ఎందుకు జడిపిస్తున్నాడో!

హామి — వీడి భార్యని నేను ప్రేమిస్తున్నానంటాడు.

హామి. సతి — ఓహో! అలా చెప్పండి! (మూతి ముకుమకుంటుంది, కోపం దిగమింగి.) ఎవరామె ? నే నెరుగుదునా ఆమెని ?

హామి — నువ్వెరగవు. వాళ్ళిద్దరు కలిసి ఈ దొంగవేషం వేశారు. ఆమె' ఆమెమొగుడూ కలిసి ఒకనాడు రాత్రి హఠాత్తుగా వచ్చి తన జీవితం ఏదో నేను చెడగొట్టినట్టుగా చెబుతూ ఈ విషయంఅంతా నీతో చెపుతానని జడి పించాడు. ఒక వెయ్యి కాలస్తు ఇస్తే ఊరుకుంటానన్నాడు. అప్పటినుంచీ వీడు నారక్తం పీల్చేస్తునే ఉన్నాడు. ఇప్పుడు వేరే కారణాలవల్ల జైలులో ఉన్నాడు. నాపలుకుబడి ఉపయోగించి తన్ను విడిపించమంటాడు. నేను నిరాకరించాను. ఇప్పుడు వీడు నాపై ఈ విధంగా కసి తీర్చుకుంటున్నాడు. (దీనంగా) ప్రియా, నన్ను క్షమించు. నీకోసం నేను ఏమైనా చేస్తాను .... (ఆమెప్రక్క కూర్చుంటాడు.)

హామి. సతి — అది ఇప్పుడు చర్చించవద్దు, అలెక్! మిమ్మల్ని ఈ పరి స్థితుల్లోంచి తప్పించడానికి ఏంచెయ్యాలన్నదే ఇప్పుడు ప్రశ్న.

హామి — బెట్సీ! నువ్వు విచారించకు. నాలెఖ్ఖలే చాలు కాంగ్రెసు నన్ను నిర్దో షిగా ప్రకటిస్తుంది.

హామి. సతి — అట్లానా? (కొంచెం ఆగి) అయితే మంచిదే. మరి ఈ సంగతంతా ముందు చెప్పారు కాదేమి ?

హామి - నీకేవిచారంగానూ మనోవ్యధ కలిగించదల్చుకోలేదు.

హామి. సతి — (హఠాత్తుగా లేచి దూరంగా జరుగుతుంది) అయితే ఇప్పుడు ఎందుకు చెప్పారు? అసలే చెప్పకుండా ఉంటే ఎంత బాగుండేది ?

హామి — (లేచి) బెట్సీ! నీకు చెప్పక తప్పిందికాదు. పార్టీ నాయకుడుగ నాస్థితిని ధ్వంసం చెయ్యాలని జెఫర్సన్ కోరుతున్నాడు. అతని చేతుల్లోఉన్న ఉత్తరా లను గూర్చి నేను సంజాయిషి చెబితేతప్ప నా నిజాయితీమీద అతను దెబ్బ తీయవచ్చు. అవసరం అయితే వాస్తవంఅంతా దేశంముందు పెట్టడానికి నేను

సిద్ధపడి ఉండాలి (ఆమె దగ్గిరికి వెడతాడు ఆమె చెయ్యి పట్టుకుని)
బెట్సీ ....
హోమి. సతి — (చెయ్యి విడిపించుకొని) నన్ను బాధపెట్టకండి.
హోమి — నువ్వు నన్ను అర్థం చేసుకున్నావుకదూ?
హోమి. సతి — పూర్తిగా.
హోమి — నన్ను నమ్ము, బెట్సీ! నిన్ను నేను హృదయపూర్వకంగా ప్రేమి స్తున్నాను.
హోమి. సతి - (కోపంతో మండుతూ) నన్ను ప్రేమిస్తూ ఒక పడుపుకత్తెతో సహ వాసంచేసారు! నన్ను పరాభవించకండి. నన్ను మీరుఎప్పుడూ ప్రేమించలేదు.
హోమి — మరి నిన్ను ఎందుకు పెళ్ళిచేసుకున్నాను ?
హోమి. సతి — నా తండ్రి జనరల్ ష్యూలర్ అనా?
హోమి — (ఆగ్రహావేశంతో) మరి నేను దారే పోయినవాడికి పుట్టినవాడినా ? నీ డబ్బుకోసం, నీ వంశాన్నిచూసి పెళ్ళాడానను కుంటున్నావా ? ఇదేనా నీవనుకుంటున్నది ?
హోమి. సతి — (అలసిపోయినట్లు) ఏమనుకోవాలో నాకే తెలియడం లేదు.

(బట్లరు ప్రవేశిస్తాడు)

బట్లరు — అయ్యా! క్షమించండి. మిష్టర్ ఫెన్నో మిమ్మల్ని చూడాలంటున్నారు.
హోమి — ఇప్పుడు పొమ్మని చెప్పు.
హోమి. సతి — అతన్ని లోపలకు రమ్మను. (బట్లరు తడబడుతూ నిలబడతాడు) లోపలకు రమ్మను.
బట్లరు — సరేనమ్మా ! (నిష్క్రమిస్తాడు.)
హోమి — బెట్సీ ! ఈ విషయం నీతో తేల్చుకోవాలనుకుంటున్నాను.
హోమి సతి — (వ్రేళ్ళతో నుదురు నొక్కుకుంటూ) ఈ విషయం ఇంకేమీచర్చించ దలుచుకోలేదు.
హోమి — (ఆమె రెండుభుజాలూ పట్టుకొని) బెట్సీ! నామాట విను. వినక తప్పదు....
హోమి. సతి — నన్ను బాధ పెట్టకండి. (విడిపించుకొని దూరంగా జరుగుతుంది) ఇప్పుడేమీ వినదల్చుకోలేదు. నేను.... ...అలసిపోయాను.

(వెనుదిరిగి వెళ్ళిపోతుంది. ఆమె చేతిరుమాలు నేలపై పడు తుంది. ఆమెవైపు హామిల్టను తీక్ష్ణంగా చూస్తాడు. కిందపడి పోయిన చేతిరుమాలు అతనికి కనిపిస్తుంది దాన్ని ఎత్తుకుంటాడు.)

బట్లరు — మిష్టర్ ఫెన్నో.

(మిష్టర్ ఫెన్నో ప్రవేశిస్తాడు. చాలా విలాసపురుషుడు.—ప్రవేశించేటప్పటికి అతనికి చాలా చెమటపట్టి ఉంటుంది.)

ఫెన్నో — అలెక్ ! ఒక విషయం నీతో చెప్పడానికి పరుగెత్తుకొచ్చాను. ఇప్పుడే మేము ఒక ప్రమాదకరమైన వార్త విన్నాము. అందుకోసమే నేను వణుకుతున్నాను. మాట్లాడలేకపోతున్నాను.

(బట్లర్ నిష్క్రమిస్తాడు)

హామి — (ఫెన్నోవైపుకు తిరిగి చాలా అలసిఉన్నట్లు) ఏమిటి ఫెన్నో ?

ఫెన్నో — ఫ్రాన్సు దేశం రాజూ రాణీ ఉరితీయబడ్డారు!

హామి — ఏమిటీ ?

ఫెన్నో — వధింపబడ్డారు.

హామి — ఘోరం !

ఫెన్నో — (కుర్చీలో కూలబడి, జేబురుమాలుతో నుదురు తుడుచుకుంటాడు) ఫ్రాన్సులో ప్రజానీకం హద్దుమీరిపోయింది. లూటీలూ, హత్యలూ, రక్తపాతం. నమ్మడానికి వీలులేని పనులు చేసేస్తున్నారు. అక్కడ జరుగుతున్న ఘోరాలు వింటే నమ్మలేవనుకో.

హామి — ఈలా జరుగుతుందని నేను భయపడుతూనే ఉన్నాను.

ఫెన్నో — నువ్వనుకున్నదానికంటే ఘోరంగా జరిగింది. ఇక్కడ భయంకరమైన పుకారులు వినవస్తున్నాయి. నిన్న ఒక ఇంటిమీదుగా పోతూంటే ఒక చిన్న జట్టు హోటల్లో కూర్చొని సాఇరా అని ఫ్రెంచి విప్లవం పాట పాడుతున్నారు. మనమీదకూడా దండెత్తాలని కొందరాలోచిస్తున్నారని రూఫస్‌కింగు నాతో చెప్పాడు జనరల్ వాషింగ్టన్‌కు వ్యతిరేకంగా కూడాను.

హామి — ఆ విషయంలో నాకు సందేహంలేదు.

ఫెన్నో — ఇదేదో మహూచికంగా వ్యాపించేటట్టుందని నాకు భయంగావుంది.

హామి — తప్పకుండా వ్యాపిస్తుంది. దానికోసం మనం ఎవరికి కృతజ్ఞులమై ఉండాలి ? జెఫరసన్! జెఫర్‌సన్!

ఫెన్నో — కాదు, కాదు, అతనికంత సాహసముందని నేను అనుకోను .... ....

హామి — (కోపావేశంతో అటూ యిటూ పచారు చేస్తూ) అవునంటున్నాను నేను. వాడుత్త పిచ్చివాడు. మన ప్రజల్లో పిచ్చి భావాలన్నీ రేకెత్తిస్తున్నాడు. హక్కులు ! స్వాతంత్ర్యము ! స్వేచ్ఛ ! విశృంఖలత్వం ! అరాచకం !

ఒక వరసా క్రమంలేని అతని ఊహాలఫలితం. దేశంలో అరాచకం కలిగించే ప్రయత్నంలో అతను ఎక్కడా అనేటట్టులేదు. కాని ఒక్క విషయం జ్ఞాపకం ఉంచుకో! అతనిక్కూడ ఎక్కువకాల ముండదు! ఆ సంగతంతా నేను చూసుకుంటాను. (బెట్సీ చేతిరుమాలు మడతవేసి చేతితో సాపుచేస్తాడు. అతని గొంతులో భగ్నహృదయం ప్రతిధ్వనిస్తుంది.) ఈ దేశంలో మేం యిద్దరం ఒక్కసారి ఉండటానికి స్థలంలేదు — ఈ దేశంలోనేకాదు, ఈ ప్రపంచంలోనే? నేనయినా ఉండాలి. ఆకిరాతుడైనా ఉండాలి!

## రెండవ రంగం

రంగం: 'సాఇరా' పాడుతున్న కోలాహలం. సంగీతం మందగించిన కొద్దీ ఒక మనుష్యులగుంపు కిరకుగా అడ్డదిడ్డంగా 'సాఇరా' పాడుతున్న ధ్వని.

ఫిలడెల్ఫియా, 1793, సాయంకాలం. జెఫర్సన్ అద్దె ఇంట్లో ఒక గది, కిటికీ బైట ఒకపొగమంచు తెరవేలాడుతుంది. కిటికీ బల్లపైన మొక్కలకుండీలు వరసగా పేర్చిఉంటాయి. గదిమధ్య ఒక పెద్ద బల్లపై పుస్తకాలూ కాగితాలు. ఎత్తుగా కుప్పగా పడిఉంటాయి. స్టవ్ మీద నీళ్ల కెటిల్ ఉంటుంది వీధిలో ఒక గుంపు చేస్తున్న కోలాహలం దూరంనించి వస్తున్న ధ్వనిలా వినిపిస్తుంది. చేతిలో హ్యాట్ పట్టుకొని జెఫర్సన్ ప్రవేశిస్తాడు, కిటికీదగ్గరికి వెళ్లి బైటికి చూస్తాడు. కోలాహలం ఇంకా సన్నగిల్లిపోతుంది. చెకుముకిరాయి కొట్టి ఒక నూనె దీపం వెలిగిస్తాడు. ఆ కాంతిలో ఆగది ఎంత కళావిహీనమై ఉందో కనిపిస్తుంది. జెఫర్సన్ జేబులోంచి ఒక పత్రిక తీసి చదువుతూ కూర్చుంటాడు. విసుక్కుంటాడు.

అతని నౌకరు జ్యూపిటర్ ప్రవేశిస్తాడు. ఆ నీగ్రో తెలివితేటలైన మొహం కలవాడు, మంచివాడు.)

జ్యూపిటర్ — నమస్కారమండి!

జెఫ — నమస్కారం, జ్యూపిటర్.

జ్యూపి — (దీపాలు వెలిగిస్తూ తిరుగుతుంటాడు.) మీరు నిశ్శబ్దంగా చడీ చప్పుడూ లేకుండా వచ్చారు. నాకు మీరు వచ్చినట్టే తెలియదు. చాలా పనిఉండి ఉంటుంది మీకీవేళ.

జెఫ — మ్మ్.

జ్యూపి — భోజనం సిద్ధంగా ఉంది. మీరు లేవడమే తరువాయి.

జెఫ — ఆకలివేయడం లేదు, జ్యూపిటర్!

జ్యూపి — ఏమైనా నాల్గుమెతుకులు నోట్లో వడేసుకోక తప్పదు.

జెఫ — తర్వాత చూసుకుందాము. (విసుగుదలతో లేచి వార్తాపత్రికను బల్లపై పారేస్తాడు. అసాధారణమైన జెఫర్సన్ ప్రవర్తనను ఆశ్చర్యంతో చూస్తాడు జ్యూపిటర్. జెఫర్సన్ మొక్కలకుండీలవద్దకు వెళ్ళి వాటిని పరీక్షిస్తాడు. జ్యూపిటర్ వార్తాపత్రిక ఎత్తుకొని, ఏమిటా అన్నట్టుగా దాని వైపు చూచి, బల్లపై ఉంచుతాడు. జెఫర్సన్ కుండీలలో మొక్కల్ని పరీక్షిస్తూ పండుటాకులను చిదిమేస్తాడు.)

జ్యూపి — మంచిభోజనం తయారు చేశాను. పుడ్డింగు, చికెను.

జెఫ — (తల ఊపి) కృతజ్ఞణ్ణి. (మొక్కలకు నీళ్లుపోస్తాడు.)

జ్యూపి — మీరా పాడుక్యాబినెట్ మీటింగునించి వస్తున్నారా ?

జెఫ — (తల ఊపి చిరునవ్వు నవ్వుతాడు.) అవును.

జ్యూపి — మ్మ్! మ్మ్! (నాకు తెలుసు అన్నట్టుగా తల ఆడిస్తాడు.) బైటి వాతావరణం తమాషాగా ఉంది. జిడ్డుగా ఉంది. ఫిలడల్ఫియా అంతటిమీదా ఆ పసుపుపచ్చ పొగమంచు వేలాడుతూఉంది. ఆ జ్వరంతో ఈవేళ పదిమంది తెల్లవాళ్లు చచ్చారని విన్నాను.

జెఫ — అంతకంటె ఎక్కువగా.

జ్యూపి — ఇది భయంకరంగా ఉంది. (వెళ్లడానికి తిరుగుతాడు. రక్తంతో తడిసిన చేతిరుమాలుతో అడ్డదిడ్డంగా కట్టుకట్టిఉన్న జ్యూపిటర్ చెయ్యి చూస్తాడు జెఫర్సన్.)

జెఫ — ఏమైంది నీచేతికి ?

జ్యూపి — ఆఁ, ఏమీలేదు.

జెఫ — ఏమిటో నన్ను చూడనీ, ఇలారా. (పట్టీ విప్పేస్తాడు.) అబ్బ! బాగానే దెబ్బతగిలింది. ఇలా కూర్చో. (జ్యూపిటర్ కూర్చుంటాడు, జెఫర్సన్ స్టవ్

వద్దకు పోయి, ఒక కప్పులో కొద్దిగా నీళ్లుపోసి, ఒక వైనుసీసా ఒక నూనెసీసా అల్మారీలోంచి తీసుకొని వస్తాడు.) జ్యూపిటర్ ! ఏం చేశావు ?

జ్యూపి — సాయంకాలం బజారుకు వెళ్లినప్పుడండీ....

(జెఫర్సన్ తాను తెచ్చిన వస్తువులన్నీ బల్లపై పెడతాడు. ఒక డ్రాయిర్ లాగి చిన్న గుడ్డసీలిక తీస్తాడు. జ్యూపిటర్ చేతికట్టు విప్పి గాయం పరీక్షిస్తాడు.)

జెఫ — ఇది కొంచెం నొప్పెడుతుంది. (గుడ్డను పేలికలుగా చింపుతాడు.)

జ్యూపి — కానివ్వండి.

జెఫ — (గుడ్డ నీటిలో తడిపి దానితో గాయం శుభ్రపరుస్తాడు. తర్వాత గుడ్డ వైనులోముంచి దానితో గాయం ఒత్తుతాడు. జ్యూపిటర్ నొప్పి అభినయిస్తాడు.) నొప్పెడుతుందా ? (జ్యూపిటర్ అవునన్నట్టుగా తల ఊపుతాడు.) ఇంత గాయమెలా అయింది ?

జ్యూపి — బైబిజ్ మార్కెటు బైట. నేను బైటికి వస్తూ ఉండగా.

జెఫ — ఐతే ?

జ్యూపి — ముగ్గురు మనుష్యులు మాట్లాడుకొంటున్నారు. "జెఫర్సన్ ఒకదయ్యం" అన్నాడొకడు. ఫ్రెంచి విప్లవంలాంటిది ఇక్కడకూడా ఒకటి మీరు తేబోతున్నారని వాళ్లకు కర్నల్ హామిల్టన్ చెప్పాడట. అందరినీ చంపడం. అది నాకూ ఇష్టంలేదు. నేను వాళ్లతో ఇదంతా అబద్ధమని చెప్పాను. "నువ్వు జెఫర్సన్ నీగ్రోవి కావూ ?" అని అడిగారు వాళ్లు. నిన్ను పట్టుకుచంపుతామన్నారు. ఎవడో నాతలమీద కర్రతో కొట్టాడు. నేను చెయ్యి అడ్డుపెట్టాను. ఆ కర్రకు ఒక మేకు ఉండి ఇలా గాయమైంది.

జెఫ — ఓహో ! జ్యూపిటర్ ! ఇంకా నువ్వు నేర్చుకోలేదా ?

జ్యూపి — మిమ్మల్నిగూర్చి వాళ్ళు చెడ్డగా అనుకొంటూ ఉంటే నేను విని ఎలా ఊరుకోగలను ?

జెఫ — కోపంతో ఉన్న ఒక ఎద్దు నీదారిలో నిలబడి ఉంటే ఏం చేస్తావు ?

జ్యూపి — ఏం చేస్తానంటారా ?

జెఫ — అలాంటి జంతువుతో దారి ఇమ్మని వివాదపడతావా ? చుట్టుతిరిగి వెళ్ళిపోతావు. అంతేనా? (చిరునవ్వునవ్వుతాడు. జ్యూపిటర్ నవ్వి తల ఊపుతాడు.)

జ్యూపి — అవును. అలాగే చేస్తాను.

జెఫ — తర్వాత ఏమైందో చెప్పు.

జ్యూపి — ఇంతలో వీథమ్మట ఒక గుంపు వచ్చిందని, పిచ్చికేకలు వేస్తూ. వీథిలో కూడా మనుష్యులు గుంపులు గుంపులుగా నిలబడి ఉన్నారంటె.

జెఫ — నాకు తెలుసు.

జ్యూపి — నా దగ్గిరున్నవాళ్లు ఆ గుంపును చూచి భయపడి పారిపోయారు. మిస్టర్ టామ్! వీధిలో గుంపులు గుంపులుగా చేరి ఇష్టం వచ్చినట్లు కేకలు వేస్తున్నారనుకోండి. 'ధనికుల్నందరినీ చంపండి. వాళ్ల కిటికీలు పగలగొట్టండి! వాళ్ల ఇళ్లు కాల్చేయండి.' అని అరుస్తున్నారు. ఫ్రెంచి పాటలు పాడుతున్నారు.

జెఫ — (చేతికి కట్టుకడ్తాడు.) నొప్పెడుతుందా? ఏగసవుగా ఉందా?

జ్యూపి — (కాదన్నట్టుగా తల ఊపుతాడు.) ప్రెసిడెంట్ వాషింగ్టన్‌ను గూర్చి కూడా వాళ్లు చెడ్డగా అనుకొంటున్నారు.

జెఫ — వాషింగ్టన్?

జ్యూపి — అవునండి, టామ్‌గారూ! (పట్టీ కట్టుతూ జెఫర్సన్ చిదరించుకుంటాడు.) అంతా కలగా బులగంగా ఉందనుకొండి. అతను స్వాతంత్ర్యం కోసం దెబ్బలాడిన వాడని నాకు తెలుసు. మా జాతికి స్వాతంత్ర్యం ఇప్పించిన వాడు వాషింగ్టన్ అని మీరు చెప్పింది నాకు జ్ఞాపకం వచ్చింది.

జెఫ — అవును. అది నిజమే.

జ్యూపి — మీరు కూడా అందులో ఎంతపని చేశారో నాకు జ్ఞాపకముంది, టామ్ గారూ! నాచిన్ని పారాకు ఒకనాడు స్వాతంత్ర్యం లభిస్తే చూడాలనిఉంది నాకు ఒకనాడు తప్పకుండా వాయవ్యభాగాన్నున్న భూములన్నీ మా వశంలోకి వస్తాయనీ, అక్కడ బానిసలే ఉండరని మీరు చెప్పినమాటలు జ్ఞాపకమున్నాయి. మావాళ్లందరికీ చదువూ, భూమీ, పరికరాలూ అన్నీ లభిస్తాయని మీరు చెప్పారు.

జెఫ — ఒకనాడిది తప్పకుండా జరుగుతుంది. జ్యూపిటర్! ఒకనాడు మీజాతి అంతా స్వతంత్రం అవుతుంది.

జ్యూపి — మిస్టర్ టామ్! ఆ గుంపులు — అంతా గొడవగా ఉంది. నాకా గుంపులంటే ఇష్టంలేదు. వీళ్ళేదో అల్లరి చేసేటట్టున్నారు.

జెఫ — నువ్వూహించింది నిజమే. చూశావా, నిన్ను కొట్టిన వాళ్లు రాజపక్షం వాళ్ళు. వాళ్లిక్కడ రాజు కావాలంటారు. తక్కినవాళ్లూ — ఆ గుంపులు — వాళ్ళకు నిశ్చితమైన అభిప్రాయాలు లేవు. కలగా బులగంగా ఉన్నారు. ఇప్పుడు ఫ్రాన్సులో జరుగుతుంది అదే. వెర్రెక్కినట్టున్నారు వాళ్లు. (కట్టు కట్టడం పూర్తిచేసి) ఇప్పుడెలా ఉంది?

జ్యూపి — చాలా బాగుందండి. (చెయ్యి చాచి చూస్తాడు.) చాలా బాగుంది.

జెఫ — కొంతసేపటివరకు చెయ్యి ఉపయోగించవద్దు.

జూపి — అలాగేనండి.

(గంట మోగుతుంది.)

జెఫ — ఎవరో బైట !

(జ్యూపిటర్ తలుపు దగ్గరికి పోతాడు. జెఫర్సన్ వైను సీసా తీసుకొని అల్మార్ర వెనుక పోతాడు.)

జ్యూపి — (తలుపు తీసి సంతోషంతో నవ్వుతూ) మిస్టర్ టామ్ ! చూడండిక్కడ ? ఎవరు వచ్చారో చూడండి. (ప్యాట్సీ ప్రవేశిస్తుంది.)

ప్యాట్సీ — నాన్నా !

జెఫ — తల్లీ ప్యాట్సీ !

(ఇద్దరూ కౌగిలించుకుంటారు.)

ప్యాట్సీ — నిన్ను చూడ్డం మంచిదైంది నాన్నా !

జెఫ — తల్లీ ! అయితే ఇలా..........

ప్యాట్సీ — నీకు తెలియకుండా వద్దామనుకొన్నాను.

జెఫ — బాగా వచ్చావమ్మా ! జ్యూపిటర్ ! పోతరించిన అదూడను కోయి. రాత్రి భోజనానికి రెండు.

జ్యూపి — కోడిపిల్లలా ?

(అందరూ నవ్వుతారు.)

జెఫ — ఏదో ఒకటి చంపు.

జ్యూపి — (నవ్వుతాడు.) అయ్యకు మళ్లా ఆకలి పుట్టింది. ఆయన మొహం చూడండి. మిసెస్ ప్యాట్సీ ! మంచి ముందువై వచ్చావమ్మా !

జెఫ — నీ ట్రంకేదీ ?

ప్యాట్సీ — కోచ్మన్ బైట పెట్టి వెళ్ళినట్టున్నాడు.

జ్యూపి — వెళ్ళితెస్తాను. (బయలుదేరతాడు.)

జెఫ — నేను తెస్తాను. జ్యూపిటర్ ! నీచెయ్యి..........

జ్యూపి — (కుడిచెయ్యి చాచి) ఓ దివ్యంగా ఉంది. నేను తీసుకురాగలను.

ప్యాట్సీ — (జ్యూపిటర్ దగ్గిరికి వెళ్ళి) జ్యూపిటర్ ! నీభార్య ప్రేమతో నిన్నడిగానని చెప్పమంది. సారా కూడాను.

జ్యాపి — (ఆగి వెనక్కి తిరుగుతాడు.) అందరూ బాగున్నారా ?

ప్యాట్సీ — (తల ఊపుతుంది.) నీకోసం వాళ్ళు పంపించిన వస్తువులు తెచ్చాను.

జ్యాపి — కృతజ్ఞుణ్ణి, తల్లీ ! నువ్విక్కడికి రావడం చాలా మంచిదైంది అమ్మా ! (నిష్క్రమిస్తాడు.)

జెఫ — బుజ్జాయి జెఫ్, చిట్టితల్లి యానీ, మేరియా ఎలాగున్నారు ? రాండాల్ఫ్ గారో ? నీపైకోటు ఇలా ఈ. (తీసుకొని కుర్చీమీద పెడ్తాడు.)

ప్యాట్సీ — జెఫ్‌కు రెండు కొత్తపళ్ళు వచ్చేయి.

జెఫ — రెండా ? అద్భుతం ?

ప్యాట్సీ — మాటలు కూడా నేర్చాడు. యానీ ఊరికే పెరిగి పోతోంది. దాన్ని చూస్తే నువ్వానవాలు పట్టవు.

జెఫ — ప్యాట్సీ ! నేను దానికి జ్ఞాపకం ఉన్నానా ?

ప్యాట్సీ — ఓహో ! నువ్వు నేర్పావే ఎప్పుడూ అదే ఆట ఆడుతూ ఉంటుంది. ఎప్పుడూ నిన్ను గూర్చే పలవరిస్తుంటుంది. "తాతయ్యా ఎక్కడ ? తాతయ్య ఎప్పుడు వస్తాడు ? తాతయ్య నాకోసం ఏం తెస్తాడు? " అంటూ ఉంటుంది.

జెఫ — (భుజాలెగరేసి) మ్మ్ ! హ్మ్ !

ప్యాట్సీ — మేరియా చాలాచాలా ముద్దులు చెప్పమంది. నువ్వు పంపించిన హ్యాటులు ముసుగులూ అద్భుతంగా ఉన్నాయి.

జెఫ — అవి సరిగ్గా సరిపోయేయా ?

ప్యాట్సీ — సరిగ్గా. పైకోట్లు చాలా అందంగా ఉన్నాయి.

జెఫ — స్టయిలు నచ్చిందా ?

ప్యాట్సీ — బాగా.

జెఫ — మీ ఆయన ఎలా ఉన్నాడు ?

ప్యాట్సీ — బాగానే ఉన్నారు. బాగా పని ఉంది. తన శాయశక్తులా పనిచేస్తున్నారు. ఆ ఓవర్సీయర్‌తో కలిసి ........ మహాఉక్కబెడుతుంది. ఫిలడల్ఫియాలో ఎప్పుడూ ఇంతేనా ఏమిటి ?

జెఫ — ఇప్పుడు కాలం ఏమి బాగాలేదు. ఒక విధమైన అంటుజ్వరం వ్యాపించి ఉందిక్కడ.

ప్యాట్సీ — (చుట్టూ చూచి) ఇక్కడన్నమాట నువ్వుండేది !

జెఫ — బస బాగుందా ?

ప్యాట్సీ — కొంచెం చీకటిగా ఉందికదూ ?

జెఫ — (నవ్వి) నువ్వు బాగా అలసిపోయావు. ఒక గ్లాసు షెర్రీ తాగుతావా ?

ప్యాట్సీ — అహ ! . (జెఫర్సన్ వైన్ అల్మారావద్దకు పోతాడు.) నాన్నా ! మేమిక్కడికి వస్తూఉంటే ఒకచోట కోచ్ ఆగవలసి వచ్చింది. అక్కడ వీధిలో అంతగుంపు ఉంది.

జెఫ — ఫ్రెంచి రాయబారి వాళ్ల కీమధ్య ఉపన్యాసా లిస్తున్నారు. కొన్ని అల్లరులు కూడా చెలరేగేయి. ఈ అంటుజ్వరం తనతోపాటు ఈ నైతికవ్యాధి తెచ్చినట్టుంది. (చాలా సీసాలు ఏరుకొని వాటిని తీసుకువస్తాడు.) తీపా ?

ప్యాట్సీ — డ్రై, నాన్నా ! (బల్లమీద పడిఉన్న ఏదో పరికరాన్ని కదుపుతుంటుంది.) ఇదేమిటి నాన్నా ! మళ్ళా ఏదైనా "సదుపాయం" కనిపెట్టావా ?

జెఫ — అది కాపీయింగ్ మెషిను. చేతిలో పట్టుకు వెళ్ళవచ్చు. ఉత్తరాల కాపీలు తీస్తుంది. అదెలా పనిచేస్తుందో నీకు చూపిస్తాగా.

పాట్సీ — (నవ్వుతుంది) ఓహో ! నాన్నా ! ఎన్ని పరికరాలు కనిపెట్టావు ! ఒక్కొక్కప్పుడు నేను .... (బల్లపైఉన్న ఒక పత్రికపై అమె దృష్టి పోతుంది. ఒక్కసారి నవ్వు అపుచేసేస్తుంది. బొమలు ముడిపడతాయి. పత్రిక ఎత్తుకుంటుంది. చదువుతుంది. అమె మొహం కోపంతో కందిపోతుంధి.)

జెఫ — (షెర్రీపోస్తూ) పుడ్డింగు చేయడం నేర్చుకుందా మేరియా ! ఎప్పిస్ అత్తయ్యదగ్గిర నేర్చుకుంటున్నానని వెనకటి ఉత్తరంలో వ్రాసింది. ....

ప్యాట్సీ — నాన్నా !

జెఫ — హ్మ్ ? (తిరిగి, అమె చేతిలో పత్రిక చూస్తాడు.) ఓహో ! అది నువ్వు చదవకు, తల్లీ ! (అమె చేతిలోంచి తీసుకోడానికి అటు వెళ్తాడు.)

ప్యాట్సీ — ఓ దేవుడా !

జెఫ — ఏమిటలా ఉక్కిరి బిక్కిరై పోతున్నావు ?

ప్యాట్సీ — ఇదేం పత్రిక నాన్నా ?

జెఫ — ఇది "దర్బారు" పత్రిక. మన నవాబులు నాస్తాలుచేస్తూ దీన్ని కొరుకుతుంటారు. ఇది తీసుకో, నీ షెర్రీ.

ప్యాట్సీ — వీళ్లు నిన్నెలా బాధిస్తున్నారో విన్నాను. కాని ఇది నేను ఊహించిన వానికంటె అధమంగా ఉంది.

జెఫ — ఇచ్ఛకమాడినట్టు లేదూ ? ప్రత్యేకంగా అంతఃపురాన్ని గూర్చి వ్రాసిన ఆ ముక్క ! అంతఃపురం ! ఈ వయస్సులో. చాలా బాగుంది....

ప్యాట్సీ — ఇందులో హాస్యం ఏమీలేదు. నువ్వీ నేరారోపణలకు జవాబివ్వాలనా?

జెఫ — ఒక అబద్ధానికి జవాబిస్తే మళ్లా ఇరవై కొత్తఅబద్ధాలు వ్రాస్తారు.
ప్యాట్సీ — అయితే మరేం చేస్తావు ?
జెఫ — వాటిని చూడనట్టు ఊరుకుంటేసరి !
ప్యాట్సీ — ఎవ రిదివ్రాసింది ? ప్యాసిఫికస్ ఎవరు ?
జెఫ — నే నెరగను. ఇది కలంపేరు.
ప్యాట్సీ — (ఆగుతుంది. నీళ్ళు నిండుకుంటున్న కళ్ళతో తండ్రిని చూస్తుంది: తుట్టతుదకు మహా రిక్తకంఠంతో) ఇలాంటి తిట్లన్నీతింటూ సెక్రెటరీ ఆఫ్ స్టేట్‌గా ఉండడం నీకు రుచిస్తూ ఉన్నట్టుంది.
జెఫ — తల్లీ ! అది నాధర్మం.
ప్యాట్సీ — ధర్మమా ? (లేచి మనోవేదనతో ఆందోళనతో కిటికీవద్దకు వెళుతుంది.) నాన్నా ?
జెఫ — ఏం తల్లీ ?
ప్యాట్సీ — నువ్వింతవరకు చేసిన బలిదానం చాలదంటావా ?
జెఫ — నేనేమీ బాధలు పడలేదే.
ప్యాట్సీ — పడలేదా ?
జెఫ — లేదు.

(విరామం.)

ప్యాట్సీ — కొన్నివారాలకిందట అమ్మ వ్రాసిన కరపత్రం ఒకటి చూశాను. విప్లవ కాలంలో వర్జీనియాస్త్రీలను సంబోధిస్తూ వ్రాసిందది. యుద్ధంలో గెలుపొందడానికి స్త్రీ లందరూ బలిదానం చెయ్యాలని అందులో అమ్మ ప్రబోధించింది. ఇంట్లో పదిమంది మొగాళ్ళపని తానొక్కర్తె చేస్తూ అడుగుతీసి అడుగువేయలేనంత జబ్బు పడిపోయింది. అదంతా నాకు జ్ఞాపకముంది నాన్నా ! అమ్మ చచ్చిపోయిన తర్వాత కటికినేలపై కూర్చొని నువ్వేడుస్తూ ఉండడం, ఇక నువ్వుకూడా బతకవని నేను ఆశ వదులుకోడం నాకింకా జ్ఞాపకముంది నాన్నా ! విప్లవానికి అమ్మను బలిపెట్టానని నువ్వు గట్టిగా ఏడ్చిన సమయాలూ నాకు జ్ఞాపకమున్నాయి నాన్నా !
జెఫ — (కుర్చీలో కూలబడతాడు) ప్యాట్సీ !
ప్యాట్సీ — నీజీవితంలో ఉదయం, మధ్యాహ్నం రెండూ బలివేశావు. అదిచాలదూ?
జెఫ — ప్యాట్సీ ! తల్లీ ! చాలించు.
ప్యాట్సీ — నే నూరుకోను. నిన్నుగూర్చి నువ్వాలోచించుకోకపోతే మాగతి ఏమి

కాను ? పన్నెండేళ్ళదాన్ని నేను, నాలుగేళ్ళ శిశు వొకర్తె ఇంటినుండి విడివడి, మేము ప్రేమించిన ప్రతిదానినుండీ విడివడి, విదేశాలకు తీసుకు పోబడి, ఎప్పుడో ఒకప్పుడు నిన్ను చూస్తూ, ఇంటికోసం, సంరక్షణకోసం పాకులాడుతూ .... ఎందుకు ? ఎందుకోసం ? దీనికిక అంతులేదా ?

జెఫ — ప్యాట్సీ ! నిన్ను బతిమాలుకొంటాను. ఇక చాలించు.

ప్యాట్సీ — నిన్ను గూర్చి నీ కేమీ బాధ్యతలు లేవా ? మాయెడ నీ కేమీ బాధ్యతలు లేవా ? నాన్నా ! నేను చెప్పింది విను. ఇంట్లోఉన్న ప్రతీది ఛిన్నా భిన్నమై పోతుంది. త్వరగా నువ్వు ఇంటికి మరలి రాకపోతే ఇంక మనకేమీ మిగలదనుకో. ఏమీ కూడాను !

జెఫ — (వేదనతో లేస్తాడు.) ప్యాట్సీ ! ఇక ఆపుచెయ్యి.

ప్యాట్సీ — (దుఃఖభారంతో అతన్ని సమీపిస్తుంది.) నాన్నా ? నాన్నా ! నిన్ను బాధించడం నా ఉద్దేశం కాదు....

జెఫ — (ఆమెను చేతుల్లో తీసుకుంటాడు.) నాకు తెలుసు, నాకు తెలుసునమ్మా !

ప్యాట్సీ — నన్ను క్షమించు నాన్నా !

జెఫ — పరవాలేదు తల్లీ !

ప్యాట్సీ — నేను ఖంగారు పడిపోయాను. బాధపడి పోయాను నాన్నా ! ఇదంతా నీతో చెప్పకుందామని వచ్చాను నాన్నా !

జెఫ — మంచిపని చేశావుతల్లీ ! నువ్వు రాకపోతే నే బాధపడేవాణ్ణి.

ప్యాట్సీ — మాంటిసెల్లోనూ పొలాలనూ నడిపేపని, నాన్నా ! మేము శాయ శక్తులా ప్రయత్నిస్తున్నాము. మేమెంతకష్టపడుతున్నామో దేవుడికే తెలుసు. కాని ఆయన కందులో ప్రవేశంలేదు. అందులో కష్టం వస్తూఉంటే అయన దానితో వేగిపోతున్నారు. దానివల్ల నాకూ మనోవ్యధ ఎక్కువైపోయింది. నీ ఆస్తి అంతా పోతుందేమోనని భయంగా ఉంది నాన్నా !

జెఫ — అర్థమైందమ్మా ! అర్థమైంది. (తల నిమురుతాడు.) ఈ విషయం ఎప్పుడూ ఆలోచించనే లేదనుకోకు. నీ భర్తకు నేనిస్తున్న శ్రమ నాగుండెపై ఎప్పుడూ బరువుగానే ఉంటూ వచ్చింది.

ప్యాట్సీ — నే నిదంతా చెప్పకుండా ఉండవలసింది, నాన్నా ! ఇక్కడి పని ఎంత కఠినమైనదో నాకు తెలుసు.

జెఫ — (అకస్మాత్తుగా తిక్తత ఉప్పొంగుతుంది.) నా జీవితంలో ఈ పదవిని అసహ్యించుకొన్నంత మరి దేన్నీ అసహ్యించుకోలేదు. ప్యాట్సీ ! ఇక్కడ వాతావరణం అంతా ఎంత ద్వేషపూరితంగా ఉందో నీకు తెలియదు. ఈనగరంలో

ఉన్న ప్రతిమనిషిసుఖాన్ని రాజకీయాలు ధ్వంసం చేస్తున్నాయి నేనిక్కడ ద్వేషంచేతా అబద్ధాలచేతా చుట్టబడిఉన్నాను. మొన్నటిదాకా నేను మిత్రు లనుకొన్నవాళ్ళే ఇప్పుడు దండంపెట్టవలసి వస్తుందని ఈ వీదిలో అడుగు పెట్టరు.

ప్యాట్సీ — నీలాంటి సజ్జనుడికా ఈ శిక్ష! ఎందుకు ?

జెఫ — రాజరికం కావాలనే ఒక గుంపు ఉందిక్కడ. మాప్రభుత్వ సంవిధానాన్ని ఎలాగైనా మార్చాలని వాళ్ళ ప్రతిజ్ఞ — అవసరమైతే బలవంతంగానైనాసరే. మాడిసనూ మన్రో వెళ్ళిపోయిన తర్వాత నేనొంటరిగాడనై పోయాను. నేనొక్కణ్ణే వాళ్ళతో వేగలేకపోతున్నాను, ప్యాట్సీ !

ప్యాట్సీ — మరి అధ్యక్షుడో ?

జెఫ — అతని బలమూ, అతని పట్టుదలా పాదిత్ర్యమే అనుకో వాళ్ళను ప్రతిఘటిస్తుంది. కాని ఆయన వృద్ధుడై పోయాడు. ఆరోగ్యంకూడా చెడిపోయింది. (కూర్చుంటాడు.) నేను ఉదయంనించి రాత్రివాకా పనిచేస్తాను. నేను చేసిందంతా వాళ్లు చెడగొడ్తారు. ఇక్కడ జీవితం గడపడం కాదు, పోగొట్టుకోడం.

ప్యాట్సీ — అయ్యో , నాన్నా ! (ప్యాట్సీ తండ్రిదగ్గిరికి వెళ్ళి అతని పాదాల వద్ద మోకరిల్లుతుంది. తన మెడలోఉన్న ఒక లాకెట్ తీస్తాడు జెఫర్సన్.)

జెఫ — తల్లీ ! రోజూ నావ్యాపకమేమిటో తెలుసానీకు ? ప్రతి సాయంకాలం ఒక గంటసేపు మాంటిసెల్లోను స్వప్నాల్లోచూస్తూ కూర్చుంటాను. నేను మొట్టమొదట ప్రేమించిన వాళ్ళను తలచుకొంటూ, నాటి తీయనితలపులు మనస్సుకు తెచ్చుకొంటూ ఆనందిస్తూ ఉంటాను. మీతల్లి..................(లాకెట్టు విప్పి, అందులో బొమ్మ చూస్తూ) ప్యాట్సీ ! ఆమె చాలా సౌందర్యవతి. మిమ్మల్నందరినీ ప్రాణపదంగా ప్రేమించేది. (లాకెట్ మూసేస్తాడు.) ప్యాట్సీ ! నువ్వు నిజం చెప్పావు. యుద్ధకాలంలో నేను ఇంట్లో పనులు చక్కబెట్టుకొనేపని అపేక్ష చేయకుండా ఉండిఉంటే మీఅమ్మ ఇప్పటికీ బతికి ఉండేది. అదినిజం. విప్లవానికి మీ అమ్మను బలిపెట్టాను. ఇప్పుడు నీవిషయంలోనూ అదే చేస్తున్నాను. తల్లీ ! నాజీవితం కంటె నీసుఖం నాకు ప్రియం. కాని నేను మూర్ఖుడనై నీ సుఖానికి అంతరాయం కలిగిస్తున్నాను. పత్రికల్లో ' దొంగ, అబద్ధాలఖోరు, వ్యభిచారి, పయోముఖవిషకుంభం (లేచి పత్రిక ఎత్తుతాడు) అనిపించుకొనే గౌరవంకోసం. (పత్రిక కింద పారేస్తాడు.) అంతకంటె ఇక్కడ మరేమీలేదు. నువ్వు బాధపడకు, తల్లీ ! పరిస్థితులు చక్కబడతాయి. నేను

వాగ్దానమిస్తున్నాను. ఈక్షణం మొదలు నేను నా స్వంతవ్యవహారాలవైపు దృష్టి మళ్లిస్తాను. (డెస్కులాగి తొడపై ఉంచుకొని ఆవేశపూర్వకంగా వ్రాయడం ఆరంభిస్తాడు.) ప్యాట్సీ !

ప్యాట్సీ — నాన్నా !

జెఫ — జ్యూపిటర్‌ను పిలుస్తావా ? అక్కడుందిగంట. (ప్యాట్సీ గంటతాడు లాగుతుంది. తెరవెనుక గంట మోగినట్టు ధ్వని) రేపు నువ్వు చేయవలసిన పని ఒకటి ఉంది.

ప్యాట్సీ — మంచిది. ఏమిటి నాన్నా !

జెఫ — (వ్రాస్తూ) మాంటిసెల్లోకు ఎలాంటి కర్రసామగ్రి ఇతరవస్తువులూ అనువుగా ఉంటాయో చూసి కొనేయాలి. ఆసామానంతా జాగ్రత్తగా ప్యాక్‌చేసి రిష్మండు చేరేటట్టు ఓడలో పంపాలి.

ప్యాట్సీ — రిష్మండుకా ?

జెఫ — కొన్నివారాలదాకా నే నిక్కడ పనులతొందరలో ఉంటాను—సముద్ర మార్గాలు సురక్షితంగా ఉన్నప్పుడే ఈ సామానంతా పంపించేయడం మంచిది. (ఉత్తరంపై ఇసకచల్లి, ఊది, ఒక్క క్షణం చదువుతాడు. జ్యూపిటర్ ప్రవేశిస్తాడు.)

జ్యూపి — అయ్యా ! పిలిచినట్టున్నారు ?

జెఫ — ప్రెసిడెంట్ ఇల్లు నీకు తెలుసుకదా ?

జ్యూపి — చిత్తం.

జెఫ — వెంటనే ఈ ఉత్తరం అక్కడ ఇచ్చిరా.

జ్యూపి — భోజనాల తర్వాత వెళ్ళితేనో ?

జెఫ — (లేస్తాడు.) కాదు. ఇప్పుడే.

జ్యూపి — నా భోజనం కాస్తా చెడిపోతుంది.

జెఫ — వెంటనే వెళ్లాలి, జ్యూపిటర్ ! (ప్యాట్సీతో) మనం ఇంటికి వెళుతున్నాం. ఇద్దరం కలిసి, ప్యాట్సీ ! నేను ఉద్యోగానికి రాజీనామా ఇస్తున్నాను. (వ్రాత చెక్క బల్లపై ఉంచుతాడు.)

జ్యూపి — మీరు ఇంటికి వెళ్తున్నారా, టామ్‌గారూ ?

ప్యాట్సీ — అవును, జ్యూపిటర్ !

(జ్యూపిటర్ జెఫర్సన్ కేసి తదేకదృష్టితో చూస్తాడు.)

జ్యూపి — టామ్‌గారు ఇంటికి వెళ్తారా ........?

ప్యాట్సీ — ఓహో ! నాన్నా ! నాకు చాలా ఆనందంగా ఉంది ........నేను........

(బైటకోలాహాల ధ్వని సరసంగా వినవస్తుంది. ప్యాట్సీ త్వరగా నిలుచుంది. కోలాహలం అధికమౌతుంది.)

జెఫ — మళ్లా ఈ గుంపులు. (కిటికీ దగ్గరికి వెళ్ళి బైటికి చూస్తాడు.) ఇది ఫెడరలిస్టులకు మంచి పంటచెరుకు !

(జనాసీకం పాట అకస్మాత్తుగా బిగ్గరగా వినవస్తుంది. దానికి ఒక భయంకర పరిస్థితిని సూచించే లక్షణాలున్నాయి.)

ప్యాట్సీ — ఏమి పాడుతున్నారు వాళ్లు ?

జెఫ — నాకూ అర్థం కావటంలేదు.

(వాళ్లు చేస్తున్న నినాదాలు 'డౌన్ విత్...' స్పష్టంగా వినవస్తున్నాయి)

పాట్సీ — డౌన్‌విత్—ఏమను ?

జెఫ — (చివరిమాట క్రమంగా 'వాషింగ్టన్' అని స్పష్టపడుతుంది.) వాషింగ్టన్ ? వాషం........ ! (జెఫర్సన్ ప్యాట్సీలు ఒకళ్లమొహం ఒకళ్లు చూచుకుంటారు. ఒక్కక్షణం నిశ్శబ్దం.) వాళ్ళకి, వాళ్ళ శత్రువులకీ మధ్య నిలబడి ఉన్నదతనే. (విరామం) ప్యాట్సీ ! ఎక్కడెక్కడ మనుష్యులు స్వాతంత్ర్యం కోసం దెబ్బలాడతారో అక్కడ వాషింగ్టన్ పేరు జాజ్వల్యమానంగా ప్రకాశిస్తుంది. మా పేర్లు అన్నీ తుడుచుకుపోతాయి. పాతుకుపోయినట్టు నిలబడ్డ జ్యూపిటర్‌ను ఉద్దేశించి చికాకులో) సరే, జ్యూపిటర్, పో ! అలా ఎందుకు నిలబడ్డావు ? (జ్యూపిటర్ వెళ్తాడు. ప్యాట్సీ ఎందుకన్నట్టుగా జెఫర్సన్‌వైపుచూస్తుంది.) మరేంలేదు తల్లీ ! దానివల్ల పెద్ద కొంపమునిగేది ఏమీలేదు. మన ప్రజలు స్వాతంత్ర్యార్హత సంపాదించుకోలేకపోతే వాళ్ళకోసం స్వాతంత్ర్యాన్ని ఎవ్వరూ భద్రపరచలేరు. నేను ఇంటికి వెళ్లిపోతాను. (డెస్కుతీసి, దాన్ని మూసేసి మళ్ళా దాన్ని బల్లమీద పెడ్తాడు.)

---

## మూడవ రంగం

రంగం: మునుపటిదే కొన్నిరోజులు తర్వాత. చాలామట్టుకు అలంకారాలు పోయేయి. గదిలో ఖాళీ స్థలాలు చాలా కనిపిస్తున్నాయి. పుస్తకాల కట్టలు నేలపై పడిఉన్నాయి. బొమ్మలూ, సున్నితమైన

ఇతరవస్తువుల్నీ ప్యాట్సీ బట్టల మడతల్లో చుట్టి ఒక పీపాలో జాగర్తగా సర్దుతుంది. ఒల్లవద్ద కూర్చొని జెఫర్సన్ ఆవేశంతో వ్రాస్తున్నాడు. అతని ముందు కుప్పగా ఉన్న కాగితాలు ఒక్కొక్కటే చూచి వాటిపై సంతకాలు పెడుతున్నాడు గదిలో పొగ మబ్బుల్లా కమ్ముకొని ఉంది.

జ్యూపిటర్ ప్రవేశిస్తాడు. అతని మొహంపై భయాందోళనలు తాండవిస్తున్నాయి. అతను పుస్తకాల కట్ట ఒకటి ఎత్తుకొని బైటకి పోబోతాడు. బైట బండి చక్రధ్వని భయంకరంగా వినిపిస్తుంది. అది వింటూ ప్యాట్సీ, జెఫర్సన్నూ, జ్యూపిటరూ నిటారుగ నిలబడితారు.)

జ్యూపి — శవాలబండి! (కిటికీవద్దకు వెళ్తాడు.) బండినిండా ఉన్నాయి శవాలు. ప్రతిచోటా ఈ ఎల్లో ఫీవరే, టామ్‌గారూ! తెల్లవాళ్ళు ఈగల్లా చచ్చిపోతున్నారు. (ధూపం సెమ్మెల్లో నూనె వేస్తాడు. పొగ సన్నగా పైకిలేస్తుంది.)

జెఫ — (ప్యాట్సీతో) వింటున్నావా అది?

(ప్యాట్సీ ప్యాకింగు చేసేపని సాగిస్తూనే ఉంటుంది.)

జ్యూపి — ఇలాంటిది నేను ఎప్పుడూ చూడలేదు.

జెఫ — జ్యూపిటర్! ప్యాట్సీని వెంటనే జర్మన్ టౌనుకు తీసుకుపో.

ప్యాట్సీ — నేను వెళ్లదలచుకోలేదు.

(తలుపుగంట మోగుతుంది. చూడ్డానికి జ్యూపిటర్ పోతాడు.)

జెఫ — ప్యాట్సీ! కొద్దిరోజుల్లో నేనే అక్కడికి వచ్చి నిన్ను తీసుకు వెళతానమ్మా! తర్వాత ఇద్దరం కలిసి ఇంటికి వెళదాం.

ప్యాట్సీ — నాన్నా! నిన్నిక్కడ ఒంటరిగా విడిచిపెట్టి ఎక్కడికీ పోను.

జెఫ — పూర్తిచేయవలసిన కొంతపని ఉన్నదమ్మా నాకు.

ప్యాట్సీ — నేనూ ఇక్కడే ఉంటాను.

జెఫ — నువ్వు మహామొండి పిల్లవి.

ప్యాట్సీ — నేనిది బాగా ఆలోచించే చెప్తున్నా నాన్నా!

(జ్యూపిటర్, హ్యామిల్టన్ ప్రవేశిస్తారు.)

జ్యూపి — మిస్టర్ టామ్! మిమ్మల్ని చూడ్డానికి వచ్చారు వీరు.

జెఫ — (లేచి) కర్నల్ హామిల్టన్.

హామి — ప్రెసిడెంటుగారు వచ్చారా ? (జ్యూపిటర్ నిష్క్రమిస్తాడు.)

జెఫ — ఇంకా రాలేదు. మా అమ్మాయి, మిసెస్ రాండాల్ఫ్. కర్నల్ హామిల్టన్.

(ప్యాట్సీ నమస్కరిస్తుంది. హామిల్టన్ నమస్కరిస్తాడు.)

హామి — నన్నిక్కడ కలుసుకోమన్నారు. నేను బండిలో ఆయనకోసం ప్రతీక్షిస్తాను.

జెఫ — ఇక్కడే కూర్చోండి.

హామి — కృతజ్ఞుణ్ణి.

ప్యాట్సీ — క్షమించు నాన్నా ! కర్నల్ హామిల్టన్ (నమస్కరించి నిష్క్రమిస్తుంది.)

హామి — ప్లేగువల్ల చచ్చిపోయిన మనిషి ఒకడు అక్కడి వీధిలో పడిఉన్నాడు. (జెఫర్సన్ కిటికీ దగ్గిరికి వెళ్తాడు.) ఏమంత మంచి దృశ్యంకాదు. శవాల బండి తీసుకు రమ్మని మా డ్రైవరును పంపించాను.

జెఫ — ఇదంతా మహాచెడ్డ పని.

హామి — నిమిషనిమిషానికి అది చెడుతుంది. (అటూ ఇటు చూచి) ఎక్కడికైనా వెళ్ళుతున్నారా ?

జెఫ — అవును. అంతా చిందరవందరగా ఉంది. క్షమించాలి. (కూర్చొని కలం ఎత్తుకుంటాడు.) క్షమించాలి. నాకు........(పనిఉందని సూచిస్తాడు.)

హామి — సరి సరి. మీరు పనిచేసుకొండి. నేనున్నానని పనికి అంతరాయం కలిగించవద్దు.

(జెఫర్సన్ మళ్లా వ్రాతప్రారంభిస్తాడు )

జెఫ — ప్రెసిడెంట్ వెంటనే నగరం విడిచి వెళ్ళిఉంటాడు.

హామి — ఆయన్ని బైటికి వెళ్ళమని నేనే ఆజ్ఞాపించాననుకొండి. ఈ మహాపురుషుడు చాలపట్టుదల కలవాడు. అతన్ని కదపడం అంటే కష్టం. ఒక్కొక్కప్పుడు అసాధ్యం అనిపిస్తుంది. (జెఫర్సన్ తన వ్రాతలో మగ్నుడై ఉంటాడు. తన కుర్చీకి దగ్గిరగాఉన్న బల్లపై పడిఉన్న పెక్కు పత్రికలను తిరగవేస్తుంటాడు హామిల్టన్. చాల ఆశ్చర్యంతో ఒక పత్రికను ఎత్తుకొని కనుబొమలెత్తి జెఫర్సన్‌వైపు చూస్తాడు. తర్వాతకొంటెతనంతో చిరునవ్వునవ్వుతాడు.) గెజెటా?

(జెఫర్సన్ వ్రాత ఆపుచేసి హామిల్టన్‌ను ఎగాదిగ చూస్తాడు. ఏదోగొణుక్కుంటాడు.)

జెఫ — అవును.

హామి — మీకు సంబంధించిన ఒకవ్యాసం ఉంది ఇందులో. చదివారా ?

జెఫ — (కలం అక్కడ పడేసి అతనివైపు చూస్తాడు.) చదివాను. (ఒక్క క్షణం ఆగి మళ్లా వ్రాత ప్రారంభిస్తాడు.)

హామి — (ఆ పరిస్థితులను సంతోషిస్తూ చిరునవ్వునవ్వుతాడు.) శేషుగ్గా వ్రాశాడు.

జెఫ — బాగా వ్రాశాడు. కాని పూర్తిగా అబద్ధాలు వ్రాశాడు. కర్నల్ హామిల్టన్, అన్నీ అబద్ధాలే.

హామి — ఓ, ఏదీ ఒక్కొక్కటే చూద్దాము—స్త్రీలలో మీరు బాగా మెలగ గలుగుతున్నారు.

జెఫ — (వ్రాస్తూ) గెజెట్‌లో అలాగే ఉంది.

హామి — నేను ఈ వ్యాసం చదివినప్పుడు…………

జెఫ — మీరు చదివినప్పుడా ? మీరే వ్రాశారని అందరూ అనుకుంటున్నారు, మిస్టర్ హామిల్టన్ !

హామి — (పత్రిక ఎత్తి ఏదో చూస్తున్నట్టు నటిస్తూ) ఇది ఎవరో ' పా-సి-ఫి-కస్ ' అన్న మనిషి వ్రాసినట్టున్నాడు.

జెఫ — పాసిఫికస్. శాంతి ప్రియుడు ! మంచి పేరు పెట్టుకొన్నాడు. కర్నల్ హామిల్టన్ ! మన మొదటి క్యాబినెట్ మీటింగునించీ మీరూ నేనూ పందెం కోళ్ళు బరిమీద దిగినట్టు దిగాము. ఇప్పుడీ కోళ్లపందెం అయిపోయింది. ఇప్పుడు క్యాబినెట్ అంతా ' పాసిఫికస్ ' వశం అవుతుంది.

హామి — అదెలాగు ?

జెఫ — ప్రెసిడెంట్ మీతో చెప్పలేదా ?

హామి — లేదు.

జెఫ — నేను రాజీనామా ఇచ్చేశాను.

హామి — ఓహో ! అట్లానా ? ఇది వింటానికి చాలా విచారంగాఉంది.

జెఫ — నాకేమీ విచారంలేదు. నాకు చాలా హాయిగా ఉంది, కర్నల్ !

హామి — (లేచి కిటికీదగ్గరకు వెళ్తాడు.) అలాగే అయితే నేనూ మీతో అనందిస్తాను.

జెఫ — ప్లేగు పోయేదాకా మీ ఊళ్ళో ఉండి వస్తారు కాబోలు.

హామి — అవును.

జెఫ — కొద్ది రోజుల్లో నేను వెళ్ళిపోతాను. మళ్లామనం కలుసుకొనే అవకాశం ఉండదనుకుంటాను.

(పెద్ద బల్ల దగ్గిరికి వెళ్లి వ్రాతచెక్క— దానిపై పెడ్తాడు.)

హామి — బహుశా అంతే అనుకుంటాను.

జెఫ — కోపం తాపం లేకుండా మనిషిని మనిషి అడుగుతున్నట్టు ఒక్క విషయం అడుగుతాను — (పత్రిక ఎత్తుకుంటాడు.) ఇది ఒక మంత్రి పదవి అలంకరించిన మనిషికి తగునా?

హామి — (తిక్తతతో) నా వ్యక్తిగత జీవితంలో రహస్యాలు తెలకడానికి మీ మనుష్యుల్ని పంపడం మీ గొప్పపదవికి తగిన పనేనా?

జెఫ — నే నెప్పుడూ అలా చేయలేదు.

హామి — నే నదంతా భరించి ఊరుకొంటాననుకొన్నారా? నన్ను మీరు దొంగ అని పిలిస్తే నేను విని ఊరుకొంటాననుకొన్నారు. మీరుచేసేందానికి ఏమైంది? నాపై ఆరోపించిన దోషాలన్నీ అబద్ధమని ఒప్పుకుంది కాంగ్రెసు. నేరాలో పని చేసినతర్వాత నేను మరీ బలపడ్డాను. నేను పారిపోలేదు. ఇక మీ విషయంలోనా? ఇక మీరు ఇంటికి వెళ్లి మీ కొండ శిఖరంపై ఎక్కి కూర్చోవడం మంచిపని అనుకుంటాను. మీ తాత్త్విక ప్రయోగం అయిపోయింది. మీ ప్రజారాజ్యం నశించింది.

జెఫ — మీరు నిజంగా అలా అనుకుంటున్నారా?

హామి — అది నేనెరుగుదును. ఇప్పటికి ఆవేళ్ళక్రితం ఎరుగుదును. (తలుపు గంట వినిపిస్తుంది.) దేవుడా! ఈ శకునాలు స్పష్టంగా లేవా, ఎంతకళ్లు లేనివాళ్ళకైనా? మీప్రజలను గూర్చి ఇప్పుడేమనుకొంటారు మీరు? మీతో పాటు కలలుగన్న లాఫాయెట్ సంకెళ్ళతో ఒక జర్మన్ జైలులో కుళ్ళుతున్నాడు. తానెవరికి స్వేచ్ఛ ఇప్పించాలనుకొన్నాడో వాళ్ళనుంచి అదే అతని రక్షాస్థానం. అక్కడికీ అతను అదృష్టవంతుడే. సమయానికి పారిపోయి ఉండకపోతే ఈ పాటికి అతని తలకాయ బుట్టలో పడి ఉండేది. అతనిరక్తం మురికికాలువలోంచి ఫ్రాన్సుయొక్క ఉన్నతవంశసంజాతుల రక్తప్రవాహంలో కలిసిపోయేది — ఈ తాగుబోతు మందలు, మీ ప్రజలు, అందులో పొర్లాడ్డానికి, ఇదంతా నాకు మహాజుగుప్సాకరంగా ఉంది. ఇప్పుడు అవేదోపిడిగాళ్ళ గుంపులు, తర్వాత అదే భీభత్సం!

జ్యాపి — (ప్రవేశించి) జనరల్ వాషింగ్టన్.

వాషిం — (ప్రవేశించి) జంటిల్‌మన్! (చాలా వృద్ధుడై పోతున్నాడు. అతని మొహంపై అలసటా కింకర్తవ్యతామూఢతా కనిపిస్తున్నాయి. కాని పట్టుదలతో కూడిన నిశ్చయదార్ఢ్యం అతనిలో కనిపిస్తుంది. జ్యాపిటర్ వెళ్ళిపోతాడు.)

జెఫ — మిస్టర్ ప్రెసిడెంట్. (వాషింగ్టన్ వైపు వెళ్తాడు. అతని హ్యాటు కర్రా అందుకుంటాడు.)

హామి — ఇంగువగుడ్డ లేదా ? (తనవద్దఉన్న ఒక అదనపుప్యాడ్ను ప్రెసిడెంటుకు ఇస్తాడు.) ప్రెసిడెంటుగారూ ! ఈ పరిస్థితుల్లో మేము మిమ్మల్ని పోగొట్టుకోలేము. ప్రార్థిస్తున్నాను తీసుకొమ్మని.

వాషిం — సరే. (తీసుకొంటాడు.) కృతజ్ఞుణ్ణి. (కూర్చుంటాడు. ఒక్కక్షణం నిశ్శబ్దం. కుర్చీచేతిపై వేలుతో మృదువుగా తబలాపైవలె కొట్టుతూ యోచిస్తుంటాడు. శవాల బండిచప్పుడు వినిపిస్తుంది.) అప్పుడే రెండువేలకు పైన చచ్చిపోయారు. తుపాకులు ఉపయోగించే వందయుద్ధాలకంటె అధ్వాన్నమైనదీ ప్లేగు. (నిట్టూర్పుతాడు.)

హామి — మీరు వెంటనే నగరం విడిచిపెట్టి వెళ్ళిపోవలసినదండీ !

వాషిం — ఈ పరిస్థితుల్లో ఉండేవానికంటె గోరీలో ఉండడం నేను ఇచ్ఛగిస్తాను. (వేలితో కొట్టూ, పెద్దగా నిట్టూర్పుతాడు. దీర్ఘవిరామం.) ఏమిటి. దీనిఅర్థం ? (నిశ్శబ్దం) నమ్మలేను. మనుష్యులకు స్వేచ్ఛగా ఉండే అర్హత లేదా ? అదా జవాబు ? మీ ఫ్రెంచి మంత్రితో మాట్లాడారా ?

జెఫ — మాట్లాడాను. అతనితో ఎవ్వరూ వాదించలేరు. అతను పిచ్చివాడు. అతన్ని పిలిపించుకొండని వ్రాశాను.

వాషిం — వాళ్ళందరూ పిచ్చివాళ్ళే. లాఫాయత్ ప్రాణాలు అరచేత పెట్టుకొని పారిపోవడం చూడండి ! ఇక్కడో ? ప్రజల గుంపులు దోపిడీలు చెయ్యడం ! ఏమిటి దీని అర్థం ? (విరామం.) లాఫాయత్తుకు ఎంతవరకు సహాయం చేయగలమో అంతా చెయ్యాలి.

జెఫ — మన రాయబారి మారిస్‌కు అప్పుడే వ్రాసేశాను. అత నెంతవరకు ఈ విషయంలో చేయగలడో అంతా చేయమని. (వాషింగ్టన్ జంకుతూ గెజెట్టు ప్రతిఎత్తి జెఫర్సన్ వైపు చురుకుగా చూస్తాడు. హామిల్టన్‌తో కఠినంగా) మీరు కొంచెం బైటికి వెళ్ళితే ? తర్వాత మీతో మాట్లాడ్తాను.

హామి — (జెఫర్సన్ వైపు చూచి వికటంగా చిరునవ్వునవ్వుతాడు.) మీ బండిలో కూర్చుంటాను. (వాషింగ్టన్ సరే అన్నట్టు తల ఊపుతాడు.) జెఫర్సన్ గారూ ! సెలవు తీసుకుంటాను.

జెఫ — చిత్తం.

(హామిల్టన్ వెళ్తాడు.)

వాషిం — అతనితో వేరే మాట్లాడవలసి ఉంది. అతను కోరుకుంటాడు. ఎప్పుడూ అంతే అనుకొంటి. యుద్ధంలో ఒకప్పుడు నాకతను అంగరక్షకుడుగా ఉన్నప్పుడు నన్ను రెండు గంటలసేపు నిలబెట్టేశాడు. నేను చివాట్లు పెట్టేసరికి రాజీనామా ఇచ్చాడు. చిన్న పిల్లవాడిలా రుసరుస లాడాడు. (హామిల్టన్ యెడ ప్రేమ ఉప్పొంగి మెత్తపడతాడు.) చిట్టచివరికి అతనికి కావలసించేదో ఇచ్చేశాను — ఒక దళం నాయకత్వం. అతను చాలా మంచి సిపాయి. యార్క్-టౌన్‌పై దాడిచేసినప్పుడు అతనే చాలా గట్టివాడు. చాలా విలవైనవాడు. మీరిద్దరూ కలసి ఎందుకు పని చేయరాదూ ?

జెఫ — ఉత్తర దక్షిణ ధ్రువాల కున్నంత మేర ఉన్నవి మా మతాల్లో.

వాషిం — రెంటికీ సంధి కబుపు.

జెఫ — అది సాధ్యంకాదు.

వాషిం — నన్ను మధ్యవర్తిగా ఉండనీ.

జెఫ — వెనక ఒకసారి ప్రయత్నించారు మీరు.

వాషిం — మరొకసారి ప్రయత్నించనీ.

జెఫ — ఏమీ లాభంలేదు. నన్ను నమ్మండి. మేమిద్దరం నిజంగా మా నమ్మకాలను ఒకరికోసం ఒకరు బలివేయలేము.

వాషిం — (నిట్టూర్చుతాడు. వేలితో కుర్చీమీద కొట్టుతూ ఉంటాడు.) సరే. నేను ఇంటికి వెళ్లే అజ్ఞ అయినది. అల్బెమార్లి కౌంటికి ఏమైనా చెప్పవలసి ఉందా ?

జెఫ — (వాషింగ్టన్ పక్కనే కూర్చుంటాడు.) మిస్టర్ మాడిసన్‌కు నా శుభాకాంక్షలు అందజెయ్యండి. గింజలు రాల్చే యంత్రం ఎలా పనిచేస్తుందో మా పార్కులో చూడండి. మీకది నచ్చితే రిచ్మండ్‌లో ఆ యంత్రం చేసేవాడున్నాడు. ఏదైనా పని చెప్పితే సంతోషంగా చేస్తాడు. రెండు గుర్రాలతో గంటకు 8 బుషెల్ల గోధుమలు నూర్చవచ్చు.

వాషిం — అట్లానా ? అయితే తప్పకుండా చూస్తాను.

జెఫ — మళ్లా వసంతంలో ఇద్దరం కలిసి తోటలు వేసుకుందామని మాడిసన్‌తో చెప్పండి.

వాషిం — కాదు, టామ్ ! నువ్వలా చెయ్యవని నాకు తెలుసు.

జెఫ — ఎందుకు చెయ్యను ?

వాషిం — (లేచి, ఒక కాగితం తీసి బల్లమీద పెడ్తాడు.) నీ రాజీనామా. నేను స్వీకరించలేను.

జెఫ — (లేచి) మిస్టర్ ప్రెసిడెంట్! నన్ను క్షమించాలి. మీరు తప్పకుండా స్వీకరించాలి.

వాషిం — నీ స్థానం ఆక్రమించగల వాడింకొక డేడి ?

జెఫ — అలా చెప్పకొని నేను సంతోషించలేను. ఈ పనిలో నేను కృతకృత్యుణ్ణి కాలేకపోయాను.

వాషిం — ఆ విషయంలో తీర్పు చెప్పేవాణ్ణి నేను.

జెఫ — ఇరవైనాలుగేళ్లు ప్రజాసేవలో గడిపాను. కష్టాలతో జీర్ణించిపోయాను. ఇదంతా నిష్ఫలప్రయాస. చికాకుతప్ప దీనివల్ల మనకు కలిగిన ఫలం ఏమీ లేదు. నా స్వంతపనులు చాలా కాలంనించి పాడుపడి ఉన్నాయి. మా ఇంటి వ్యవహారాలు అరాజకంగా ఉన్నాయి. ఇప్పుడు నా స్వంతపనుల వైపూ నా కుటుంబం వైపూ దృష్టి మరల్చాలి.

వాషిం — ప్రజల ఆదరాభిమానాలో ?

జెఫ — ఒకప్పుడు నేను వాటికే విలువనిచ్చేవాణ్ణి. ప్రపంచంలో మరి దేనికీ అంత విలువ ఇచ్చేవాణ్ణికాను. కాని ఇప్పుడు ప్రశాంతవాతావరణం కోరుతున్నాను. ఇక్కడ నేను ద్వేషించే ప్రతిదానికోసం నేను ప్రేమించే ప్రతిది విడిచి పెట్టేయమని మీరంటున్నారు. నన్ను క్షమించాలి. నేనీపని చెయ్యలేను. నాజీవితకాలంలో కొంత ప్రశాంతత కావాలి.

వాషిం — నాకు తెలుసు. నాకు తెలుసు. నేనూ విసిగిపోయాను, టామ్ ? నేను ముసిలివాడి నైపోతున్నాను. పాటోమాక్, మౌంట్‌వెర్నాన్ల కలలు కంటూనే ఉంటాను. (విగ్గరగా అరుస్తాడు.) ఇదంతా నాకు మాత్రం అసహ్యంగాలేదూ ? నా పొలంలో ప్రశాంతంగా జీవితం గడపాలనే కోరిక నాకు లేదంటావా ? ఇదంతా నీకు తెలియదా, తెలియదా........? (ఆవేశం దిగమ్రింగుతాడు. దీర్ఘ నిశ్శబ్దం. గొణుగుతాడు.) మనజీవితాల్లో శాంతియా ? ఎక్కడ....? (అక్కడ సరియైనమాట వెయడానికి తడుముతాడు.) అవును....పేన్ వ్రాశాడు. 'క్రైసిస్' లో కాదూ ? "మనుష్యుల ఆత్మబలాన్ని పరీక్షించే కాలమిది. ఈ పరీక్షాకాలంలో యోధుడూ దేశభక్తుడూ కూడా క్రుంగిపోతారు........" (జెఫర్సన్ కుర్చీలో కూలబడతాడు. అనుకోకుండా ప్రెసిడెంట్ అతన్ని బలంగా దెబ్బకొట్టి నట్టయింది.) ఆ చిత్రం అంతా నాకళ్లముందుకు వస్తుంది. నిన్నమొన్న జరిగి నట్టనిపిస్తుంది. నా సిపాయీలకు తిండిలేదు, గుడ్డలేదు, వాళ్ల గాయాలనుండి రక్తం స్రవిస్తుంది. నేను పేన్ వ్యాసం చదివాను. అది నాకు కొత్తబలం ఇచ్చింది. నాసిపాయీలందరికీ చదివించి వినిపించాను తప్ప కొట్టించినట్టుగా.

ఆ వ్యాసం చెప్పకను ఎటూడిదియించాను. చాసిపిట్ల ... ఆ వ్యాసం వాళ్ళకు కొత్తబలం ఇచ్చింది. వాళ్ళలో ధైర్యం ... ఆ మాటలు నీకు జ్ఞాపకమున్నాయా ? ఒక టోరీ హోటలు యజమాని ... నికి ప్రతికూలంగా ఉన్నాడు. ఎందుకంటే........(అతను వెనుకటున్నట్టూ దొరికింది) "తన జీవితకాలంలో ప్రశాంతత కావాలని" అతను కోరాడు. నేల మీద పాకుతున్న హోటలు యజమాని పిల్లల్ని పేన్ చూచి ఇలా అను కున్నాడు, "ఈ టోరీయే మొగాడైతే ఆతనిలా అనవలసింది : నిరంకుశ త్వంతో సంఘర్షణే జరగవలసి వస్తే అది నాకాలంలోనే దానివ్వండి. నాపిల్లల కాలంలో శాంతిస్వేచ్ఛలు ఉండనివ్వండి." అవును. అవే జవాబు. (హఠాత్తుగా జెఫర్సన్ చెయ్యి పట్టుకొంటాడు.) టామ్! మనం నిర్మించిన భవనం అంతా కూలిపోతుంది. మన రిపబ్లిక్ చచ్చిపోతుంది. దానికి బోట్లుపెట్టి నిలబెట్టాలి. ఎలాగైనా సరే—ఏమైనా సరే. (భయంకరంగా ఒక యోదుడు పట్టుదలతో ఒక భూతంతో దెబ్బలాడుతున్నట్టు బల్లను గుద్దే స్తున్నాడు.) రిపబ్లిక్‌కు ఒక అవకాశం తప్పకుండా ఇవ్వాలి. అది తప్ప కుండా బతుకుతుందని నేను ఘంటాపదంగా చెబుతాను. తప్పకుండా, తప్ప కుండా, తప్పకుండా! అది బతకడం కోసం నారక్తం ధారపోస్తాను. (భీభత్సం మాయమౌతుంది. మళ్ళా అలసిపోయి, ... ముసలివాడయి పోతాడు.) మరికొన్నిరోజులు ఉంటావుకదూ? మరొకమనిషి దొరికేవరకు?

జెఫ — ఉంటాను.

వాషిం — మంచిది. చూచావా ? నేను ఇక కొద్దిరోజుల్లో ఉరిశిక్షకు పోయే మనిషిలాంటివాడిని. కొన్నిరోజుల వ్యవధానంకూడా నాకు ఆనందం కల గిస్తుంది. (దీర్ఘంగా నిట్టూర్చి, బయల్దేరబోయి వెనక్కి తిరుగుతాడు.) నేనిక్కడ ఉండను. నీ కాగితాలు తీసుకో. మీ ఊరికి పో. అక్కడే ఉండి పనిచేయ వచ్చు. (నమస్కరిస్తాడు.) మిష్టర్ జెఫర్సన్.

జెఫ — (లేచి) మిష్టర్ ప్రెసిడెంట్.

(వాషింగ్టన్ వెళ్లిపోతాడు. ... జెఫర్సన్ బాధతో కుర్చీలో కూలబడతాడు. ... ప్రవేశించి ... మరింత నూనె వేస్తాడు. ఒక సంగీతం పెట్టె పట్టుకొని ప్యాట్సీ ప్రవేశిస్తుంది.)

ప్యాట్సీ — నాన్నా ! ఇటుచూడు. లోపల ఈ చిన్న సంగీతపుపెట్టె దొరికింది.... నాన్నా ! ఒంట్లో బాగాలేదా ?

హామి — కాన్స్టిట్యూషన్ ఏదో వేదంగా మీరు భావించకపోతేసరి.

జెఫ — అదా !

హామి — మనం ఇద్దరం కలిసి పనిచేయాలంటే మీరు.... .... ....

జెఫ — అలా మనం చేయడం లేదు.

హామి — అలానా ?

జెఫ — మనం సహజ శత్రువులం.

హామి — నేను సంధికి సిద్ధంగా వున్నానుకదా !

జెఫ — తోడేళ్ళు గొర్రెకు శాంతిసందేశ మిచ్చినట్టు.

హామి — నన్ను మీరు ప్రశంసించరు.

జెఫ — అది అమెరికన్ కళకాదు.

హామి — నేను పొరపాటున అమెరికను కాలేదు, కోరిఅయ్యాను.

జెఫ — అయినా పాతప్రపంచపు చెడుగుల్లోను నేరాల్లోను పుట్టిపెరిగిన ఒక అసత్యాన్ని ఇక్కడికి తెస్తున్నారు.

హామి — అసత్యమా ?

జెఫ — అవును. సామాన్యప్రజానీకం తమ వీపులపై జీనులు వేసుకు పుట్టారనీ, కొద్దిమంది మేకులుగల బూట్లతో వాళ్ళ వీపులపై ఎక్కి దైవానుగ్రహంవల్ల సవారిచేసే హక్కుతో పుట్టారన్న అసత్యం.

హామి — ఇది హాస్యాస్పదంగా ఉంది. ధనికులై, భూస్వాములై . బానిసలకు యజమానులై పుట్టిన మీరు సామాన్యప్రజలనుగూర్చి ఈవిధంగా మధనపడడం !

జెఫ — మీ పుట్టుపూర్వోత్తరాలుకూడా వెతికి చూసుకొండి, హామిల్టన్‌గారూ ! మరి మీరు.... .... ....

హామి — అది చెప్పకండి. (ఆగ్రహావేశంతో కంపించిపోతూ) మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను.

జెఫ — ఏమిటి చెప్పకపోవడం ? మీ బాల్యంలో మీరు పేదగా ఉండిరనా ? మీరీ దేశానికి వచ్చారు. ఈ దేశం మీకు గౌరవం ఇచ్చింది; ధనం ఇచ్చింది. ఈ దేశంలో ప్రతి పిల్లవాడికీ ఇలాంటి అవకాశమే లభించాలని నా నమ్మకం.

హామి — ఈ దేశం బలమైన దేశం కావాలని నేను కోరుతున్నానంటారా, లేదా ?

జెఫ — ఒక దేశం బలవంతం కావాలంటే ఆదేశప్రజలే ఆ దేశాన్ని పరిపాలించుకోవాలి.

హామి — నా పొలాల్లో పనిచేస్తున్న రైతులవల్ల మనదేశం బలపడుతుందంటారా ?

జెఫ — అమెరికాలో పేదరైతులు లేరు.

హామి — మాటలు ! నాకు మాటలంటే లక్ష్యం లేదు. రైతులను కర్షకులనండి. మరేమైనా అనండి ! ప్రజలు తమ్ముతాము పరిపాలించుకోలేరు.

జెఫ — ఐతే వాళ్లు ఇతరుల్ని పరిపాలించగలరా ? వాళ్ళను పరిపాలించడానికి దేవతలు రాజులయొక్క నియంతలయొక్క రూపాల్లో అవతరించారా ?

హామి — నేను మీకు చిట్టచివరి సూచన చేశాను. వెళ్ళండి ! మీ కొండకు పయనెత్తుకు పొండి ! మీకు వాగ్దానం చేస్తున్నాను. ఈక్షణం నించి మీరెప్పుడూ ఈ పార్టీలో తలెత్త సాహసించరాదు.

జెఫ — నాకు పార్టీ అంటే అసహ్యం. కాని మీతో దెబ్బలాడ్డానికి పార్టీయే కావాలంటే నేనొక కొత్తపార్టీ సృష్టిస్తాను. నేను ప్రజాపార్టీ సృష్టిస్తాను.

హామి — ఇప్పుడు బైటపడ్డారు. మీరు రెండు పార్టీలు కావాలని కోరుతున్నారు. మీరు రక్తప్రవాహం కోరుతున్నారు. లోపల మీరూ జాకొబిన్ హంతకులే.

జెఫ — మీరు నమ్ముతున్న అబద్ధాలలో ఇదొకటి. మీకు తెలియకకాదు. నమ్మాలని నమ్ముతున్నారు. నాపై కత్తి దూయడానికి మీకు ఇదో సాకు. 'జాకొబిన్ హంతకుడు' అని చెప్పి ప్రతిమనిషి నోరూ మూయిస్తున్న మీ వాలకం చూస్తే నాకు అసహ్యంగా ఉంది.

హామి — అయితే, మీరు జాకొబిన్ కానంటారా ?

జెఫ — కానివ్వండి. కపాలం, ఎముకలు పట్టుకొని మంత్రాలు చదవండి. జడిపింపులు తంత్రాలు పన్నండి. మొదటి దశలో పడ్డ కష్టాలకు అలసి మేము నిద్రపోయాము. మీరు మమ్మల్ని తాళ్లతో చుట్టి కట్టేశారు. మేము మేల్కొని లేవడమే తరవాయి. మీ తాళ్ళు దారాల్లా పుటుక్కున తెగిపోతాయి.

హామి — సరే. ఐతే పోరాటమే కానివ్వండి. కాని దీన్ని సవ్యంగా నడవనివ్వండి. మీరు ప్రజానీకాన్ని రేకెత్తించారా, జ్ఞాపకముంచుకోండి — అమెరికాకు నిజమైన యజమానులమైన మేము మళ్లా మాదేశాన్ని మేము స్వాధీనం చేసుకోగలం — "ప్రజ" లనబడే మీ గొప్పపశువునుండి.

జెఫ — కాని ఒకమాట నన్ను చెప్పనివ్వండి. మా ప్రజలు ఒక్కసారి తమ చేతుల్లో ప్రభుత్వం గట్టిగా తీసుకొన్నారా, వాళ్ళకు రాక్షసబలం వస్తుంది. వాళ్ళు తమ శరీరాలనించి హృదయం చీల్చివేయబడ్డానికైనా సిద్ధపడతారు గాని ఒకనియంత అయిన రాజు వాళ్ళ స్వాతంత్ర్యం లాక్కొంటానంటే ఒప్పుకోరు.

హామి — (నమస్కరించి) సెలవు తీసుకొంటాను, జెఫర్సన్ గారూ !

జెఫ — సెలవు, హామిల్టన్ గారూ! (హామిల్టన్ నిష్క్రమిస్తాడు. జెఫర్సన్ ప్యాట్సీ వైపు తిరుగుతాడు.) ప్యాట్సీ! ఈ పోరాటం నా జీవిత శేషం అంతా హరిస్తుంది.....

ప్యాట్సీ — అవును.

జెఫ — ఇది వేయక తప్పదు. నాకిదంటే అసహ్యం. అయినా తప్పదు ప్యాట్సీ! యాన్, జెఫ్, వాళ్ల పిల్లలూ స్వతంత్ర స్వేచ్ఛా ప్రజాతంత్ర దేశంలో పెరగాలని నా కోరిక. ఈ పోరాటం సాగించక తప్పదు, ప్యాట్సీ!

ప్యాట్సీ — అలాగే చేయి. (లేస్తుంది. జెఫర్సన్ వద్దకు వస్తుంది.) అలాగే చేయి, నాన్నా! (ఆవేశంతో ఆమె అతని చెయ్యి పట్టుకొని ముద్దుపెట్టుకొంటుంది.)

---

## మూడవ అంకము

### మొదటి రంగము

రంగం: వాషింగ్టన్ నగరం, 1801. [illegible] బోర్డింగ్ హౌసులో జెఫర్సన్ నివాసం.

జెఫరసన్ బల్లదగ్గర కూర్చొని వ్రాస్తున్నాడు. అతని మనుమడూ మనుమరాలూ అతని పాదాలదగ్గర నేలపై ఆడుకొంటున్నారు. ప్యాట్సీ కూర్చొని అల్లిక పని చేస్తూంది. బైట కోలాహలం. జ్యాపిటర్ బల్లమీద ట్రే పెట్టుతున్నాడు. ఒక ఎత్తైన పీఠంపై వాషింగ్టన్ చంద్రకాంత శిలావిగ్రహం ఉంది.

తలుపుకొట్టిన చప్పుడు. ప్యాట్సీ లేచి నిలబడుతోంది. జ్యాపిటర్ తలుపు దగ్గిరికి వెళ్ళబోతున్నాడు.

ప్యాట్సీ — నేను తీస్తాలే, జ్యాపిటర్!

(ఆమె త్వరగా తలుపుదగ్గరకుపోయి తీస్తుంది. ఒక వార్తావహుడు ఆమె చేతికొక ఉత్తరం ఇస్తాడు. ఆహోటల్లో ఉన్న వాళ్ళు గుంపుగా అతని చుట్టుముట్టి ప్రశ్నపరంపర అతనిపై కురిపిస్తారు.)

వార్తావహుడు — ఇరవైఏడవ బ్యాలెట్ ఇప్పుడే వచ్చింది.

ప్యాట్సీ — థాంక్ యూ. (ఒక గుంపు ఆమెను ప్రశ్నలు కురిపిస్తుంది.) ఒక్క నిముషం ఆగండి. (ఉత్తరం తండ్రి కిస్తుంది: జెఫర్సన్ ఉత్తరం చదువు

తాను. ఆమె ఆత్రతతో చూస్తూ ఉంటుంది. జెఫర్సన్ ఉత్తరం నలిపి పారే స్తాడు. చిరునవ్వుతో తల ఊపుతాడు.)

జెఫ — అదే !

ప్యాట్సీ — ఒహో ! (తలుపువద్దిరికి వెళ్ళుతుంది) ఏమి కాలేదు. కాంగ్రెస ఇంకా ప్రతిష్టంభించే ఉంది.

(బైటజనం ఏమిజరిగిందో పూర్తి వివరాలు తెలుసుకోవాలని తొందర పడుతోంది)

మొదటి మనిషి — మిష్టర్ బర్‌కు మీనాన్నకంటె ఒక ఓటు తక్కువైందని విన్నాము.

ప్యాట్సీ — నాకు తెలిసినంతమట్టుకు అది నిజంకాదు.

వార్తా — (తల ఊపుతాడు) వాళ్ళతో చెప్పాను. (తక్కినవాళ్ళతో) మీతో చెప్ప గదా ? (వెళ్ళిపోతాడు)

రెం. వాడు — మేము జెఫర్సన్‌ను అధ్యక్షుడిగా ఎన్నుకొన్నాము. కాంగ్రెసు ఇంతకీ ఏమిచేస్తున్నట్టు ? వాళ్ళేమి చేయదలచుకొన్నారమ్మా ?

మూ. వాడు — ఫెడరలిష్టులు తమ మనిషి నెవరినో అధ్యక్షుణ్ణి చేయాలని తల పెట్టారట. నిజమేనా ?

ప్యాట్సీ — నే చెప్పలేను ?..............

(హుందాగా పెద్దగొంతుక చేస్తూ ఒకావిడ అక్కడికి, గుంపును తోసుకుంటూ వస్తుంది.) ఆమె మిసెస్ కాన్రాడ్, బోర్డింగుహౌసు యజమానురాలు.)

మిసెస్ కాన్రాడ్ — దయచేసి క్రిందికి నడవండి. అందరూ! కింది పెద్దహాలు లోకి. ఫలితాలు రాగానే మీకు తెలియజేస్తాము. వెంటనే, జెఫర్సన్‌గారిని బాధపెట్టకండి. కొంచెం ఏకాంతంగా ఉండనివ్వండాయన్ని. దయచేసి కిందికి నడవండి. నామాట వినండి! (లోపలికి వస్తుంది. క్షమాపణవేడ్తూ ఉన్నట్టుగా చెవిలో ఊదుతుంది.) ప్రతి ఒక్కరూ ఆవేశంతో ఊగిపోతున్నారు, తెలుసా!

ప్యాట్సీ — ఇదంతా కుటుంబంలోనే కదా ?

మి. కాన్రాడ్ — ఇలాంటి సమయంలో తక్కిన బోర్డర్లు మీనాన్నని బాధపెట్టడం నాకిష్టం లేదు.

ప్యాట్సీ — థాంక్‌యూ !

(ఒక మోటుధ్వని వినిపిస్తుంది పాడుతూ: "తప్పుకోండి," "ఒకవైపుకు!" బోర్డర్లను తోసుకువస్తున్నాడు ఒకమనిషి. ఆపాద మస్తకం సాయుధుడైన ఒక ఫ్రాంటియర్ మనిషి అతడు. తలుపు దగ్గరకువచ్చి నిలబడతాడు.)

ఫ్రాంటియర్ మనిషి — టామ్ జెఫర్సన్ ఇక్కడున్నారా ?

ప్యాట్సీ — ఏమిటది ?

ఫ్రాంటి. మనిషి — వర్జీనియా గవర్నర్ మన్రో నుంచి ఒక ఉత్తరం తెచ్చాను.

జెఫ — ఇక్కడ.

ఫ్రాంటి. మనిషి — మీరా ! టామ్ జెఫర్సన్ అంటే ?

జెఫ — అవును.

ఫ్రాంటి. మనిషి — (ఉత్తరం ఇస్తాడు.) మీకు స్వయంగా ఈ ఉత్తరం ఇమ్మన్నారు గవర్నర్ మన్రో.

జెఫ — థాంక్‌యూ ! (ఉత్తరం విప్పి చదువుతాడు.) కూర్చోండి.

ఫ్రాంటి. మనిషి — ఫరవాలేదు. నిలబడుతాను. రిష్మండ్‌నించి గుర్రం మీద యేకాయెకి వచ్చాను. గుర్రమూ అలసిపోయింది. దీని ప్రత్యుత్తరం కోసం గవర్నర్ నిరీక్షిస్తున్నారు.

జెఫ — అప్పుడే జవాబు దొరకదు.

ఫ్రాంటి. మనిషి — ఎన్నికల్లో ఇంకా ఏదీ తేలలేదా ?

జెఫ — లేదు. కొంచెం ఆగి వెళ్ళాలి.

ఫ్రాంటి. మనిషి — సరే !

జెఫ — మిసెస్ కాన్రాడ్ ! ఈ పెద్దమనిషికి కొంచెం ఏదైనా వేడివేడిది తినడానికి ఇస్తావా ? జ్యూపిటర్ ! ఒక కొత్త గుఱ్ఱానికి జీను వేయి.

జ్యూపి — అలానే. (నిష్క్రమిస్తాడు)

మి. కాన్రాడ్ — అలాగే చేస్తాను వెంటనే. (తలుపువద్దకు వెళ్ళి పిలుస్తుంది.) నాథన్ !

ధ్వని — ఏమమ్మా !

మి. కాన్రాడ్ — వెంటనే భోజనం తయారు చెయ్యి.

ప్యాట్సీ — కొంచెం తాగుతారా ?

ఫ్రాంటి. మనిషి — థాంక్‌యూ ! అమ్మా ! ఇది క్రైస్తవ మర్యాద.

(ప్యాట్సీ చిరునవ్వుతో ఒక బ్రాందీసీసా తెస్తుంది. మిసెస్ కాన్రాడ్ తిరిగి వెళ్ళిపోతుంది.)

పిల్లవాడు — తాతయ్యా! ఆడుకొందాం రా?

ప్యాట్సీ — (మద్యం పోస్తూ) జెఫ్! తాతయ్య పనిలో ఉన్నారు.

పిల్లవాడు — రా తాతయ్యా! ....

జెఫ — తరవాత జెఫ్! నీకొక కొత్త ఆట నేర్పుతా.

పిల్లవాడు — కొత్తదా?

జెఫ — చాలా మంచిది కూడాను.

పిల్లవాడు — మార్కెట్టుకు గుర్రంఎక్కి వెళ్ళడం లాంటిదా?

పిల్ల — బలే! బలే! తాతయ్యా! చీపురు తీసుకురానా?

ప్యాట్సీ — (ఫ్రాంటియర్ మనిషికి మద్యం ఇస్తుంది.) పిల్లలూ! లోపలకు పొండి.

జెఫ — వద్దు, వద్దు, వాళ్ళేమీ నా పని చెడకొట్టడంలేదు. వాళ్ళు కావాలి నాకు.

(బల్లదగ్గరనుంచి పొమ్మని ప్యాట్సీ పిల్లలకు సైగ చేస్తుంది. తన పక్కను మూల వాళ్ళని కూర్చోబెట్టుతుంది.)

ఫ్రాంటి. మనిషి — ఒక్కగుక్కతో మింగేస్తాడు. హ్మ! లోపలి మట్టిని శుభ్రం చేస్తుందిది.

(తలుపుకొట్టినధ్వని. ప్యాట్సీ తొందరగా తలుపుదగ్గరకు వెళ్ళుతుంది మాడిసన్ అక్కడే నిలబడి ఉంటాడు. అతని వెనకాల బోర్డర్ల మంద. వాళ్ళూరికే అతనిమీద ప్రశ్నలు కురిపిస్తున్నారు. "నేనువచ్చేటప్పటికి చిట్టచివరి బ్యాలెట్ అది. ఇప్పుడు క్యాపిటల్ నించే వస్తున్నాను" అంటున్నాడు మాడిసన్.)

మాడి — (అలసటతో కూలిపోతున్న వాడిలా ప్రవేశిస్తాడు.) ప్రతినిధి సభనించి ఇప్పుడే వస్తున్నాను. తోసుకు రావలసి వచ్చింది ఇక్కడకు. వీధుల్లో జనం క్రిక్కిరిసి ఉన్నారు. ఇంతటి జనసమూహం నే నెన్నడూ చూడలేదు.

జెఫ — జెమ్మీ! చచ్చినంత అలసిపోయావు.

మాడి — (కూర్చుని మూలుగుతాడు.) అవును. చచ్చాను. ఇరవై ఏడవ బ్యాలెట్ వచ్చింది.

జెఫ — ఇప్పుడే మాకూ వర్తమానం వచ్చింది.

మాడి — నువ్వు కాంగ్రెసు చూడాలి! ఏమిదృశ్య మంటావు! కుర్చీలమీద కూర్చునే కునుకుతున్నారు. కొందరు నిలబడే కునికిపాట్లు పడుతున్నారు. కళ్లు చింతనిప్పుల్లా ఉన్నాయి. అలసి తుక్కైపోయారు!

జెఫ — నికల్సుకు జ్వరం ఏమైనా తగ్గిందా?

మాడి — ఎంకా ఏడెంటి. కమిటి రూములో విశ్రాంతి తీసుకుంటున్నాడు. బ్యాలెట్‌పై సంతకం పెట్టేటంత శక్తి మాత్రం ఉందటనికి.

జెఫ — ఎవరు చూస్తున్నా రతన్ని ?

మాడి — భార్య అతని ప్రక్కనే ఉంది. సమస్తోపచారాలూ చేస్తూంది.

జెఫ — హాస్పిటలులో ప్రవేశ పెట్టాలతన్ని.

మాడి — అతను ఒప్పుకోడు. చచ్చేవరకు నీకోసం ఓటు వేస్తానంటాడు. మరొక రాత్రి బతుకుతాడో బతకడో అనే సందేహమే నాకు. (జెఫర్సన్ తల ఊపుతాడు.) టామ్ ! ఒక అసహ్యమైన వదంతి వ్యాపిస్తుంది. జనానీకం ఆగ్రహావేశం చెందుతోంది.

జెఫ — అవును, నాకు తెలుసు. అది కేవలం వదంతి కాదు. అంతకంటె ఎక్కువే. నాకు భయంగా ఉంది. (మాడిసన్ చేతికి ఒక ఉత్తరం అందిస్తాడు.)

మాడి — దేవుడా ! ఇదెలా అంతమౌతుంది ?

మి. కాన్రాడ్ — మిసెస్ రాండాల్ఫ్ ! ఇప్పుడే నాభర్తతో మాట్లాడాను. ఇప్పుడు వోటింగు ఏమంత సరిగ్గా జరగడం లేదని మేము నిశ్చయించాము.

మాడి — ఒప్పుకున్నాను. ఒప్పుకున్నాను.

మి. కాన్రాడ్ — నా భర్తను తీసుకువెళ్లండి. మీనాన్న అధ్యక్షుడూ, మిస్టర్ బర్ ఉపాధ్యక్షుడూ కావాలంటాడాయన. ఇది బ్యాలెట్ పేపర్ మీద వ్రాసే అవకాశం ఆయనకుండాలి. ఉత్త రెండు పేర్లిచ్చేసి కాంగ్రెసును తీర్మానం చెయ్యమంటే ఏం లాభం ? నేను చెప్పింది న్యాయంగా లేదూ ? చూడండి ఏమౌతుందో ! మేము ఫెడరలిష్టుల్ని ఓడించాము. ఈ పాతకాంగ్రెసులో ఇప్పుడు చాలామంది ఫెడరలిష్టులే — ఎవరిని ఎన్నుకోవాలో వాళ్ళకు అర్థం కావడం లేదు. ఇప్పటికి ఆరు రోజులనుంచి కాంగ్రెసు ప్రతిష్టంభించిఉంది. ఇలాగే నాల్గేళ్ళవరకు స్తంభించి కూర్చుంటారు వీళ్ళు. మనకిక ప్రెసిడెంటు ఉండడు. ఈ అలస్యమంతా వాళ్ళు చేయాలని చేస్తున్నారు. అందరూ ఇదే అంటున్నారు.

జెఫ — అలా అంటున్నారా ?

మి. కాన్రాడ్ — వాళ్ళు చెప్పేది న్యాయసమ్మతమేను. (జోరుగా తల ఊపుతుంది. తాను చెప్పవలసిందేదో చెప్పివేసాననే సంతృప్తితో వెళ్ళిపోతుంది.)

మాడి — ఈ ఇబ్బందిని ముందే మనం యోచించవలసి ఉండేది. ఎన్నికలపద్ధతి విషయంలో పప్పులో కాలు వేశాము.

ఫ్రాంటె. మనిషి — వోటటు తానెవరిని అభ్యర్థుడిగా ఎన్నుకోంటున్నాడో స్పష్టంగా చెప్పగలిగేలట్టు రాజ్యాంగప్రణాళికను మార్చాలి.

జెఫ — దాన్ని సవరించవచ్చును. మన రాజ్యాంగప్రణాళికలో ఉన్న సుగుణమే అది. అది పెరగటానికి అవకాశముంది.

మాడి — దాన్ని సవరించడానికి మనకెప్పుడైనా అవకాశం దొరికితే. బామ్ ! ప్రాణం విసిగిపోయింది దీంతో.

(ఒకయువకుడు తలుపుదగ్గరకు వస్తాడు.)

యువకుడు — జెఫర్సన్‌గా రిక్కడుంటారా ?

మి. కాన్రాడ్ — (ప్రవేశించి) కిందికి వెళ్ళబ్బాయి ! కిందికి.

ప్యాట్సీ — మిసెస్ కాన్రాడ్ ! రానీ అతన్ని.

మి. కాన్రాడ్ — ఓహో ! క్షమించు. ఇతను నా బోర్డరనుకున్నాను. (వెళ్ళిపోతుంది.)

యువ — జెఫర్సన్‌గారా ?

జెఫ — అవును, అబ్బాయ్ ?

యువ — నేను జ్ఞాపకంలేనా ? పన్నెండేళ్ళక్రిందట పారిస్‌లో ?

జెఫ — నువ్వు.........నువ్వు లాఫాయత్ కొడుకువి కావూ ?

యువ — (తల ఊపి) మీ సేవకుణ్ణి.

జెఫ — నువ్వు వస్తావని అనుకుంటూనే ఉన్నాను. అమెరికాలోనే ఉన్నావని విన్నాను. ప్యాట్సీ—జ్ఞాపకముందా ? (ప్యాట్సీతో) జార్జివాషింగ్టన్ లాఫాయత్.

ప్యాట్సీ — నాకు జ్ఞాపకమే.

(లాఫాయత్ వంగి నమస్కరిస్తాడు. ప్యాట్సీ తానూ యథోచితంగా నమస్కరిస్తుంది.)

లాఫా — రవ్వంతైనా మారింది కాదు. ఒక్క అందం మాత్రం హెచ్చింది.

ప్యాట్సీ — (నవ్వుతుంది) ఇంతకీ లాఫాయత్ కొడుక్కదా !

జెఫ — అతనిలో ఆ ప్రతిభఉంది. వీళ్లు నా మనమలు.

ప్యాట్సీ — (సగర్వంగా) నాకూతురు, మిస్ యానీరాండాల్ఫ్.

యానీ — (నమస్కరిస్తుంది) మిస్టర్ లాఫాయత్ !

లాఫా — (వంగి నమస్కరిస్తాడు) మిస్ రాండాల్ఫ్.

ప్యాట్సీ — (తనచిన్నకొడుకును ముందుకు తీసుకువచ్చి) నాకొడుకు. (సగర్వంగా) థామస్‌జెఫర్సన్ రాండాల్ఫ్.

(పిల్లవాడు యథోచితంగా నమస్కరిస్తాడు. లాఫాయత్ చిరు నవ్వు నవ్వుతాడు. జెఫర్సన్ ఆనందం ప్రకటిస్తాడు.)

జెఫ — నా స్నేహితుడు, మాడిసన్.

లాఫాయత్ — మీ అమర రాజ్యాంగ ప్రణాళికి పిత. (వంగి నమస్కరిస్తాడు.) గౌరవ పురస్సరంగా.

మాడి — అమరమా ? దాని కిప్పుడు బాగా జ్వరం వచ్చి ఉంది. కొద్దిరోజుల్లో, కొన్ని గంటల్లోనే తెలిసిపోతుంది — అది బతుకుతుందా లేక పురిట్లోనే సంధి కొట్టి నశిస్తుందా అని. (జెఫర్సన్‌తో) టామ్ ? నాకు చాలా భయంగా ఉంది. ఈ మూడు రాత్రుల్లు కంటికి కునుకు లేదనుకో.

జెఫ — పోయి లోపల పడుకో.

మ్యాడి — పడుకో లేను. పడుకో లేను.

జెఫ — ప్యాట్సీ ! జెమ్మీకోసం పక్క వేసిరా.

మాడి — అక్కర్లేదు. నేను పడుకోలేను. దయచేసి నన్నిక్కడే కూర్చోనివ్వండి. (కూర్చుంటాడు.)

జెఫ — (లాఫాయత్ కోసం కుర్చీ లాగుతాడు.) మేమిక్కడ ఒక పెద్ద తుపానులో పడి కొట్టుకుంటున్నాము.

లాఫాయత్ — (కూర్చుని) ఇలాంటి సమయంలో నేను వచ్చినందుకు విచారిస్తున్నాను — ఐతే అమెరికాలో దిగగానే మీ దగ్గరకే వచ్చేశాను తొందరగా.

జెఫ — చెప్పు. నాన్నా ఎలాగున్నారు ?

లాఫాయత్ — ఇప్పుడు జైల్లోంచి బైటికి వచ్చారు.

జెఫ — విన్నాను. చాలా కాలంనించి అతనికి ఉత్తరం వ్రాయడంలేదు. కొన్ని సంవత్సరాల పాటుగా ఇక్కడ పరిస్థితు లేమీ బాగాలేవు. వ్రాసినా నా ఉత్తరం మీకందేదే కాదు. (కొంచెంసేపాగి) ఎలాగున్నారు చూడడానికి ?

లాఫాయత్ — జైల్లో ఆరేళ్లు.

జెఫ — అతని ఆత్మను చితగ్గొట్టారా ?

లాఫా — అదెప్పుడూ చేయలేరు.

జెఫ — అవును, చేయలేరు.

లాఫా — తానెందుకు ఉత్తరం వ్రాయ సాహసించలేక పోతున్నారో మీతో వివరించి చెప్పమన్నారు. బోనపార్టీ ఆయనమీద నిగా ఉంచారు. ఆయన స్వేచ్ఛ — నామమాత్రమే.

జెఫ — (నిట్టూర్చి) బోనపార్టీ సీజరుకు బదులు వాషింగ్టనుకు విలువ ఇస్తాడని ఆశించాను. (వాషింగ్టన్ విగ్రహం వంక చూస్తాడు.)

లాఫాయత్ — (తాను కూడా అదే దిక్కుకు దృష్టి మరల్చి) ఈయనచనిపోయారని మేము విన్నప్పుడు నాన్న చిన్నపిల్లవాడిలా ఏడ్చాడు.

(విరామం)

జెఫ — నాడు ఒక మహామహుడు గతించాడు. అమెరికా ఇప్పుడు ఒంటరిగా నడవలసి వచ్చింది.

లాఫాయత్ — ఇక్కడ .... నన్ను క్షమించాలి. నేను ఆశించిన అమెరికా ఇది కాదు. బోనపార్టీ వచ్చేటప్పటికి మా దేశపరిస్థితు లెట్లా ఉండేవో ఇక్కడ సరిగ్గా అలాటి పరిస్థితులే ఉన్నాయి.

జెఫ — ఈ పెనగులాటలో భయంకరమైన ఛాయ లున్నాయి. నువ్వు కని పెట్టావు. తన సైనిక మిత్రులతో ఒక చిన్న బోనపార్టీ బయలుదేరి వచ్చి తన ఇష్టం వచ్చినట్లు ఈ దేశాన్ని బలవంతంగా పాలించవచ్చు.

లాఫాయత్ — (లేచి) అట్లా కాకూడదు. ఇదే సందేశం నాన్న మీకిమ్మన్నది. 'పీడిత ప్రపంచం అంతా అమెరికాకేసి చూస్తుంద' ని జెఫర్సన్‌తో చెప్పు అన్నాడు నాన్న. ప్రపంచానికి అమెరికాయే చివరి ఆశ అన్నాడు.

(ఎవరో తలుపు తట్టుతారు. జెఫర్సన్ తలుపు తెరుస్తాడు. ఒక వార్తాహరుడు నిలిచి ఉంటాడు.)

వార్తా — జెఫర్సన్‌గారా ?

జెఫ — అవును.

వార్తా — ఉత్తరం.

జెఫ — థాంక్‌యూ ! (వార్తావహుడు నిష్క్రమిస్తాడు. జెఫర్సన్ ఉత్తరం చింపి చదువుకొని ఉగ్రుడౌతాడు.)

మ్యాడి — (లేచి) ఏమిటది, టామ్ ?

జెఫ — ఫెడరలిస్టుల బృందం ఒకటి ఈవాళ రాత్రి సమావేశమౌతుంది.

మ్యాడి — ఎన్నికలను రద్దుచేయడానికా ?

జెఫ — కావచ్చు. (ఉత్తరం మాడిసన్‌కు ఇస్తాడు. మాడిసన్ చదివి ఆవేదనతో మూల్గుతాడు.)

ఫ్రాంటి. మనిషి — చేయనివ్వండి. చూతాము. నా చేతుల్లోంచి రిపబ్లిక్కును లాక్కోలేరు.

జెఫ — (ఫ్రాంటియర్ మనిషితో) మిత్రమా ! నిజం. (బల్లదగ్గరికి వెళ్ళి తాను వ్రాస్తున్న ఉత్తరం అందుకొని, దాన్ని మడిచి) ఇప్పుడు భోజనానికి వేళ లేదు. గుర్రం సిద్ధంగా ఉందో లేదో చూచుకుంటావా ?

ఫ్రాంటి. మనిషి — సరే. (వెళ్తాడు.)

జెఫ — (ఉత్తరం సీలు చేస్తాడు. ప్యాట్సీతో) ఇక ఇంటికి వెళ్లే ప్రయత్నంలో ఉండు.

ప్యాట్సీ — సరే నాన్నా !

జెఫ — ఇది ఇట్లాగే ఎన్నాళ్లుంటుందో చెప్పలేను. ఎలా అంతమౌతుందో కూడా చెప్పలేను.

(ఫ్రాంటియర్ మనిషి మళ్ళీవస్తాడు.)

ఫ్రాంటి. మనిషి — గుర్రం సిద్ధంగా ఉంది.

జెఫ — (ఉత్తరం ఇస్తాడు) గవర్నర్ మన్రోకు నా నమస్కారాలతో.

ఫ్రాంటి. మనిషి — చిత్తం.

జెఫ — గుర్రాన్ని పరుగెత్తించు.

ఫ్రాంటి. మనిషి — వాయువేగాన వెళ్తానండి. మీరు భయపడకండి. (నిష్క్రమిస్తాడు)

ప్యాట్సీ — మేము ఎప్పుడు వెళ్లాలి ?

జెఫ — ఇప్పుడే. (గడియారం చూచి) భోజనం తర్వాత.

ప్యాట్సీ — ఇంత త్వరగానా ?

జెఫ — అహ !

ప్యాట్సీ — చాలా పెద్దఅల్లరి అయ్యేటట్టుందా ?

జెఫ — నేను చెప్పలేను, ప్యాట్సీ !

ప్యాట్సీ — జనరల్ హామిల్టనేనా ? మళ్ళీ ? ఈ మనిషి దుర్బుద్ధికి అంతంలేదా?

లాఫా — హామిల్టన్నా ? (ఏమీతోచక) యుద్ధకాలంలో అతను మా నాయన మిత్రుడుగా ఉండేవాడే. మానాయన అతన్నిగూర్చి తరచు చెపుతుంటారు.

ప్యాట్సీ — యుద్ధం తర్వాత ఇక్కడివాళ్లు చాలా మారిపోయారు, లాఫాయత్ గారూ ! గడచిన అరేండ్లలో నిజమైన విప్లవ ఇక్కడ జరిగింది.

మాడి — అందులో ప్రజలు గెలిచారు, లాఫాయత్‌గారూ ! వోట్లు పెట్టిద్వారా ప్రభుత్వాన్ని వశపరచుకొన్నారు. ఇప్పుడు ఫెడరలిస్టులు దీన్నంతా కూల దోయాలని చూస్తున్నారు. వాళ్ల పరాజయాన్ని ఒప్పుకోడం లేదు.

(తలుపుతట్టిన ధ్వని)

ప్యాట్సీ — నాన్న అతి పాతమిత్రుల్లో ఒకడైన ప్రెసిడెంటు ఆతమ్ముని నాన్నకు పూర్తిగా వ్యతిరేకంగా చేశాడు.

లాఫా — ఇది ఆశ్చర్యంగా ఉంది. నేను నమ్మలేకుండా ఉన్నాను.

ప్యాట్సీ — మీ నాన్నకు ఇన్నాళ్లవరకు ఉత్తరం వ్రాయకపోవడానికి కారణమేమిటో తెలుసా ? ఆయన వ్రాయలేకపోయాడు—ఆయన ఉత్తరాలను వాళ్లు విప్పించేవాళ్లు. ఆయన ఉత్తరాల్లో వ్రాసే మాటలకు పెడర్థాలు కల్పించేవాళ్లు. వాటికి అలాంటి అర్థం వచ్చేట్టుగా అచ్చేసేవాళ్లు.

(మరోసారి తలుపు తట్టిన ధ్వని)

జెఫ — ప్యాట్సీ ! కొన్ని విషయాలు మరచిపోవడం మంచిది.

ప్యాట్సీ — నాన్నా! వీధిలో తుపాకులు పట్టుకుని మనుష్యులు నిలబడిఉన్నారు. హామిల్టన్ తన సైన్యాలతో వస్తాడని వాళ్లు ఎదురు చూస్తున్నారు—ఏవో యుద్ధం జరుగుతుందని వాళ్లంటున్నారు.

(తలుపు తెరుచుకుంటుంది. హామిల్టన్ నిలబడి ఉంటాడు. అందరూ నిష్క్రాంతపోతారు. నిశ్శబ్దం.)

హామి — మిష్టర్ జెఫర్సన్.

జెప — జనరల్ హామిల్టన్.

ప్యాట్స్ — సాహసించా.........

జెఫ — ప్యాట్సీ ! లోపలికి పో.

ప్యాట్సీ — అలానే, నాన్నా ! పిల్లలూ ! రండి. (పిల్లల్ని తీసుకుపోతుంది)

జెఫ — జనరల్ హామిల్టన్ ! వీరు జార్జి వాషింగ్టన్ లాఫాయత్‌గారు.

హామి — లాఫాయతా ? మీ రాయన కుమారులా ?

లాఫా — అవును.

హామి — మీ నాన్నను బాగా ఎరుగుదును. ఆయన నా మిత్రుడు.

లాఫా — తరచూ ఆయన మిమ్మల్నిగూర్చి చెపుతూ ఉంటారు. మీ రాయన మిత్రులే.

మాడి — (హ్యాటు పట్టుకొని వెళ్లబోతాడు.) జంటిల్‌మన్ !

లాఫా — సెలవైతే నేనూ మీతో వస్తాను.

మాడి — రండి.

జెఫ — మీరు మాతో భోంచెయ్యాలి. (లాఫాయత్ తల పంకిస్తాడు) ఇరవై మూడు నిమిషాల్లో.

లాఫా — ఐరవై మూడు.

జెఫ — సరిగ్గా. మిసెస్ బ్రాన్డ్ తన భోజనశాలను ప్రజాస్వామిక పద్ధతులపై నడుపుతుంది. ముందు వచ్చిన వాళ్లకు మంచి కుర్చీలు దొరుకుతాయి.

(లాఫాయిత్ చిరునవ్వుతో [illegible] హామిల్టన్‌ని [illegible])

లాఫా — హామిల్టన్‌గారూ ?

(హామిల్టన్ నమస్కరిస్తాడు. [illegible] స్తాడు. జెఫర్సన్, హామిల్టన్‌లు [illegible] మాట్లాడుకుంటారు.)

జెఫ — జనరల్ హామిల్టన్ ! నేను చేయగలిగిందేమైనా ఉందా ?

హామి — ఏమీలేదు. కాని మీకోసం నేను చేయగలిగింది ఉంది. నేనేమీ మొహమాటు పడేవాణ్ణికాను. మిష్టర్ జెఫర్సన్ ! మీయెడ నాకున్న భావాలు ఏమీ మారలేదు. మిమ్మల్ని మీ సమస్తభావాల్నీ అసహ్యించుకొంటున్నాను.

జెఫ — (బల్లదగ్గరికి జరిగి కుర్చీ చూపిస్తాడు) కూర్చోండి జనరల్ !

హామి — నేను చెప్పింది అర్థమైందా ?

జెఫ — చాలా చక్కగా. (మళ్లా కుర్చీ చూపించి) కూర్చోండి.

హామి — (కూర్చుంటాడు) థాంక్ యు ! (విరామం. ఎగాదిగా ఒకళ్లనొకళ్లు చూచుకుంటారు.) చాలా చిక్కిపోయారు,

జెఫ — మీరు లావెక్కారు.

హామి — ఏమీకాదు. ఈ వేస్టుకోటువల్ల అలా కనిపిస్తున్నాను.........అయినా కొంత హెచ్చానేమో ! (విరామం. హామిల్టన్ కిటికీలోనుంచి తొంగి చూస్తాడు.) అయితే ఇదా మీ వాషింగ్టన్ నగరం ? ఒక మట్టిపుట్ట.

జెఫ — కొన్ని చెట్లు ; కొన్ని పక్కదారులు ఉంటే చాలు.

హామి — మనం కలిసిన మొదటిరోజున ఇది పుట్టింది.

జెఫ — అవును.

హామి — మీకు జ్ఞాపకముందా ?

జెఫ — అవును.

హామి — అధ్యక్షప్రాసాదం అంతపెద్దగా లేదు.

జెఫ — పెద్దగా లేదు.

హామి — పెద్దదిగానే ఉంది.

జెఫ — ఇద్దరు చక్రవర్తులకూ, ఒక రాజుకూ సరిపోయినంత ఉంది.

హామి — ఎవరది—మువ్వా, యూవర్ఇబ్రా ?

జెఫ — కాంగ్రెసు నిర్ణయిస్తుంది.

హామి — (లేస్తాడు) కాంగ్రెస్‌లో నాకు కొంతమంది మిత్రులున్నారు. ఆ నిర్ణయ మేదో మీకు ప్రతికూలంగానూ చేయించగలరు, అనుకూలంగానూ చేయించ గలరు.

జెఫ- నాకామాట నమ్మకంగా తెలుసు.

హామి — నిశ్చయంగా తెలుసా ? నాకు నమ్మకం లేదు. మీకు ఆశ్చర్యం కలుగ వచ్చు, మిస్టర్ జెఫర్సన్ ? కాంగ్రెసులో కొందరున్నారు. వాళ్లకు నేనేం సలహా ఇచ్చినా సరే మీకు బదులు దెయ్యానికైనా వోటేస్తారు.

జెఫ — అవును. అది సాధ్యమే.

హామి — అలా చేయమని, చేస్తారని కాదు — నేను దాని నంగీకరించను. వాళ్లిలా చేయటం చాలా శోచనీయం. ప్రజాశ్రేయస్సందర్భంలో వాళ్లు తమ యుక్తా యుక్త విచక్షణజ్ఞానం ఉపయోగించాలి. ఆవేశంలోపడి పిచ్చిగా ప్రవర్తించ రాదసు. మీరు కొన్ని షరతులు ఒప్పుకుంటే కాంగ్రెసును మీవైపుకు తిప్పేస్తాను.

జెఫ — అలానా ?

హామి — (డెస్కు దగ్గరికి జరుగుతాడు.) ఒకటి : నా స్నేహితుల నందరిని ఇప్పుడున్న ఉద్యోగాలలో ఉండనివ్వాలి. నాకీవిషయంలో ప్రమాణపూర్వక మైన వాగ్దానం కావాలి. రెండు : నాకు........

జెఫ — (చిరునవ్వు, తల ఊపుతాడు.) నే నలా చేయలేనంటున్నాను చింతిస్తున్నాను.

హామి — మీరు నిరాకరిస్తున్నారన్నమాట ?

జెఫ — ఈసారి బేరాలాడను. మీ అంతరుద్దేశాలను గ్రహిస్తున్నాను........

హామి — (కోపంతో కేకలు వేస్తాడు.) బేరాలా ? మీ మనస్సు ఎంతటి చిన్నకాల వల్లో ప్రవహిస్తుంది !

జెఫ — కేకలు వేయవలసిన అవసర మేముంది, జనరల్ ?

హామి — (ఆగ్రహావేశంతో అటూ ఇటూ పచారు చేస్తూ) నేను తలచుకొంటే ఉరికప్ప ఎత్తేస్తాను.

జెఫ — (పక్క గదివైపు తలతిప్పి చూపుతూ) నామనుమలు........

హామి — క్షమించండి.

జెఫ — ఇదేదో పాతకాలంలా ఉంది, జనరల్ !

హామి — ఈ పరిస్థితి ఎంతగా విషమించిందో మీ రూహించారా ?

జెఫ — అవును.

హామి — నేను రాజీపడ్డానికి వచ్చాను. దీనికి బదులు వచ్చేదాన్ని జరక్కుండా

చేయాలని ఆశించాను—కాని మీకు వృద్ధాప్యం వస్తున్నకొద్దీ మొండితనం హెచ్చుతూంది. అనవసరంగా నాకాలం వృథాచేశా నిక్కడ.

జెఫ — చేతులు కట్టుకొని నేను ప్రెసిడెంటు పదవి స్వీకరించలేను.

హామి — మీరు దాన్నిగూర్చి బాధపడకండి. మీరు ప్రెసిడెంటు పదవి స్వీకరించనేలేరు. నామిత్రు లీవేళ సమావేశమౌతున్నారు. ఈ ఎన్నికలను రద్దుచేసి వాళ్ల ఇష్టం వచ్చిన మనిషిని ఎన్నుకోమంటారన్నమాట.

జెఫ — (ఉగ్రుడై) వాళ్లు రాజ్యాంగప్రణాళికను తుత్తునియలు చేస్తున్నారన్నమాట.

హామి — దాన్ని సాగదీస్తున్నారు.

జెఫ — (లేచి) దాన్ని ఛిన్నాభిన్నం చేస్తున్నా రంటాను. (హ్యామిల్టన్ భుజాలు ఊపుతాడు) కాపిటల్ బిల్డింగుచుట్టూ జనాన్ని చూశారా ?

హామి — ఒక పిస్టల్ పేలిస్తే ఎక్కడివా ళ్ళక్కడ పారిపోతారు.

జెఫ — మిమ్మల్ని మీరు మోసపుచ్చుకోకండి, మన ప్రజల్ని ఈ విధంగా తోసేయడానికి వీల్లేదు. (అతని చేతి కొక ఉత్తరం ఇస్తాడు.) మేరీలాండ్ నించి. నిన్నరాత్రి పదిహేనువేల మంది సమావేశ మయ్యారు. ఈ విధంగా తీర్మానించారు. ఎవడైనా ప్రెసిడెంటు పదవిని అపహరించాలని ప్రయత్నించ సాహసించాడా వాళ్ళందరూ ఒక్కుమ్మడిగా వచ్చి అతన్ని వధిస్తారు. (బల్ల మీదనుంచి చాలా ఉత్తరాలు ఎత్తుకుంటాడు.) పెన్సిల్వేనియా గవర్నరు మెక్లీన్ నించి; .... వర్జీనియా గవర్నరు మన్రో నించి; వాళ్ళ సైన్యాలు ఒక క్షణం నోటీసులో బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నాయి. ఈవేళ రాత్రి మీరు ఎన్నికలను రద్దుచేశారా ! రేపు ఉదయం వీధుల్లో రక్తం ప్రవహిస్తుంది.

హామి — నేను పాతసిపాయిని. మార్గాంతరం మీరు చూపించకపోతే........

జెఫ — మీకు మార్గాంతరం ఉంది. ఈ ప్రతిష్టంభనాన్ని అంతమొందించండి. మీ స్నేహితులతో మీ పలుకుబడి ఉపయోగించి యారన్‌బర్‌ను ప్రెసిడెంటుగా చెయ్యండి.

హామి — మతిభ్రమణమా ?

జెఫ — కాదు. నిజంగా రాజ్యాంగప్రణాళికాభగ్నంకంటె అదే మంచిదని నా అభిప్రాయం.

హామి — అయితే యారన్‌బర్ ప్రెసిడెంటు కావాలంటారా ?

జెఫ — అతడు చాలా యోగ్యుడు, తెలివైనవాడు ; శ్రమపడతాడు ; ప్రజలంటే అతనికి విశ్వాసముంది.

హామి — దైవమా ! విన్నదంతా నమ్మే అమాయకులు మీరు. అతన్ని నే నెరుగు

దును. నాకంటె ఎక్కువగ అతను మీ ప్రజాస్వామ్యాన్ని ద్వేషిస్తాడు. అయినా అతడు దానిలోఉన్న అవకతవక లన్నిటికీ పక్కతాళం వేస్తున్నాడు. ఎందుకు ? అతడు జిత్తులమారిన నక్క. అతనికేమీ నీతిలేదు. అతని నియమ మొక్కటే : ఏవిధంగానైనా అధికారం నిలబెట్టుకోవడం.

జెఫ — అది మీ అభిప్రాయం.

హామి — అదినిజం. అలాగని నామొహంమీద చెప్పాడు డజనుసార్లు.

జెఫ — దానికి వ్యతిరేకంగా ప్రమాణంచేసి చెప్పాడు నాతో.

హామి — బర్ ఇప్పటికి చాలా సంవత్సరాలనుంచి దివాలాతీసి ఉన్నాడు. అయినా ఈ ఎన్నికల్లో చాలా డబ్బు ఖర్చుపెట్టేడు. ఎక్కడ్నించి వచ్చింది డబ్బంతా ?

జెఫ — అది నాకు తెలియదు.

హామి — అతని భోజనపు బల్లవద్ద ఎవరినిగూర్చి మాట్లాడుకుంటారనుకున్నారు ? ఎవరి ఆరోగ్యానికి మధుపానం జరుగుతుందనుకున్నారు ? ఊహించగలరా ?

జెఫ — ఎవరది ?

హామి — బోనపార్టీ.

జెఫ — బోనపార్టీయా ? నేను నమ్మలేను.

హామి — (జేబులోంచి కొన్ని కాగితాలుతీసి బల్లమీద పెడతాడు.) తార్కాణాలు. మీకు కావాలంటే. బర్ అమెరికాకు కేథలిక్ అనుకోండి. అతను ఎంతకైనా సాహసిస్తాడు. ఒక రాక్షసుణ్ణి సాలీడుతాళ్ళతో కట్టగలరు. కాని అతని ఆశను వాగ్దానాలచేత కట్టలేరు. ఒక్కసారి ప్రెసిడెంటయ్యాడా అతడు మన సంస్థలన్నిటినీ నాశనం చేస్తాడు. శాశ్వతంగా అధికారాన్ని అపహరిస్తాడు. నియంత అవుతాడు.

జెఫ — మీకు వాటియందు విశ్వాసం లేదని నాకు తెలుసు. కాని ఇలా ఇదంతా జరుగుతూ ఉంటే అమెరికన్ ప్రజలు చూస్తూ ఊరుకుంటా రనుకుంటారా ?

హామి — వాళ్ళలో నాకేమీ విశ్వాసం లేదు. ఐనా మీరన్నట్టే అనుకుందాము. వాళ్లు దెబ్బలాడ్తారు. అప్పుడు అంతర్యుద్ధం జరుగుతుంది. బోనపార్టీకి కావల సిందీ అదే. అతడు మన మీదికి దూసుకువస్తాడు. (పిడికిలితో బలగుద్దుతాడు.) అదీ. (విరామం. జెఫర్సన్ నిదర్శనాలను శ్రద్ధతో చూస్తాడు.) ఇప్పుడునాఉద్దేశం మీ కర్థమైందా? ఈ దేశం శ్రేయస్సౌభాగ్యాలు ఎక్కడఅంతరిస్తాయో అని భయంగా ఉంది. (హామిల్టన్ వాషింగ్టన్ విగ్రహం కేసి చూస్తాడు) కురాఛీ విగ్రహమా ?

జెఫ — (నిదర్శనాలు పరిశీలిస్తూ) అవును.

హామి — వహ్వా ! అద్భుతంగా ఉంది. ఈ మహామహుడి విగ్రహం నాకోసం కూడా ఒకటి చేసిఇమ్మని పురమాయించాను — (జెఫర్సన్ పైకిచూచి నిట్టూరుస్తాడు. అతను అలసిపోయిఉన్నాడు ఏమీ తోచనట్టుంటుంది.) మిత్రమా ? మోసపడ్డావోయి.

జెఫ — (చిరునవ్వు నవ్వుతూ) మిమ్మల్నే అనుమానించాను.

హామి — ఏమని ?

జెఫ — మా బోనపార్టీవి కావాలని ఎత్తులువేస్తున్నట్లు.

హామి — వాషింగ్టన్ చచ్చినప్పుడు నేను కాగలిగేవాడినే. కాని ఎందుకు కాలేదు ?

జెఫ — ఎందుకు కాలేదు ?

హామి — బర్ కూడా ఇదే ప్రశ్న వేశాడు. అసహ్యభావంతో. ఇది మీకోసం కతినమే కావచ్చు — కాని ఊహించి చూడండి. నాకు ఈదేశమంటే ప్రేమ ఉంది. ఈ దేశంకోసం నేనుయుద్ధరంగంమీదా కౌన్సిల్‌రంగంమీదా పోరాడాను. నావ్యక్తిగతమైన లాభం, ఇచ్ఛా — వీటన్నిటిమీదా ఈదేశం సంపన్నంగానూ బలవంతంగానూ ఉండాలని కోరుతున్నాను, (విజయగర్వంతో) ఇప్పుడు చెప్పండి. నా షరతులను ఒప్పుకొంటారా ?

(విరామం)

జెఫ — (దీనంగా) ఒప్పుకోలేను.

హామి — (బల్లదగ్గిరికి జరిగి) నా అంతరాత్మ స్వచ్ఛంగా ఉంది, ఇప్పుడేం చేయాలో నాకు తెలుసు.

జెఫ — అదే మీరుచేస్తే మీరు దేన్నిఖండిస్తున్నారో అదే జరుగుతుంది.

హామి — (కాగితాలు అందుకుంటాడు) బహుశా. బహుశా బోనపార్టీలతోను బర్రులతోను నిండిఉన్న ప్రపంచంలో అదొక్కటే మన ఆశ యేమో.

జెఫ — మరిదానివల్ల మనం సాధించేదేమిటి ?

హామి — సుదినము, మిష్టర్ జెఫర్సన్ ! (తలుపువద్దకు వెళతాడు.)

జెఫ — (లేచి) హెచ్చరిస్తున్నాను. రేపు రక్తపాతం అవుతుంది.

హామి — కాదు. ఏమీకాదు. మీ సహాయం వాంఛిస్తున్నాను. మీ రా రక్తపాతాన్ని అరికట్టుతారు.

జెఫ — (తీవ్రంగా) నువ్వు పొరబడుతున్నావు, మిత్రమా !

హామి — (ఆగి, గిర్రున తిరుగుతాడు) నా పొరపాటు మీరు క్షమిస్తారు.

జెఫ — (హామిల్టనువద్దకువచ్చి) నేనూ అందులో ఒక భాగమౌతాను.

హామి — మీరా ?

జెఫ — (ఘీంకరిస్తూ) అవును.

హామి — (లోపలికివస్తాడు, ఆశ్చర్యంతో అతనివైపుచూస్తాడు) మీరు నిజంగా అంటున్నారా ?

జెఫ — నన్ను సృష్టించిన భగవంతుడి సాక్షిగా, నేను నిజంగా అంటున్నాను. ఒక్కనిముషంలో నారక్తనాళాలూ నీరక్తనాళాలు చీలుస్తారు.

హామి — నన్నాశ్చర్య నిమగ్నుణ్ణి చేస్తున్నారు.

జెఫ — ఎందుకు ? దేశభక్తులయొక్కా నిరంకుశులయొక్కా రక్తసేచనంతోనేకదా స్వాతంత్ర్యవృక్షం పెరుగుతుంది ?

హామి — గడ్డుతేరిన ముసలివాడవయ్యావు.

జెఫ — నన్నింత గడ్డుతేర్చిందెవరు ?

హామి — (వికటాట్టహాసంతో) అయితే నాజీవితం వృథాకాలేదు.

జెఫ — అదినిజం. (హామిల్టన్ జెఫర్సన్‌కేసి తేరిపార చూస్తాడు) హామిల్టన్ ! నేను చెప్పేది శ్రద్ధగా వినండి.

హామి — ఇది వింతగా .... ....

జెఫ — శ్రద్ధగావినండి. మీ రీదేశాన్ని ప్రేమిస్తున్నారని నాకుతెలుసు. కాని మీరు దాన్నెప్పుడూ అర్థంచేసుకోలేదు. మీరు బోనపార్టీ అంటే భయపడుతున్నారా ? భయపడనవసరంలేదు. బోనపార్టీ చస్తాడు. అతని నిరంకుశత్వమూ చస్తుంది. మనం బతుకుతాము. మనం స్వతంత్రంగా ఉంటాము. మీరు బర్ అంటే భయపడుతున్నారా ? బర్ ఏదైనా మతిలేని సాహసం చేశాడా ? మన ప్రజలనే రాతిబండపై పడి చితికిపోతాడు. చూశారా ? మీరెప్పుడూ ఇదే పొరపాటు చేశారు. అమెరికన్ ప్రజలశీలాన్ని మీరిప్పటికీ సరిగ్గా లెక్కవేశారుకారు. వాళ్ళని మీరింకా అర్థంచేసుకోలేదు — ఈక్షణానికి.

(పెద్ద విరామం)

హామి — ఒప్పుకుంటాను. అర్థం చేసుకోలేదు. (కూర్చొంటాడు.)

జెఫ — (మార్దవంతో అతని ప్రక్కను నిలబడి) ఇది పద్ధతి కాదయ్యా, హామిల్టన్ ! నన్ను నమ్మండి. మీరు నిజంగా ఈదేశాన్ని ప్రేమిస్తున్నారంటే ఇదికాదు మార్గం. స్వాతంత్ర్యంకోసం విప్లవంలో పోరాడిన మనప్రజలు, ప్రతి బలి దానంచేసి, ప్రతి ఆపత్తును ఎదుర్కొన్న మనప్రజలు, ఒక నిరంకుశుడికి బదులు మరొక నిరంకుశుడిచే పరిపాలింపబడ్డానికి కాదు తమ రక్తం ధార పోసింది. (శక్తివంతమైన గొంతుతో) స్వాతంత్ర్యం తమ చేతుల్లో పెట్టుకో డానికి, ఒక మనిషి దుర్బుద్ధి ఎన్నడూ తమ్ము పీడించకుండానికి, వీల్లేకుండా

ఉండాలని వాళ్లు రక్తం ధారపోసింది. ఒక నియంత క్రింద అణగి ఉండే వాళ్ళు కాదు. వీళ్ళు — ఒకళ్ళ నిరంకుశాజ్ఞలకు లొంగి ఉండేవాళ్ళు కాదు. వీళ్ళు, వాళ్ళహృదయాల్లో. భయం పాత తేరెవరున్నా. భయాన్ని ప్రభుత్వం నియమంగా వాళ్ళు పాటించరు. నేనెరుగనుమను వాళ్లని. నాకు వాళ్లయందు విశ్వాసం ఉంది. తుట్టతుదకు వాళ్ళు గెలుస్తారన్న విషయంలో నాకు సందేహంలేదు.

హామి — (తడబడుతూ) నాకలాంటి విశ్వాసంఉంటే బాగుండేది. (తలపంకిస్తాడు) నాకు తెలియదు. నిజంగా నేను వాళ్ళనెరగను. ఇక్కడనే నేను నిస్సహాయుడనైపోతాను. దిన దినమూ నే నీదేశానికి పరాయివాణ్ణయిపోతున్నాను.

జెఫ — ఐనా దాని నిర్మాతల్లో మీరొకరు.

హామి — ఒక్కొక్కప్పుడు మన యిష్టానికి వ్యతిరేకంగాపెద్దా ఒక కెరటంలా ఏదోవచ్చి మన్ని ఎక్కడికో కొట్టుకుపోతుంది. అక్కడ మనచేత పనులు చేయిస్తుంది. నాకు దీనిలో ఎప్పుడూ నమ్మకంలేదు. ఐనా దాన్ని నిర్మించడంలో నేను భాగంతీసుకొన్నా నంటున్నారు. (ఓనిప్రతిఅంగుళమూ, (విరామం. అతనులేచి నిలబడతాడు.) ఐనా నేననుకొన్నదానికంటె ఎక్కువగా బాగా పనిచేస్తుంది దేశం. ఈ దెబ్బకిది తాళుకుంటే ....

జెఫ — తాళుకోగలదు. తాళుకుంయుండకపోదాసు ఈ తరంగం ఆపరానిది. దాన్ని ఆపలేరు. చిరకాలంక్రిందట పోయిన స్వాతంత్ర్యంయొక్కపరద ఇది. మీరెంతైనాప్రయత్నించండి, దాన్ని ఆపలేరు. మీరు ఒక్క క్షణంకోసం దాన్ని మార్గంతప్పించగలరేమో కాని చివరకుఓడిపోతారు. పాతకాలపునిరంకుశత్వం అన్యాయాక్రమంగాచేసి చూడండి. తప్పకుండా ఓడిపోతారు. బోనపార్టీ మానవ స్వాతంత్ర్యయుగాన్ని కొద్దిగా వెనక్కి నెట్టగలడు — ప్రపంచాన్ని రక్తనదులచే నడుపవచ్చు. అయినా చివరకు అలసిపోయి వాళ్ళరక్తంలో వాళ్ళేమునిగిపోతారు. — మానవజాతి స్వాతంత్ర్యం, స్వపరిపాలనం అనుభవిస్తూనే ఉంటుంది. జనరల్ హామిల్టన్ ! ఈ మార్గాన నడిచారా, తప్పక ఓడిపోతారు. నామాట నమ్మండి (బల్లకేసి వెళతాడు. చివరిమాట చెపుతున్నట్టుగా) నేను రాజీపడను, జనరల్‌హామిల్టన్ ! మీరేంచేయదలచుకున్నారో చేయండి. ఈ విషయంలోనేను సమాధానపడను.

హామి — (చెయ్యి చూస్తాడు. చెయ్యి వణుకుతూ ఉంటుంది.) నాకు జ్వరం పట్టుకొన్నప్పటినుంచి ఒక గడ్డివామిని సైతం పిస్తోలుతో కొట్టలేకపోతున్నాను. బర్ పాములాంటివాడు. మెత్తగా ఉంటాడు. అమెరికాలో అతనికి మించిన

సుదెగాడు లేడు. అతనితో ఇప్పటికే అయిదేళ్లపాటు పెట్టుబాటాను. ఈ విష యంలో అతనికి విరోధించినా నాపై సవాలు పంపిస్తాడు. అందులో నాకేమీ సందేహం లేదు. నే నిప్పుడే చచ్చిఉన్నాను. మీరు విజాయితే కలవారు. నేను నామిత్రులతో ఈ ప్రతిష్టంభనాన్ని అంతం చేయమంటాను. మీరు అధ్యక్షులు కండి. మీరు సంపూర్ణవిజయం పొందారు.

జెఫ — ఇందులో వ్యక్తిగతమైన విజయమేమీ లేదు నాకు. ఇది నాకోసం కావా లని ఎన్నడూ కోరలేదు. ఇప్పటికీ నేను కోరటం లేదు. నా స్వంతవ్యవహా రాలు ఇప్పటి కెన్నాళ్లనించో నేను చూచుకోటం లేదు. మరో ఉద్యోగమే అయితే నాకు చాలా తీరిక దొరికేది. నా పరిస్థితులు చక్కబెట్టుకొనేవాణ్ణి. దివాలా తప్పేది. ప్రెసిడెంటు నయ్యానా! నాకున్నదంతా తప్పుకుంటా పోతుంది. మాంటిసెల్లో కూడాను. అది నాకు ప్రాణప్రదమైంది. అక్కడ నా భార్యా, నలుగురు పిల్లలూ ఉన్నారు. నా యౌవనస్వప్నాలన్నీ అక్కడే ఉన్నాయి. కానీ! నీకు కృతజ్ఞుణ్ణి. మహత్తరమూ మహోజ్వలమూ అయిన ఈ బాధకు!

(హామిల్టన్ వంగి నమస్కరించి నిష్క్రమిస్తాడు. జెఫర్సన్ తిరిగి వాషింగ్టన్ ప్రతిమకేసి చూస్తాడు.)

---

## రెండవ రంగం

రంగం: సెనేట్ చాంబరు లోపలిభాగం. జెఫర్సన్ చేయెత్తి ప్రధాన న్యాయమూర్తి మార్షల్ ఎదుట ప్రమాణం చేస్తున్నాడు.

జెఫ — నేను విశ్వాసంతో యునైటెడ్ స్టేట్సు అధ్యక్షపదవి నిర్వహిస్తానని మన స్సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. నాశక్త్యనుసారం యునైటెడ్ స్టేట్సు రాజ్యాంగ ప్రణాళికను భద్రపరచి, సంరక్షించి, కాపాడతానని ప్రమాణం చేస్తున్నాను.

(జస్టిస్ మార్షల్ సమావేశమైన ప్రేక్షకులకు జెఫర్సన్ను పరి చయం చేస్తాడు. సంకోచిస్తూ వంగుతూ జెఫర్సన్ ముందుకువచ్చి ప్రేక్షకులను కలుసుకుంటాడు. ప్యాట్సీ వైపు చూస్తాడు. ఆమె యానీని, జెఫ్ను తీసికొని సగర్వంగా నిలబడుతుంది. ప్యాట్సీ

చిరునవ్వు నవ్వి తలపంకిస్తుంది. జెఫర్సన్ నీరసంగా చిరునవ్వు నవ్వుతాడు. (ప్రేక్షకుల వైపు తిరిగి జంకుతూ మాట్లాడ నారంభిస్తాడు.)

జెఫ — మిత్రులారా ! సాటిపౌరులారా ! మనదేశంయొక్క అధ్యక్షపదవిని వహిస్తూ నాయందింత అనుగ్రహము చూపిన తోటి పౌరులకు ఇక్కడ సమావేశమైన పౌరులద్వారా కృతజ్ఞతాపూర్వకమైన వందనము లర్పిస్తున్నాను. మానవాక్షు లింకా చూడని అదృష్టసీమలకు సత్వరంగా పయనిస్తూ, ఒక విశాలమైన భూభాగంపై వ్యాపించి, శుభోదయం పొందుతున్న ఒకజాతి నా ఈ మహ దుద్దేశాలను యోచిస్తున్నకొద్దీ, ప్రియమైన ఈ దేశం గౌరవం, సుఖం, ఆశలు ఊహిస్తున్నకొద్దీ—ఈ మహత్కార్యసాధనకు నేను తగుదునా తగనా అని నాలో నేనే క్రుంగిపోతున్నాను. ఇక్కడ సమావేశమైన పల్వురు ఉండబట్టిగాని లేక పోతే నేను పూర్తిగా నిస్స్పృహ చెందేవాణ్ణి. పరస్పర సంఘర్షణ ధర్మంగాగల ఈక్షుభిత ప్రపంచంలో మనమంతా ప్రయాణిస్తున్న ఈ నావను సురక్షితంగా నడపడానికి నాకు మీ మార్గదర్శిత్వం, చేయూతా కావాలి.

మంచిప్రభుత్వం మొత్తంమీద ఇలాఉండాలి : ఏస్థితులువున్నా, ఏవృత్తిలో వున్నా సమస్తమైనవారికీ సరియైన సమానమైనన్యాయం; ఎన్నిక హక్కు యొక్క సంరక్షణ; అధికసంఖ్యాకుల తీర్మానానికి పూర్తిగా తలఒగ్గడం — ఇది ప్రజాతంత్రంయొక్క ముఖ్యసూత్రం. ఇది తప్పితే దౌర్జన్యం తప్ప వేరు మార్గంలేదు. దౌర్జన్యం నిరంకుశత్వానికి జన్మస్థానం .... .... మన స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం, వ్యక్తిస్వాతంత్ర్యం, నిష్పక్షపాతంగా ఎన్నుకొన్న జ్యూరీలచే తీర్పు — ఇవిఅన్నీకలసి ఒక నక్షత్రరాశి. క్రాంతి కాలంలో సంస్కరణకాలంలో ఇవేసూత్రాలు మనకు మార్గదర్శులుగాఉండి మనకిప్పుడాదర్శప్రాయంగా ఉన్నాయి. మన పురుషుల వివేకం, మనవీరుల రక్తం మనకోసం ఈ సూత్రాలను ఈ హక్కులను సంగ్రహించేయి. మన రాజకీయమతం ముఖ్యసూత్రాలివి. మన ప్రభుత్వోద్యోగులకివి నికషం. మనం పొరపాటునగాని, భయానగాని, — వాటినుండి దూరంగా తొలగిపోయామా వెంటనే తొందరపడి వెనక్కి పోదాము. మళ్ళా సవ్యమైన దారి అందు కొందాము. ఇదేమార్గం. శాంతికి, స్వాతంత్ర్యానికి, సురక్షిత స్థితికి మన్ని తీసుకుపోతుంది, పాతప్రపంచం అల్లకల్లోలంగాఉంది. వేదనపడుతుంది. విదేశాలలో రక్తం ప్రవహిస్తూంది. హత్యాకాండ సాగుతూంది. సముద్రంఅంతా

దూరంగా సంక్షోభంపొందుతున్నా శాంతంగాఉన్న మన తీరానికి సంక్షుభిత్ తరంగాలువచ్చి చేరుతున్నాయంటే ఆశ్చర్యంకాదు. కొందరు వీటినిచూచి చలిస్తున్నారు, కొందరు భయపడుతున్నారు. మరికొందరు అక్కడేమిజరుగుతున్నా ఇక్కడ చలించకుండా శాంతంగానే ఉన్నారు. కొంతమంది — నిజాయతీగలవాళ్ళే — ఇక్కడ ప్రజాతంత్రం బలంగా దృఢంగా ఉండజాలదని భయపడుతున్నారన్న సంగతి నాకు తెలుసు. ఈ ప్రభుత్వం అంతబలమైనది కాదని వాళ్ళభయం. కాని నిజాయితీకల ఏదేశభక్తుడైనా ఈప్రయోగం సంపూర్ణంగా సఫలమౌతున్నసమయంలో ఇన్నాళ్ళు మన్ని స్వతంత్రంగాను దృఢంగాను ఉంచిన ప్రభుత్వాన్ని స్వసంరక్షణకోసం దీనికి బలం చాలదేమోనన్న అనుమానంవల్ల భయంవల్ల విడిచిపెట్టేస్తాడా ? నేనిది నమ్మను దానికి వ్యతిరేకంగా నావిశ్వాసం ఇది : ప్రజల క్రమజీవితంపై దాడిజరిగినప్పుడు ప్రతి వ్యక్తీ జండావైపుపరిగెత్తి తనస్వంతపనిలో ఆదాడిని ఎదుర్కోడం — అలాంటి ప్రభుత్వం ప్రపంచంలోకెల్లా దృఢతమమయిందని నమ్ముతాను. ఈ ప్రభుత్వం ప్రపంచంలోకెల్లా ఉత్తమతమమైన ఆశ అని విశ్వసిస్తున్నాను — ఇదే నేనెరుగుదును ...

# రెండు నాటికలు

## ఆత్మాభిమానం :

మూలం : జాన్ పాట్రిక్.

వేరు వేరు మనస్తత్వాలు అతి సహజంగా చిత్రింపబడిన నాటిక - ఇందులో లాచిపాత్ర ఒక ప్రత్యేకత.

## దేశాభిమానం :

మూలం : సిడ్నీకింగ్స్లే.

నాయకుల ఎన్నికలు, ఎన్నికల తతంగం యథాతథంగా నిరూపింపబడ్డాయి. నాయకుల వ్యక్తిత్వాలు అతి సన్నిహితంగా చిత్రింపబడ్డాయి.





పల్లిపర్రు : అద్దేపల్లి అండు కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము